## ప్రపంచప్రఖ్యాతి గాంచిన కేరళ ఆయుర్వేద వైద్యశాల వారి ప్రత్యేక చికిత్సలు!! (ఆపరేషన్‌లు లేకుండా)

## H.I.V / A.I.D.S. H.I.V / A.I.D.S. వ్యాధిగ్రస్థులకు శుభవార్త!!

H.I.V / A.I.D.S లు నయముకాని వ్యాధులని అనుకుంటున్నారా? దక్షిణ కాలిఫోర్నియా యూనివర్శిటీ వారి పరిశోధన ప్రకారం 'మానవ శరీరంలోని A.P.O.B.E.C-3G అనే ఎంజైము ఉంటుంది. H.I.V శరీరములోనికి ప్రవేశించిన వెంటనే దాన్ని అడ్డుకునే సామర్థ్యం కల్గిన ఎంజైము శరీరములోని ప్రతి కణములోను ఉంటుంది.' శరీరములోని ప్రతికణములో ఉన్న బలహీనపడిన A.P.O.B.E.C-3G ఎంజైమును శక్తివంతం చేస్తే అది H.I.V ని నాశనం చేస్తుంది. మా మందులు వైరల్ లోడ్‌ని తగ్గించి CD-4 కౌంట్ పెరిగి సాధారణ స్థితికి వస్తుంది. H.I.V సోకిన వ్యక్తిని A.I.D.S నుండి కాపాడవచ్చు. H.I.V /A.I.D.S లు ప్రాణాంతకాలు కావు. డాక్టర్ సలహా మేరకు మందులు వాడి CD-4 కౌంట్ (Immunity)ని 800 నుండి 1500వరకు పెంచుకొని పూర్తి జీవితకాలం ఆరోగ్యముగా జీవించవచ్చును. ఎలాంటి ఆహార నియమాలు లేవు. ఆల్కాహాల్ సేవించరాదు

## కేన్సర్ - CANCER కేన్సర్ - CANCER - వ్యాధిగ్రస్థులకు శుభవార్త!! (ఆపరేషన్‌లు లేకుండా)

*మెదడు *నోరు *థైరాయిడ్ గ్రంథి *స్తనములు *ఊపిరితిత్తులు *అన్నవాహిక *జీర్ణాశయము *పసరుతిత్తి *కాలేయము *పాన్‌క్రియాసిస్ *మూత్రపిండములు *ప్రాస్టేటు గ్రంథి *మూత్రకోశము *జీర్ణ కోశము *ప్రేగులు *గర్భాశయ కంఠము (సెర్విక్స్) *గర్భాశయము *అండములు *పురుషాంగము *వృషణములు *న్యూరోబ్లాస్టోమా *కండరములు *ఎముకలు *చర్మము *లింఫ్ గ్రంథులు ఎంతో మంది క్యాన్సర్ వ్యాధిగ్రస్తులకు చికిత్స చేస్తున్నటువంటి కేరళ ఆయుర్వేద వైద్యశాల. రేడియేషన్ థెరఫి. కీమోథెరపి. హార్మోన్ థెరపి. బయోలాజికల్ థెరపి. మరియు ఇతర వైద్యపద్ధతులను తీసుకుంటున్న వారు కూడా మా ఆయుర్వేద మందులు వాడవచ్చును.

## షుగర్ (DIABETES MELLITUS) అతి మూత్రము (DIABETES INSIPIDUS) వ్యాధి బాధితులకు శుభవార్త!!

అన్ని వయసుల వారికి ఎన్ని సంవత్సరముల నుండి షుగర్ వ్యాధి ఉన్నా (TYPE - II DIABETES. NON INSULIN DEPENDENT DIABETES MELLITUS. (NIDDM) 3 నెలలలో నియంత్రణలోకి వస్తుంది. (TYPE -1 DIABETES. INSULIN DEPENDENT DIABETES MELLITUS. (IDDM) 6 నెలలలో రోజులలో నియంత్రణలోకి వస్తుంది. కోర్సు అయిన తరువాత పంచదార, బెల్లం, తేనె, ఖర్జూరము లాంటివి తీసుకుంటూ వ్యాధిని తగ్గించుట ఈ మందు యొక్క ప్రత్యేకత. షుగర్ పేషంట్లకు మానని పుళ్ళు, గాయములు, గాంగ్రీన్ లాంటివి 30 రోజులలో మాన్పించవచ్చును. (PER MONTH Rs.3000/-) TYPE - II COURSE 6 MONTHS. TYPE - 1 COURSE 12 MONTHS.

## ఆల్కహాల్ - స్మోకింగ్ - గుట్కా - డ్రగ్స్ మానండి! త్రాగే వారికి తెలియకుండా మాన్పించండి!! Per Month Rs.2000/-) Course : 2 months.

## నూతన యవ్వనశక్తికి : నపుంసకత్వము - శీఘ్రస్కలనము - నరాల బలహీనత (IMPOTENCY)

అంగస్తంభన గట్టిగా లేకపోవుట - లైగిక వాంఛ లేకపోవుట (LIBIDO) - రతి మధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొని పోవుట-వృషణములు శుష్కించిపోవుట (ATROPHY OF TESTIS) రతిలో పాల్గొనక ముందే వీర్యము బయటికి వచ్చుట - నిద్రలో వీర్యము పోవుట - శృంగారమంటే భయం - శృంగారములో తమ సామర్థ్యము మీద తమకే నమ్మకం లేకపోవుట - శృంగారపరమైన సమస్యలను నివారించి - మగువదగ్గర మృగరాజులా రెచ్చిపోయే శృంగార సామర్థ్యము - 60లో 20లా యవ్వనాన్ని తరగనీయదు - శరీరము వజ్రమంత దృఢముగా, శక్తివంతముగా - వృద్యాప్యాన్ని రానీయని మహత్తర ఆయుర్వేద ఔషదము. (Per Month Rs.5000/-) Course : 3 months.

**సుఖవ్యాధులు:** గనేరియా - సిఫిలిస్ (per month Rs.2000/-) Course : 3 Months **హెర్పిస్ సింప్లెక్స్** (HERPES SIMPLEX) (Per month Rs.4000/-) Course : 3 months.

## సంతానం లేని (Infertility-Sterility) దంపతులకు శుభవార్త!! (ఆపరేషన్‌లు లేకుండా)

సంతానోత్పత్తి కణాలు తక్కువగా వున్న (OLIGOSPERMIA) మగవారికి కణాలలో కదలిక (MOTILITY) లేని వారికి కణాలు పూర్తిగా లేనివారికి (Azoospermia) వెరికోసిల్‌వీన్స్ (Varicoseviens) (Per month Rs.5000/-) Course : 3 months. స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదలకాక పోవుట, అండవాహికలు మూసుకొని పోవుట (Fallopian Tubes Block), గర్భాశయ పొరలకు వ్యాధి సోకినా, ప్రొలాక్టిన్ హార్మోన్ ఎక్కువశాతములో ఉన్నా, లోపలి ద్రవాల్లో ఆమ్లగుణము (Acid) ఎక్కువగా వున్నా, ఎండోమెట్రియాసిస్, అండములు చాలా చిన్నవిగా వున్నా, తరచూ గర్భస్రావములు జరుగుచున్నా, గర్భాశయ లోపములకు (PCOD) - రసాయన వాజీకరణ పద్ధతుల ద్వారా ప్రత్యేక చికిత్స చేయబడును. (Per Month Rs.5000/-) Course : 3 months.

**లివర్ వ్యాధులు - లివరు గట్టి పడుట** (Cirrhosis) - **లివర్‌లో పుండు** (Abscess) - **లివర్ వాపు, నొప్పి** (Hepatitis) (Per month 5000/-) Course: 3 Months

**21సం॥లోపు వారు ఎత్తు పెరుగుటకు - నత్తిని తగ్గించుటకు** (Stammering) Per month Rs.3000/-) Course:3months.

**సోరియాసిస్** (Psoriasis) - **బొల్లి** (Leucoderma) (Per month Rs.4,000/-) Course : 3 month.

**స్త్రీల శరీరంపై వచ్చు అవాంచిత రోమములు** (UN WANTED HAIR) **తిరిగి మొలవకుండా చేయుటకు:** (Per month Rs.4,000/-) Course : 1 month

## ఉబ్బసం (Asthma) ఎలర్జీ (Allergy) వ్యాధులకు ప్రత్యేక చికిత్స!!

జలుబు, దగ్గు, ఆయాసం, తుమ్ములు, పిల్లికూతలు, కళ్ళు, ముక్కునుండి నీరు కారుట, ఊపిరి ఆడకపోవడము, సైనసైటిస్ (Sinusitis) ఇస్నోఫీలియా (Eosinophilia) దుమ్ము, పొగ, పేపర్, వాసనలు, మంచు చల్లగాలుల వల్ల కలుగు ఎలర్జీ వ్యాధులకు అన్ని రకముల శ్వాసకోశ సమస్యలకు Asthma Sanjivini 400ml / TAB / CAP (Per month Rs.1000/-) Course: 9 months




# కేరళ ఆయుర్వేద వైద్యశాల

సప్తగిరి థియేటర్ ప్రక్కన, 2 nd బిల్డింగ్, 1 Floor R.T.C X Roads BUS STOP హైదారాబాద్-20.

ఫోన్: 9866155109, 9392355590

అన్ని రకముల దీర్ఘకాల వ్యాదులకు సంప్రదించండి మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు

Note : పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు, ఉత్తరాలద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు ఏపీలో పోస్టల్ /కొరియర్ చార్జీ రూ॥ 100/-, ఇతర రాష్ట్రాలవారు రూ.250/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా పంపువారు Kerala ayurveda vaidyasala పేరు మీద ఇక్కడ రాసినట్లుగా వ్రాసి పంపవలయును. మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి. ఫోన్ ద్వారా సంప్రదించువారు 10A.M. - 8 P.M. Sunday 10 A.M to 2 P.M

# ఆత్మీయనేస్తాలకు అందమైన కానుకలు

స్నేహితుల ఆనందమే మన ఆనందం
ఆప్తుల తలపులే మనకు ఆహ్లాదం
ఆత్మీయులకు అరుదైన బహుమానం
ఇవ్వాలనుకుంటున్నారా..?
ప్రతి నిత్యం వారి మదిలో
నిలవాలనుకుంటున్నారా..?



ఇందుకు మీరు చేయాల్సిందల్లా..
మిత్రుల పేరు మీద
రూ. 216/- చందా కట్టండి చాలు
ఇక నెలనెలా వారికి కొనసాగుతుంది

# విపుల చతుర



ఆత్మీయ పలకరింపు
నెలంతా సాహితీపరిమళాల
చిలకరింపు
ఏడాది పొడవునా వారి మదిలో
మీ తలపులే గుబాళిస్తాయి
అక్షరాక్షరాన మీ ఉత్తమాభిరుచి
రూపుకడుతుంది

అది పుట్టిన రోజయినా..
నూతన సంవత్సర సందర్భమైనా
సరే ఎంచుకోండి
ఒక్కసారి మమ్మల్ని
సంప్రదించండి చాలు..

డీడీ లేదా ఎంఒ పంపవలసిన చిరునామా:
వసుంధర పబ్లికేషన్స్, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.
ఆన్‌లైన్ బుకింగ్‌కు (యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, సైఫాబాద్, హైదరాబాద్ ఆన్‌లైన్ అకౌంట్ నెం. 370605010044015)

వివరాలకు : vipula.chatura@eenadu.net

# మనసున ఉన్నదీ...



★ కాశీ విశ్వనాథ్ నవల 'ఈ రాక నీ కోసమే' మమ్మల్ని కడుపుబ్బ నవ్వించింది. ఇంత మంచి నవలను అందించినందుకు 'చతుర'కు అభినందనలు.

– *వి. ఈశ్వరయ్య*, మాధవరం, కడప జిల్లా

★ దేవరాజు మహారాజు 'అంతరం' కథ వెనుక కథ ఆసక్తికరంగా ఉంది. టాంక్‌బండ్ కథ 'శాడిజం' సందేశాత్మకంగా ఉంది.

–*మోతి మోహనరంగా*, సూర్యాపేట

★ రాకేశ్ వేసిన ముఖచిత్రంతో ఆగస్టు చతుర నవల 'ఈ రాక నీ కోసమే' ఆసక్తిగా చదివింపజేసింది. 'హాహా.. అమెరికా' ద్వారా ఆ దేశ విశేషాలు వివరంగా తెలుస్తున్నాయి. అబ్బురగొలిపే పింగళివారి చతురోక్తులు చదివి ఆనందించాం. చక్కటి చతురకు బేబీ వినీషా రాజు బ్యాక్ కవర్ స్టిల్ మరింత అందం తెచ్చిపెట్టింది.

– *నేమాన సుభాష్*, శ్రీకాకుళం

★ కాశీ విశ్వనాథ్ నవల 'ఈ రాక నీ కోసమే' మమ్మల్ని ఆనందడోలికల్లో ముంచెత్తింది. పద్మలాంటి 'ఫాల్స్ ప్రిస్టేజీ'కి పోయే మహిళలు సమాజంలో అనేకులున్నారు. 'గొప్పకు గోచీ పెడితే ఉలవ చేలోకి వెళ్లగానే ఊడిపోయింది' అనే సామెతను ఈ నవలలోని సంఘటనలు రుజువు చేశాయి. చివరికి ఆమె తన తప్పును తెలుసుకునేలా చేసిన ముగింపు చాలా నచ్చింది. ఇంతటి మంచి నవలను అందించిన రచయితకు కృతజ్ఞతలు.

– *వానపల్లి వెంకట సత్యవతి*, విశాఖపట్నం

★ కాశీ విశ్వనాథ్ అప్రతిమాన, హాస్య నవల 'ఈ రాక నీ కోసమే' మమ్మల్ని అలరించింది. 'స్మితం'లో ప్రముఖుల చమత్కారాలు ఆకట్టుకున్నాయి. 'కొత్తగాలులు' నిజానికి పిల్లతెమ్మెరల్లాగే ఆహ్లాదపరుస్తున్నాయి. నిస్సందేహంగా 'నిన్నటినిజం' శీర్షిక పాఠకుల స్థాయిని, అభిరుచిని పెంచేదిగా ఉంది. డా. దేవరాజు మహారాజు 'అంతరం' కథవెనుక కథ చదివిన తర్వాత ఆయన 'పేరు'కు తగ్గ రచయితగా మనసుపై చెరగని ముద్ర వేశారు.

– *పెన్మెత్స సూరిబాబు*, హైదరాబాద్.

★ 'ఈ రాక నీ కోసమే' పేరు చూసి, దీన్ని రచయిత ఎలా హాస్య నవలగా తీర్చిదిద్దుతారబ్బా? అని మథనపడ్డాను. అయితే ఆగస్టు ముఖ చిత్రాలంకరణే సగం కథ తెలిపేలా ఉంది. రాకేష్ చిత్రాలు సందర్భోచితంగా బంగారానికి తావి అబ్బినట్లు ఉన్నాయి. ప్రస్తుతం తొంభై శాతం పద్మావతులు బాధపడే 'ఫాల్స్ ప్రిస్టేజీ' వల్ల ఎంతమంది సుబ్బారాయుళ్లు, కొండమ్మలు కిందమీదవుతారో అన్పించింది. మధ్యతరగతి మనుషుల వ్యక్తిత్వాలను భూతద్దంలోంచి చూపించిన నవల ఇది. సిద్ధాంతి, సుందర్రావు, సీతారాంలు ఎలా ఇతరుల బలహీనతల్ని తమకనుకూలంగా మలచుకుంటారో చక్కగా చిత్రించారు.

– *ఎన్.వి. రమణి*, హైదరాబాద్

★ సమాజంలో అతి సహజంగా జరిగే చిన్న చిన్న సంఘటనల్ని హాస్యస్ఫోరకంగా, గొప్పగా మలిచిన 'ఈ రాక నీ కోసమే' రచయిత విశ్వనాథ్‌కు అభినందనలు. ఆఫీసుల్లో పనిచేసే ఉద్యోగినులు పడే ఇబ్బందుల్ని కళ్లకు కట్టి,పరిష్కారం కూడా చూపించింది టాంక్‌బండ్ కథ 'శాడిజం'. 'హాహా.. అమెరికా' చదివిన తర్వాత అంతగా అభివృద్ధి చెందిన దేశంలోనూ విద్యార్థులు ఇన్నిన్ని అవస్థలు పడుతున్నారా? అని ఆశ్చర్యం వేసింది. కథ వెనుక కథలు ఎప్పుడూ బాగా ఉంటున్నాయి. ఇక 'స్మితం', 'చతుర ప్రపంచం', 'నిన్నటి నిజం', చతురోక్తులు స్ఫూర్తిదాయకంగా ఉన్నాయి.

– *మంచాళ శ్రీలక్ష్మి*, విశాఖ

---

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082
ఈ మెయిల్ :
vipula.chatura@gmail.com

సంపుటి -34, సంచిక - 8
404వ సంచిక, పేజీలు : 132
సెప్టెంబరు 2011

# చతుర





'ప్రిన్స్‌పాల్ ఉద్యోగం తీసేస్తడు. మీరే కాపాడాలె' అన్నాడు గోపాల్ భయపడుతూ. 'అయితే కులంపేరుతో తిట్టాడని ఆయనమీద కేసు పెడ్తావా?' అన్నాడు లెక్చరర్ సూర్యారావు. 'ఇది అన్నేయం. ఆయన కులం పేరెత్తలే!' అన్నాడు గోపాల్. 'వాళ్ల బుద్దులు ఎందుకు మార్తాయి- అని తిట్టాడుగా?' 'ఇంతదానికి పోలీసుకేసు ఎందుకు దొరా?' అన్నాడు గోపాల్. 'రేయ్! ఉద్యోగం కావాలంటే చెప్పింది చెయ్' ఉసిగొల్పాడు సూర్యారావు. ఓ విద్యాసంస్థను చక్కబెట్టాలనుకున్న ప్రిన్స్‌పాల్‌కు, లెక్చరర్లకు మధ్య జరిగిన సంఘర్షణను ఆద్యంతం ఆసక్తికరంగా చిత్రించిన **అంపశయ్య నవీన్** తాజా నవల

**అవాస్తవికుడు**

పేజీ ...6

బొమ్మలు : భాస్కర్

# అవాస్తవికుడు

## - అంపశయ్య నవీన్




గాడితప్పిన ఆ కాలేజిని దారిలోపెట్టాలని కోటి ఆశలతో
ప్రిన్స్‌పాల్‌గా వెళ్లాడాయన. మొదట్లో ఆయన కృషిని అందరూ
ముక్తకంఠంతో శ్లాఘించారు. కాలం గడిచినకొద్దీ
తోటి అధ్యాపకులు, విద్యార్థులు తీవ్రంగా ప్రతిఘటించారు.
కట్టుకున్న భార్య కూడా ఛీకొట్టింది.
దీనికి కారణమేమిటి? ఇంతకీ సమస్య ఎవరిలో ఉంది?
పరిస్థితుల్ని మార్చాలనుకున్న ఆయనలోనా?
ఆయన చుట్టుపక్కలవారిలోనా? ఆదర్శాలకు, సామాజిక
వాస్తవికతకు మధ్య తలెత్తే వైరుధ్యాలను అద్భుతంగా చిత్రించిన
అంపశయ్య నవీన్ తాజా నవల
అవాస్తవికుడు చతుర ఉపాధ్యాయ దినోత్సవ కానుక!

క్లా సు తీసుకొని బయటకు వస్తున్న ఇంగ్లీషు లెక్చరర్ వెంకటేశ్వరరావు జేబులో ఉన్న సెల్‌ఫోన్ మోగటంతో తీసి "హల్లో" అన్నాడు.

"కంగ్రాచ్యులేషన్స్ వెంకటేశ్వరరావు... మీకు ప్రిన్స్‌పాల్‌గా ప్రమోషన్ వచ్చింది"

అవతలి కంఠాన్ని వెంకటేశ్వరరావు వెంటనే గుర్తుపట్టాడు. అతడు పురుషోత్తం... కొంతకాలం అతడు, తనూ కరీంనగర్ కాలేజిలో పనిచేశారు. ఆ రోజుల్లో ఇద్దరూ చాలా సన్నిహితంగా ఉండేవారు. తనకు కరీంనగర్ నుంచి ఖమ్మం ట్రాన్స్‌ఫర్ కావడంతో అతనికీ తనకూ ఎడబాటు తప్పలేదు.

"మీరిప్పుడు ఎక్కణ్ణించి మాట్లాడుతున్నారు? " అన్నాడు వెంకటేశ్వరరావు.

"హైదరాబాద్ నుండే... మన కమిషనర్ ఆఫీసు నుండే మాట్లాడుతున్నాను. ఇప్పుడే ఆర్డర్స్ వెళ్లాయి... మిమ్మల్ని కోదాడ దగ్గరి జమాలపల్లి అనే టౌన్లో ఉన్న కాలేజికి ప్రిన్స్‌పాల్‌గా వేశారు"

"మీకూ ప్రమోషన్ వచ్చి ఉండాలే"

"వచ్చింది.. నన్ను కరీంనగర్ దగ్గరున్న హకీంపేట కాలేజిలో వేశారు.."

"మీక్కూడా కంగ్రాచ్యులేషన్స్"

"మీకు ప్రిన్స్‌పాల్ కావాలని, ఒక ఐడియల్‌గా పేరు తెచ్చుకోవాలని ఉండేది కదా! కొంచెం ఆలస్యమైనా మీకల నిజమైంది. మీరు వెళ్తున్న కాలేజి అంత బాగా లేదు. దాన్ని మీరే బాగుచెయ్యాలి"

"తప్పకుండా.. దాన్నొక టెంపుల్ ఆఫ్ లెర్నింగ్‌గా మార్చేస్తాను"

"మీరలా చెయ్యగలరని నాకు తెలుసు. బెస్టాఫ్ లక్ వెంకటేశ్వరరావుగారు"

"థాంక్యూ పురుషోత్తంగారు"

అవతల పురుషోత్తం ఫోన్ పెట్టేశాడని తెలియడంతో వెంకటేశ్వరరావు కూడా ఫోన్ కట్ చేశాడు.

లెక్చరర్‌గా చేరినప్పట్నించీ వెంకటేశ్వరరావు ఓ కాలేజికి ప్రిన్స్‌పాల్‌గా పనిచెయ్యాలని కలలు కంటుండేవాడు. తను ప్రిన్స్‌పాల్‌గా వెళ్లిన కాలేజిని ఒక ఆదర్శ కాలేజిగా తీర్చిదిద్దాలని, తననందరూ గొప్ప ప్రిన్స్‌పాల్ అని పొగడాలని అతనికో ప్రగాఢమైన కోరిక.

అతడు కరీంనగర్ కాలేజిలో లెక్చరర్‌గా పనిచేస్తున్న రోజుల్లో నరసింహారావు అని ఒక ప్రిన్స్‌పాల్ ఉండేవాడు. చాలా గొప్ప ప్రిన్స్‌పాల్. అతడే వెంకటేశ్వరరావుకు రోల్‌మోడల్. నరసింహారావు గొప్ప టాస్క్‌మాస్టర్... గొప్ప డిసిప్లినేరియన్... ఎంత సోమరిపోతుతోనైనా పనిచేయించేవాడు. రోజూ ఐదారుసార్లు రౌండ్స్ తీసుకొని లెక్చరర్లందరూ సక్రమంగా క్లాసులు తీసుకునేలా చేసేవాడు. ఏ లెక్చరరయినా లేట్‌గా వచ్చినా, క్లాసులు సరిగ్గా తీసుకోకపోయినా వెంటనే వాళ్లమీద యాక్షన్ తీసుకునేవాడు. ఆఫీసులో పనిచేసే నాన్ టీచింగ్ స్టాఫ్‌తో కూడా చాలా కఠినంగా ప్రవర్తించేవాడు. పని దొంగలంటే నరసింహారావుకు చాలా అసహ్యం. వాళ్ళతో చాలా కఠినంగా వ్యవహరించేవాడు. విద్యార్థులతో కూడా చాలా కఠినంగా ఉండేవాడు. వాళ్లు క్లాసులకు లేట్‌గా వచ్చినా, వరండాల్లో అల్లరి చేసినా, అటెండెన్స్ షార్టేజి ఉన్నా సహించేవాడు కాదు. డెబ్బై ఐదు శాతం కంటే అటెండెన్స్ తక్కువున్న విద్యార్థులను యూనివర్శిటీ ఎగ్జామ్స్‌కు పంపించేవాడు కాదు. అంతేకాకుండా కాలేజికి యూజీసీలాంటి సంస్థల నుండి ఫండ్స్ తెప్పించి లైబ్రరీని, క్లాస్‌రూమ్స్‌ని ఎంతో అభివృద్ధి చేశాడు. ఆయన ప్రతి పనినీ చాలా వేగంగా, క్షణాల మీద పూర్తయ్యేలా చేసేవాడు. మొదట్లో విద్యార్థులు తిరుగుబాటు చేసినా తర్వాత ఆ ప్రిన్స్‌పాల్‌గారు అందర్నీ కంట్రోల్ చేసి సరైన

దార్లో పెట్టాడు. వెంకటేశ్వరరావు ఆనాటి ప్రిన్స్‌పాల్ నరసింహారావును ఎప్పుడూ మరచిపోలేదు. రేపు తను ప్రిన్స్‌పాలైతే నరసింహారావునే ఆదర్శంగా తీసుకోవాలి. ఆయన ఎలాంటి పద్ధతుల్నయితే అనుసరించి అతడు పనిచేస్తున్న కాలేజిని 'టెంపుల్ ఆఫ్ లెర్నింగ్'గా మార్చేశాడో తనూ అలాంటి పద్ధతుల్నే అనుసరించి తనిప్పుడు వెళ్తున్న కాలేజిని 'టెంపుల్ ఆఫ్ లెర్నింగ్'గా తీర్చిదిద్దాలని అనుకున్నాడు.

"అప్పటికీ ఇప్పటికీ పరిస్థితులు మారిపోయాయి. ఇప్పటి కాలేజీల్ని నరసింహారావులాగా నడపడం సాధ్యం కాకపోవచ్చు" అన్నారు కొందరు లెక్చరర్లు.

ఎందుకు సాధ్యం కాదో తను నిరూపిస్తాడు. పరిస్థితులకు మనం లొంగకూడదు. పరిస్థితుల్నే మనకు లొంగేలా మలచుకోవాలని అనుకున్నాడు.

ఈ ఆదర్శాలతో వెంకటేశ్వరరావు ప్రిన్స్‌పాల్‌గా జమాలపల్లి కాలేజిలో చేరాడు.

★ ★ ★

వెంకటేశ్వరరావు జమాలపల్లి డిగ్రీ అండ్ పీజీ కాలేజిలో చేరటానికి రెండ్రోజుల ముందు ఆ కాలేజికి సంబంధించిన సమాచారాన్ని కొంత సేకరించాడు. జమాలపల్లిలో ఆయన కజిన్ ఆనందరావు, ఆర్ అండ్ బీలో ఎగ్జిక్యూటివ్ ఇంజినీర్‌గా పనిచేస్తున్నాడు. తనకు తమ్ముడౌతాడు. ఆనందరావుకు ఫోన్ చేసి తను ప్రిన్స్‌పాల్‌గా చేరబోతున్న కాలేజిని గురించి అడిగాడు.

"ఈ ఊర్లో ఉన్న కాలేజికి ఏమంత మంచిపేరు లేదు. ఈ కాలేజిలో చాలా కాలం ప్రిన్స్‌పాల్‌గా పనిచేసిన విఠల్‌రావనే ఆయన కాలేజినస్సలు పట్టించుకునేవాడు కాదు. ఆయన మన తెలుగువాడు కాడు. నాందేడ్ జిల్లాకు చెందిన మహారాష్ట్రియన్... అయితే వాళ్లతాతలు, తండ్రుల కాలం నుండే హైదరాబాద్‌లో ఉండేవాళ్ళట. ఒకప్పుడు నాందేడ్ జిల్లా హైదరాబాద్ సంస్థానంలోనే ఉండేది కదా.. ఆ రోజుల్లోనే వాళ్లు హైదరాబాద్ సిటీలో క్లాత్‌మర్చంట్స్‌గా సెటిలైపోయారు. విఠల్‌రావు వాళ్ళు బాగా డబ్బున్నవాళ్లు. ఆ కారణం చేతనే కావచ్చు, విఠల్‌రావును గూర్చి 'రాయల్ టైప్ ఆఫ్ మ్యాన్' అని చెప్పుకునేవాళ్ళు. ఆయన్ను జమాలపల్లిలో పోస్టు చేసినప్పటికీ ఎప్పుడూ హైదరాబాద్‌లోనే ఉండేవాడు. ఎప్పుడో ఒకసారి చుట్టపుచూపుగా హైదరాబాద్ నుండి కార్లో వచ్చి ముఖ్యమైన ఫైల్స్‌మీద సంతకాలు చేసి వెళ్ళిపోతుండేవాడు. కాలేజిలో సీనియర్‌మోస్ట్ లెక్చరరయిన సాంబశివరావుకే కాలేజిని అప్పగించి వెళ్తుండేవాడు. పాపం, సాంబశివరావు మంచివాడే. కానీ ఇన్‌చార్జి ప్రిన్స్‌పాల్‌ను ఎవరు కేర్ చేస్తారు? ఈ కారణం చేత ఆ కాలేజిలో పనిచేస్తున్నవాళ్ళందరికీ ఆ సంస్థ ఒక ఇష్టారాజ్యంగా మారింది. కాలేజికి ఎప్పుడొచ్చినా, ఎప్పుడెళ్ళిపోయినా, క్లాసులు తీసుకోకపోయినా, రెండు మూడు రోజులకొకసారొచ్చి అన్ని రోజులు వచ్చినట్టుగా సంతకాలు పెట్టేసినా అడిగేవాడు లేడు. చాలాకాలం వరకు ఆ కాలేజిలో డిగ్రీ వరకే బోధన ఉండేది. ఇటీవలనే ఇక్కడి ఎం.ఎల్.ఎ. పూనుకొని మూడు సబ్జెక్ట్స్‌లో పోస్టు గ్రాడ్యుయేషన్ బోధనను కూడా సాంక్షన్ చేయించాడు. పీజీ క్లాసులు తెప్పించానని ఆ ఎం.ఎల్.ఎ.గారు గర్వంగా చెప్పుకున్నారేగానీ ఆ క్లాసులు నడపటానికి కావలసిన సౌకర్యాలేవీ ఆ కాలేజిలో కల్పించబడలేదు. మొత్తంమ్మీద నువ్వు చేరబోతున్న కాలేజిలో పరిస్థితులు చాలా అస్తవ్యస్తంగా ఉన్నాయని, ఇక్కడివాళ్ళు చెప్పుకోగా విన్నాను" అన్నాడు ఆనందరావు.

"అలాగా! ఐదారు నెలల్లోనే నేనా కాలేజిని ఎలా మారుస్తానో చూడు" అన్నాడు

వెంకటేశ్వరరావు.

"చాలా కష్టం వెంకటేశ్వరరావు. ఒక్క నువ్వు చేరబోతున్న కాలేజీలోనే కాదు... ఏ ప్రభుత్వాఫీసులో చూసినా పరిస్థితులు అస్తవ్యస్తంగానే ఉన్నాయి. ఎవరికీ బాధ్యత లేదు. పనిపట్ల శ్రద్ధగానీ, అంకితభావం కానీ లేవు.. ప్రభుత్వసొమ్మును ఎలా తినేద్దామన్న ధ్యాస తప్ప మరో ధ్యాసే లేదు. ప్రతివాడికీ ఎలా డబ్బు సంపాదించాలన్న యావ.. ఎంత నీచానికైనా ఒడిగట్టి బోల్డు డబ్బులు సంపాదించేసి విలాసవంతమైన జీవితాన్ని గడిపెయ్యాలన్నదే ఈనాటి మన దేశపౌరుల లక్ష్యంగా కనబడ్తోంది. ఈ దేశాన్నెవడూ బాగుచెయ్యలేడనిపిస్తు

## కొత్తగాలి...

**చిరుగాలికి విరులు కదుల్తాయి**
**పెనుగాలికి తరులు కూల్తాయి**
**'కొత్తగాలి'కి కవితలు పుడతాయి**

– బేతంచర్ల శ్యామ్‌సుందర్,
వినుకొండ

న్నది" అన్నాడు ఆనందరావు.

"మనం ఈ దేశాన్నెవరూ బాగుచెయ్యలేరన్న నిరాశలో కొట్టుమిట్టాడుతున్నాం కాబట్టే ఈ దేశం ఇలా అస్తవ్యస్తంగా మారిపోతున్నది. లెటజ్ ట్రై టుడు సమ్ థింగ్ టు ఛేంజ్ దిస్ ట్రెండ్.. చుట్టూ చీకటుందని బాధపడి ఊరుకోకుండా చిన్న దీపం వెలిగిద్దాం. నామట్టుకు నేను జాయినవుతున్న కాలేజిని ఆర్డర్‌లో పెట్టి దాన్నొక ఐడియల్ కాలేజిగా మార్చటానికి నా శాయశక్తులా పనిచేస్తాను" అన్నాడు వెంకటేశ్వరరావు.

"ప్రయత్నం మంచిదే.. బెస్టాఫ్‌లక్ వెంకటేశ్వరరావు" అన్నాడు ఆనందరావు.

"అది సర్లేగానీ మాకో మంచి ఇల్లు చూసిపెట్టు.. నేను అన్నీ సర్దుకొని సకుటుంబ సపరివారంగా వచ్చేస్తాను" అన్నాడు వెంకటేశ్వరరావు.

"మొదలైతే వచ్చి అందరూ మా ఇంట్లో దిగండి. ఓ వారం రోజుల్లో ఓ మంచి ఇల్లు చూద్దాం. ఇక్కడ ఇండ్లు సులభంగానే దొరుకుతున్నాయిలే.. నో ప్రాబ్లెమ్" అన్నాడు ఆనందరావు.

"థాంక్స్‌రా ఆనందరావు" అని వెంకటేశ్వరరావు ఫోన్ పెట్టేశాడు.

★ ★ ★

వెంకటేశ్వరరావు ఆర్డర్స్ అందిన మూడురోజుల తర్వాత జమాలపల్లికొచ్చేసి అక్కడి డిగ్రీ అండ్ పీజీ కాలేజిలో ఉదయం పదకొండు గంటలకు జాయినయ్యాడు. అంతకు ముందున్న ప్రిన్స్‌పాల్ విఠల్‌రావును నెలరోజుల క్రితమే హైదరాబాద్‌కు ట్రాన్స్‌ఫర్ చేశారు.

వెంకటేశ్వరరావు ఆ కాలేజిలో జాయినయినప్పుడు సాంబశివరావు ఇన్‌చార్జి ప్రిన్స్‌పాల్‌గా పనిచేస్తున్నాడు. కాబట్టి సాంబశివరావు దగ్గర్నుంచే వెంకటేశ్వరరావు ఆ కాలేజి ప్రిన్స్‌పాల్‌గా చార్జి తీసుకున్నాడు.

చార్జి తీసుకోవడం పూర్తికాగానే ఆ కాలేజిలో పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ లెక్చరర్‌గా పనిచేస్తున్న దుర్గారెడ్డొచ్చి ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావును కలిశాడు.

"ఈయన దుర్గారెడ్డి.. లెక్చరర్ ఇన్ పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్.. మన స్టాఫ్ క్లబ్ సెక్రటరీ కూడా" అని సాంబశివరావు దుర్గారెడ్డిని పరిచయం చేశాడు.

"నమస్కారం సార్!" అన్నాడు దుర్గారెడ్డి.

"నమస్కారం" అన్నాడు వెంకటేశ్వరరావు.

"స్టాఫ్ క్లబ్ తరఫున మీకు వెల్‌కం పార్టీ అరేంజ్ చేశాం సార్.."

"వెల్‌కం పార్టీయా? ఎందుకు?




## మరొకటి వేయించు!

అమెరికన్ రచయిత మార్క్‌ట్వైన్ తినడం, రాయడం అన్నీ పడకమీదే చేసేవాడు.

ఒకరోజు అతని లేడీ సెక్రటరీ నోట్సు తీసుకోవడానికి వచ్చింది.



'ఆమెను లోపలికి పంపు' అని మార్క్‌ట్వైన్ తన భార్యతో చెప్పాడు.

ఆ వచ్చిన వ్యక్తి స్త్రీయని, అతను పడక మీద పడుకుని నోట్సు చెప్పటం, ఆమె కూర్చుని రాసుకోవడం భావ్యంగా ఉండదని మార్క్‌ట్వైన్ భార్య తీవ్ర అభ్యంతరం తెలిపింది.

'అయితే మరో పడక తెచ్చి వేయమని నౌకరుకు చెప్పు' అన్నాడు మార్క్‌ట్వైన్ నవ్వుతూ.

## దేనికి ఎంతెంత కాలం?



అమెరికా అధ్యక్షుడు ఉడ్రోవిల్సన్‌ను, 'పది నిమిషాల ఉపన్యాసం తయారు చేసేందుకు ఎంతకాలం పడుతుంది?' అని ఒక మిత్రుడు ప్రశ్నించాడు.

దానికి ఆయన, 'రెండు వారాలు' అని తాపీగా జవాబిచ్చాడు.

'ఒక గంట ఉపన్యాసానికి ఎంతకాలం పడుతుంది?' అని మిత్రుడు మళ్లీ ప్రశ్నించాడు.

'ఒకవారం' అని జవాబిచ్చాడు విల్సన్ సాలోచనగా.

'అయితే రెండు గంటల ఉపన్యాసానికి ఎంత కాలం పడుతుంది?' అని ప్రశ్నించాడు. 'నేను ఇప్పుడే సిద్ధం' అని జవాబిచ్చాడు విల్సన్ నవ్వుతూ.



## ఓహో! అలాగా!!

ఇటాలియన్ స్వరకర్త రొస్సిని అభిమానులు తన గౌరవార్థం ఒక విగ్రహాన్ని నెలకొల్పేందుకు తలపెట్టారని తెలుసుకుని ఆయన కొంచెం ఆందోళన చెందాడు. అతని దగ్గరకు వచ్చిన అభిమానులతో 'ఆ విగ్రహానికి ఎంత ఖర్చవుతుంది?' అన్నాడు.

వారు చాలా గొప్పగా, 'దాదాపు పది మిలియన్ ఫ్రాంకులు కావచ్చు' అని జవాబిచ్చారు.

'పది మిలియన్ ఫ్రాంకులా?' అని గిలగిలలాడాడు రొస్సిని.

వెంటనే మళ్లీ, అంతెందుకు! ఐదు మిలియన్ ఫ్రాంకులు ఇవ్వండి చాలు. నేనే స్వయంగా వచ్చి వేదిక మీద నిలబడతాను' అన్నాడు ఛలోక్తిగా.

## ఆ మూర్ఖుడు ఎక్కడ?



సుప్రసిద్ధ ఐరిష్ నాటక రచయిత షెరిడన్ సభలో ఉపన్యసిస్తున్నాడు. శ్రోతల్లో నుంచి ఒక వ్యక్తి తరచుగా అతనికి ఆటంకం కలిగిస్తూ, 'వినండి.. వినండి..' అంటూ పదేపదే ఎగతాళిగా అరుస్తున్నాడు.

షెరిడన్ తన ఉపన్యాసం కొనసాగిస్తూ, సందర్భోచితంగా, '...అందువల్ల అతని వంటి మూర్ఖుడు, పనికిమాలినవాడు మరొకడు ఎక్కడైనా ఉన్నాడా?' అని అడిగాడు.

మళ్లీ శ్రోతల్లో నుంచి అదే గొంతు, 'వినండి, వినండి!' అని అరిచింది.

దాంతో షెరిడన్ అతని వైపుకు తిరిగి, 'ఓహో! నువ్వు ఇక్కడే ఉన్నావా?' అని అన్నాడు.

అంతే, శ్రోతలందరూ నవ్వుల్లో మునిగి తేలారు.

అన్నాడు ప్రిన్స్‌పాల్.

"కాలేజికి కొత్తగా వచ్చిన ప్రిన్సిపాల్‌కు స్వాగతం చెప్పడం ఇక్కడి మా సంప్రదాయం సార్! ఇక్కడ పనిచేస్తున్న మా లెక్చరర్లందరినీ మీకు పరిచయం చెయ్యడం ఈ సమావేశం ముఖ్యోద్దేశ్యం సార్!" అన్నాడు దుర్గారెడ్డి.

"సమావేశం ఎన్నింటికి? " అన్నాడు ప్రిన్స్‌పాల్.

"ఇంకాసేపట్లోనే.. ఇప్పుడు పదకొండున్నర అవుతున్నది సార్! పన్నెండింటికి మీటింగ్.. వచ్చేయండి సార్!" అన్నాడు దుర్గారెడ్డి.

"ఈ సమావేశం కారణంగా క్లాసులయితే డిస్టర్బ్ కావు కదా? " అన్నాడు ప్రిన్స్‌పాల్.

"పన్నెండింటికి ఒక అరగంట సేపు లంచ్‌బ్రేక్ ఉంటుంది సార్! కాబట్టి క్లాసులుండవు. మళ్ళీ పన్నెండున్నర నుండి ఆఫ్టర్‌నూన్ క్లాసులు స్టార్టవుతాయి"

"అలాగా! సరే! అయితే.. సరిగ్గా పన్నెండింటికొచ్చేస్తాను"

"ఈ సమావేశాన్ని సాంబశివరావు సార్ ప్రిసైడ్ చేస్తారు సార్! ఇద్దరూ కలిసి రండి" అన్నాడు దుర్గారెడ్డి.

"అలాగే..." అన్నాడు ప్రిన్స్‌పాల్.

దుర్గారెడ్డి వెళ్ళిపోయాడు.

"ఈ మీటింగ్ పెట్టుకోవడానికి మీరు పర్మిషన్ ఇచ్చారా? " అన్నాడు వెంకటేశ్వరరావు, సాంబశివరావుకేసి చూసి.

"కొత్త ప్రిన్స్‌పాల్ వచ్చినప్పుడు వారికో వెల్‌కమ్ పార్టీ అరేంజ్ చెయ్యడం చాలా కాలంగా ఇక్కడ జరుగుతున్నదే. ఆ పార్టీ అరేంజ్ చేసే బాధ్యత స్టాఫ్‌క్లబ్ సెక్రటరీది. ఈ రోజిలా వెల్‌కమ్ పార్టీ అరేంజ్ చేస్తున్నామని దుర్గారెడ్డి చెప్పాడు. నేను సరేనన్నాను" అన్నాడు సాంబశివరావు.

"మీరు పర్మిషన్ ఇచ్చారా? అని ఎందుకడిగానంటే ఈ కాలేజీలో ఏం జరిగినా అది ప్రిన్స్‌పాల్ పర్మిషన్‌తోనే జరగాలి. ఎనీ వే.. మీరు ఇన్‌ఛార్జిగా ఎప్పట్నించి పనిచేస్తున్నారు? "

"జస్ట్ వన్ మంత్ నుండి సార్!"

"ఈ కాలేజికున్న ప్రత్యేకమైన సమస్యలేమిటి? "

"రెండు మూడు రోజుల్లో ప్రత్యేక సమస్యలేమిటో మీరే చూస్తారు సార్! నిజం చెప్పాలంటే అన్నీ సమస్యలే. విఠల్‌రావు గారు మంచివారే.. రాయల్‌టైపు. కాలేజిలో ఎక్కువగా ఉండేవాడు కాడు.. హైదరాబాద్‌లోనే ఎక్కువగా ఉండేవాడు. క్లబ్బులు.. పేకాట.. హార్స్‌రేసెస్.. వీటితోపాటే ఆయనకు గడిచిపోయేది.. అందువల్ల.."

"అర్థమయ్యిందిలెండి.. ఇక్కడ మూడు సబ్జెక్ట్సుకి పీజీ కోర్సెస్ నడుస్తున్నాయట.. ఏమిటా సబ్జెక్ట్సు? "

"అవును సార్! ఎం.ఎల్.ఎ. గారు ఇక్కడ కెమిస్ట్రీ, ఎకనామిక్స్, ఇంగ్లీషుకుగాను పీజీ క్లాసెస్‌కి సాంక్షన్ తెచ్చారు. ఆ క్లాసెస్ నడపడానికి కాలేజిలో ఉన్న ఎకామొడేషన్ సరిపోవడంలేదు. ఆ క్లాసులు తీసుకోవడానికి లెక్చరర్లు కూడా లేరు. డిగ్రీ క్లాసులు చెబుతున్న లెక్చరర్లే ఆ క్లాసులు కూడా తీసుకుంటున్నారు"

"ఐసీ" అన్నాడు వెంకటేశ్వరరావు.

సరిగ్గా పన్నెండింటికి ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు లేచి నిల్చుని, "వెల్‌కం పార్టీ అన్నారు కదా! వెళ్దాం పదండి" అన్నాడు.

సాంబశివరావూ లేచి నిల్చున్నాడు.

"అక్కడంతా రెడీ అయ్యిందో? లేదో? సార్! నేను వెళ్ళి చూసొస్తాను" అన్నాడు సాంబశివరావు.

"పన్నెండింటికని స్టాఫ్‌క్లబ్ సెక్రెటరీ చెప్పాడు కదా! పన్నెండంటే పన్నెండే.. ఒక్క నిమిషం ఆలస్యమైనా నాకు బావుండదు. మీరు వెళ్ళి చూసి రావడం దేనికి? మనం వెళ్దాం పదండి.. మీటింగెక్కడ? " అంటూ

ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు కదిలాడు.

"మీటింగ్ స్టాఫ్‌రూంలో సార్! సైన్స్ లెక్చరర్లందరకూ వాళ్ళ ల్యాబ్స్ పక్కనే స్టాఫ్‌రూమ్స్ ఉన్నాయి. ఆర్ట్స్ లెక్చరర్లంద రికీ ఒకటే స్టాఫ్‌రూమ్.. కాస్త విశాలంగా ఉంటుంది. స్టాఫ్ మీటింగ్స్ ఎప్పుడు జరి గినా అక్కడే జరుగుతాయి సార్!"

ప్రిన్స్‌పాల్, సాంబశివరావు - ఇద్దరూ బయటకొచ్చి వరండాలో నడవసాగారు.

చాలామంది స్టూడెంట్స్ వరండాల్లో గుంపులు గుంపులుగా తిరుగుతూ, అరుస్తూ, కేరింతలు కొడ్తూ కనిపించారు. క్లాసు రూముల్లో ఎవరూ లేరు. కొత్తగా ఆ రోజే కాలేజిలో చేరిన ప్రిన్స్‌పాల్‌ను చూసి కొందరు విద్యార్థులు అబ్బో.. భలే పర్సనా లిటీరా! ఒడ్డూ, పొడుగూ, సూటు, బూటు.. భలే ఉన్నాడురా! అమెరికా నుండో దిగుమతైన వాడిలా కనిపిస్తు న్నాడు" అన్నారు.

"పోయిన ప్రిన్స్‌పాల్ పొట్టిగా, బక్కగా.. బలమైన గాలొస్తే కొట్టుకుపో యేలా ఉండేవాడు.. ఆయనను చూసి ఈయనను చూస్తే ఏమనిపిస్తోందంటే.." అన్నాడు విద్యార్థి.

"ఏమనిపిస్తోందో నేను చెప్పనా? జూని యర్ వేణుమాధవ్ పోయి అమితాబ్ బచ్చన్ వచ్చినట్టుగా ఉంది" అన్నాడు ఇంకో విద్యార్థి.

అక్కడ గుమిగూడిన విద్యార్థులంతా గొల్లున నవ్వారు.

వాళ్ళకేసి వెంకటేశ్వరరావు గంభీరంగా చూశాడు.

"ఏయ్ స్టూడెంట్స్.. ఇలా వరండాలో నిల్చొని అల్లరి చెయ్యకూడదు.. వెళ్ళండి.

వెళ్ళి క్లాసుల్లో కూర్చోండి" అన్నాడు సాంబ శివరావు.

"ఇప్పుడు లంచ్‌బ్రేక్.. క్లాసుల్లేవు సార్" అన్నారు కొందరు విద్యార్థులు.

"అయినా సరే.. మీరు క్లాసుల్లోనే కూర్చోవాలి" అన్నాడు సాంబశివరావు.

కానీ ఆయన మాటను ఎవరూ పట్టించుకున్నట్టు కనిపించలేదు. వాళ్ళు అలాగే వరండాలో నిల్చొని కొత్త ప్రిన్స్‌పాల్‌కు, సాంబశివరావుకు ముందుకు వెళ్ళటానికి దారిచ్చారు. వాళ్ళల్లో ఒక విద్యార్థి సెల్‌ఫోనులో మాట్లాడుతూ కనిపించాడు. అతన్ని చూడగానే ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు ముఖం చిట్లించాడు.

"కాలేజికి సెల్‌ఫోన్స్ తేవొద్దని మీరు ఇన్‌స్ట్రక్షన్స్ ఇవ్వలేదా?" సాంబశివరావుతో అన్నాడు వెంకటేశ్వరరావు, సెల్‌ఫోన్‌లో మాట్లాడుతున్న విద్యార్థిని తన దగ్గరకు రమ్మని పిలుస్తూ.

సెల్‌ఫోన్‌లో మాట్లాడుతున్న విద్యార్థి కొత్త ప్రిన్స్‌పాల్‌ను చూసి కంగుతిన్నట్టుగా కనిపించాడు. అతడు ఫోన్ కట్‌చేసి ప్రిన్స్‌పాల్ దగ్గరకు వచ్చాడు..

"నువ్వు కాలేజికి చదువుకోవడానికొచ్చావా? సెల్‌ఫోన్‌లో మాట్లాడానికొచ్చావా?" గద్దించినట్టుగా అన్నాడు ప్రిన్స్‌పాల్.

## కొత్తగాలి...



**పక్షుల్లో**
**కులమతాలు లేవు**
**అందుకే వాటి స్వరాల్లో**
**అంత తీయదనం**

– శైలజామిత్ర, హైదరాబాద్

ఆ విద్యార్థి భయంభయంగా ప్రిన్స్‌పాల్‌కేసి చూస్తూ నిశ్శబ్దంగా నిల్చుండిపోయాడు.

"రేపట్నించి ఈ కాలేజికెవరూ సెల్‌ఫోన్స్ తీసుకురావొద్దు.. అర్థమైందా?" మళ్ళీ గద్దించినట్టుగా అన్నాడు.

"అలాగే సార్.." అన్నట్టుగా ఆ విద్యార్థి తలూపాడు.

ప్రిన్స్‌పాల్, సాంబశివరావు ముందుకు కదిలారు.

వరండాలో అక్కడక్కడ చించేసిన కాగితాలు, పాలిథీన్ బ్యాగులు కనిపించాయి.

"వరండాల్ని రోజూ ఊడ్పించరా?" అడిగాడు ప్రిన్స్‌పాల్.

సాంబశివరావు ఏమీ మాట్లాడలేదు.

"ఇతడెవరోగానీ చాలా స్ట్రిక్టు ప్రిన్స్‌పాల్‌లా ఉన్నట్టుందిరోయ్" అరిచాడో విద్యార్థి..

"పోయిన ప్రిన్స్‌పాల్.. పాపం ధర్మరాజు.." అన్నాడు ఇంకో విద్యార్థి.

"ధర్మరాజు పోయిండు, యమధర్మరాజొచ్చిండు" అన్నాడు మరో విద్యార్థి.

క్లాసు రూముల మధ్యలోనే స్టాఫ్‌రూమ్ ఉంది. కొత్త ప్రిన్స్‌పాల్ ఆ స్టాఫ్‌రూంలో అడుగుపెట్టేటప్పటికి ఆ రూంలో ఓ పదిమంది లెక్చరర్లు మాత్రమే కూర్చొని ఉన్నారు.

"మొత్తం యాభైమంది లెక్చరర్లుండాలి కదా.. మిగతా వాళ్ళేరి?" అన్నాడు వెంకటేశ్వరరావు.

"వస్తున్నారు సార్.. సైన్స్ లెక్చరర్లు వాళ్ళ వాళ్ళ స్టాఫ్‌రూమ్స్‌లోంచి రావాలి కదా సార్.." అన్నాడు దుర్గారెడ్డి.

"పన్నెండింటికి మీటింగని మీరు అందరికీ చెప్పారు కదా! ఇప్పుడు పన్నెండు దాటి పది నిమిషాలైంది" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"అంతా రెడీ అయ్యాక నేనే వచ్చి మిమ్మల్ని పిలుద్దామనుకున్నాను సార్! మీరే వచ్చేసారు" అన్నాడు దుర్గారెడ్డి.

"పన్నెండింటికని చెప్పారు కదా! మళ్ళీ మీరు రావడమెందుకు? పన్నెండంటే పన్నెండే.. ఇప్పటికే పదినిమిషాలు లేటు. మీరు సమావేశాన్ని ప్రారంభించండి. ఎవరి కోసమూ వెయిట్ చేయాల్సిన అవసరం లేదు. ప్లీజ్ స్టార్ట్ ది మీటింగ్!" అన్నాడు ప్రిన్స్‌పాల్.

దుర్గారెడ్డి చాలా ఇబ్బందిగా మొఖం పెట్టాడు.

"ఒక్క ఐదు నిమిషాల్లో మొదలెడదాం సార్!" అన్నాడు.

"అవసరం లేదు. ప్లీజ్ స్టార్ట్ ది మీటింగ్" ఆర్డరిచ్చినట్టుగా గట్టిగా చెప్పాడు ప్రిన్స్‌పాల్.

ఈ లోగా మరో పదిమంది లెక్చరర్లు పరిగెత్తుతున్నట్టుగా వచ్చి స్టాఫ్ రూంలో కూర్చున్నారు.

దుర్గారెడ్డి వెళ్ళి మైక్ ముందు నిల్చున్నాడు.

"మన కాలేజికి కొత్తగా వచ్చిన ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావుగార్కి స్వాగతం చెప్పటం కోసం ఈ సమావేశం ఏర్పాటుచేశామని మీకందరికీ తెలుసు. ఈ సమావేశానికి అధ్యక్షత వహించమని నిన్నటిదాకా ఇన్‌ఛార్జి ప్రిన్స్‌పాల్‌గా ఉన్న మన సీనియర్ మోస్ట్ లెక్చరర్ సాంబశివరావు గార్ని కోరుతున్నాను" అని దుర్గారెడ్డి చెప్పగానే సాంబశివరావొచ్చి వేదిక మీద ఆసీనుడయ్యాడు.

"ఈ సమావేశానికి ముఖ్య అతిథి, మన కొత్త ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావుగార్ని వేదిక మీదకు ఆహ్వానిస్తున్నాను" అని దుర్గారెడ్డి చెప్పగానే వెంకటేశ్వరరావొచ్చి సాంబశివరావు పక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు. ఆ కాలేజిలో జువాలజీ లెక్చరర్‌గా పనిచేస్తున్న రమాదేవొచ్చి వేదిక మీద కూర్చున్న ప్రిన్సిపాల్ వెంకటేశ్వరరావుకు, సాంబశివరావుకు పుష్పగుచ్ఛాలను అందజేశారు. ఈలోగా ఇంకొందరు లెక్చరర్లొచ్చి కూర్చున్నారు.

"లెక్చరర్లందరూ ఒకరి తర్వాతొకరు తమను తాము ప్రిన్సిపాల్‌గారికి పరిచయం చేసుకోవాల్సిందిగా కోరుతున్నాను" అన్నాడు సాంబశివరావు.

లెక్చరర్లందరూ ఒకరి తర్వాతొకరు తమను తాము పరిచయం చేసుకున్నారు.

ఈ దశలో కూడా మరికొంతమంది లెక్చరర్లొచ్చి జాయినయ్యారు.. స్టాఫ్‌రూం మొత్తం నిండిపోయింది. ఆ రూంలో ఇరవై మంది మాత్రమే కూర్చోవటానికి ప్లేస్ వుంది. దాంట్లో కొన్ని సర్దుబాట్లు చేసి నలభై మంది కూర్చోవటానికి అవకాశం కల్పించారు. ఆ కాలేజిలో పనిచేస్తున్న యాభై మంది లెక్చరర్లలో ఆ రోజు నలభై మంది మాత్రమే హాజరయ్యారు.

పరిచయాలు పూర్తయ్యాక నలభై మంది మాత్రమే హాజరయ్యారని ప్రిన్సిపాల్ వెంకటేశ్వరరావు గమనించాడు. ఆ నలభై మందిలో పదిమంది వరకు కాంట్రాక్టు లెక్చరర్లున్నారని కూడా ప్రిన్సిపాల్ గమనించాడు. ఎవరైనా లెక్చరర్ రిటైరైతే ఆ ఖాళీని ప్రభుత్వం వెంటనే భర్తీ చెయ్యడం లేదు. వారి స్థానంలో నిరుద్యోగులుగా ఉన్న పోస్టుగ్రాడ్యుయేట్స్‌ని కాంట్రాక్టు లెక్చరర్స్‌గా, పదివేల కన్సాలిడేటెడ్ జీతంతో నియమిస్తున్నారు.

"నలభై మంది మాత్రమే హాజరయ్యారు.. మిగతా పదిమంది..? " అన్నాడు ప్రిన్స్‌పాల్ సాంబశివరావుతో.

"లీవ్ పెట్టారు సార్" అన్నాడు సాంబశివరావు.

"ఒకటే రోజు పదిమంది లీవ్‌లో ఉండటమా? దిసీజ్ టూ మచ్" అన్నాడు ప్రిన్స్‌పాల్.

సాంబశివరావు యేమీ మాట్లాడలేదు.

"ఇప్పుడు మన కొత్త ప్రిన్స్‌పాల్‌కు

స్వాగతం చెబుతూ మన స్టేట్ లెక్చరర్స్ అసోసియేషన్ ప్రెసిడెంట్ సూర్యారావు మాట్లాడ్తారు" అన్నాడు సాంబశివరావు.

ముందు వరసలోనే కూర్చున్న సూర్యా రావు చాలా ఠీవీగా మైక్ ముందుకొచ్చి నిల్చున్నాడు. సూర్యారావు ఎప్పుడూ సఫారీ సూటులోనే ఉంటాడు. నల్లగా, లావుగా, గుబురైన మీసాలతో చూడగానే ఇతడో వి.ఐ.పి. అన్నట్టుగా కనిపిస్తాడు. అతను ఇంగ్లిషులో మాట్లాడాడు.

"ప్రియమైన మిత్రులారా!" అని మొద లెట్టి, వెంకటేశ్వరరావుగారు ఈ కాలేజీకి ప్రిన్స్‌పాల్‌గా ప్రమోటై రావడం తనకు చాలా సంతోషాన్ని కల్గించిందన్నాడు. తన లాగే ఆయన కూడా ఇంగ్లిషు లెక్చరర్‌గానే చాలాకాలం పనిచేశాడన్నాడు. తనలాగే ఆయనక్కూడా మంచి ఇంగ్లీషు టీచరన్న పేరుంది అన్నాడు. తనకంటె ఆయన రెండేళ్ళు సీనియర్.. ఈ కారణం చేతనే ఆయనకు తనకంటే ముందే ప్రిన్స్‌పాల్‌గా ప్రమోషన్ వచ్చిందన్నాడు. తనక్కూడా త్వరలోనే ప్రిన్స్‌పాల్‌గా ప్రమోషన్ వస్తుం దని ఆశిస్తున్నానన్నాడు. ఎన్నో సమస్య లతో సతమతమవుతున్న ఈ కాలేజిని కొత్త ప్రిన్స్‌పాల్‌గారు బాగా అభివృద్ధి చేస్తారని ఆశిస్తున్నానన్నాడు. కొత్త ప్రిన్స్ పాల్‌గార్కి స్వాగతం చెబుతూ ఈ కాలేజి అడ్మినిస్ట్రేషన్‌లో తన సహకారం ఉంటుం దని చెప్పి సూర్యారావు తన స్థానంలోకెళ్ళి కూర్చున్నాడు.

మరో ఇద్దరు లెక్చరర్లు కూడా ప్రిన్స్‌పా ల్‌గార్కి స్వాగతం చెబుతూ క్లుప్తంగా తెలుగులో మాట్లాడారు.

తర్వాత సాంబశివరావు కూడా క్లుప్తంగా తెలుగులోనే మాట్లాడాడు.

"మిత్రులారా! మన కాలేజీకి వెంకటేశ్వ రరావుగారు ప్రిన్స్‌పాల్‌గా వచ్చినందుకు చాలా సంతోషిస్తున్నాను. ఇదివరకు ఈ కాలేజిలో ప్రిన్స్‌పాల్స్‌గా పనిచేసిన వాళ్ళం దరూ హైదరాబాద్‌లో ఉంటూ ఇక్కడికి అప్పుడప్పుడు వచ్చి వెళ్తుండేవాళ్ళు. కానీ వెంకటేశ్వరరావుగారు ఈ ఊరికి సకు టుంబ సమేతంగా, ఇక్కడే ఉండిపోవటా నికి రావడం చాలా ముదావహం" అని సాంబశివరావు అనగానే లెక్చరర్లంతా చప్పట్లు కొట్టారు.

"వారు ఇక్కడే ఉండి అహర్నిశలు తన దృష్టినంతా మన కాలేజి మీదనే కేంద్రీక రించి ఈ కాలేజినొక ఆదర్శవంతమైన కాలే జిగా తీర్చిదిద్దుతారని నేను ఆశిస్తున్నాను. మనందరం వారికి మన సంపూర్ణ సహకా రాన్ని అందజేద్దాం. వారికి నా హృదయ పూర్వక స్వాగతాన్ని చెబుతున్నాను. ఈ నాలుగుమాటలు చెప్పి నేనిప్పుడు మన కొత్త ప్రిన్స్‌పాల్‌గార్ని తమ సందేశాన్ని ఇవ్వవలసిందిగా కోరుతున్నాను" అని చెప్పి, సాంబశివరావు కూర్చున్నాడు.

వెంకటేశ్వరరావు లేచి నిల్చొని మైక్‌ను తన చేతిలోకి తీసుకున్నాడు.

"డియర్ కొలీగ్స్" అంటూ ఇంగ్లీషులో మాట్లాడటం ప్రారంభించాడు. చాలా ధారాళంగా స్వచ్ఛమైన ఇంగ్లిషులో అతడు చెప్పదల్చుకున్న విషయాలను స్పష్టంగా, వినేవాళ్ళ బుర్రల్లో నాటుకునేలా మాట్లా డాడు. కవిత్వంలా సాగిన అతని ఉప న్యాసం లెక్చరర్లందర్నీ ముగ్ధుల్ని చేసింది.

"నేనిక్కడకు వచ్చే ముందే నేనీ కాలేజిని గురించి తెలుసుకున్నాను. ఇదివరకటి ప్రిన్స్‌పాల్ ఎవరూ ఇక్కడ ఉండేవాళ్ళు కారని, చుట్టపుచూపుగా వచ్చి వెళ్లేవారని చెప్పారు. ఈ కారణం చేత ఈ కాలేజిని ఎవరూ పట్టించుకునేవాళ్ళు కారని తెలి సింది. నేను ఇక్కడే, ఈ ఊర్లోనే ఉంటాను. ఈ కాలేజినే నా ప్రపంచంగా చేసుకుంటాను. ఈ కాలేజి తప్ప నాకింకేదీ ముఖ్యం కాదు. ఏ సంస్థయినా బాగుపడా

లంటే ఆ సంస్థ నాయకుడు సరైన నాయకత్వం ఇవ్వగల్గాలి. రాత్రింబవళ్ళు ఆ సంస్థను బాగుపరచే ప్రయత్నంలో ఉండాలి.

ఒక సంస్థ నాయకునికి మరే వ్యాపకాలూ ఉండకూడదు.. కాబట్టి ఇలాంటి ఉన్నత విద్యాసంస్థ ఒక ఉత్తమోత్తమ విద్యాసంస్థగా రూపొందాలంటే అది నామీద, మీమీద ఆధారపడి ఉంటుంది. ఇదివరకు ఈ కాలేజిలో ఏం జరిగిందో మనం మరచిపోదాం. ఈ క్షణం నుండే దీన్నొక ఆదర్శప్రాయమైన విద్యాసంస్థగా.. ఒక విజ్ఞాన దేవాలయంగా మారుద్దాం.

నేను లెక్చరర్‌గా పనిచేస్తున్న రోజుల్లో చాలామంది ప్రిన్స్‌పాల్స్‌ని చూశాను. నేను చూసిన ప్రిన్స్‌పాల్స్ అందరిలో నాకు నరసింహారావనే ప్రిన్స్‌పాల్ ఎప్పుడూ గుర్తొస్తాడు. ఆయనే నా రోల్ మోడల్.. క్రమశిక్షణా రాహిత్యాన్ని, సోమరితనాన్ని, ఉదాసీనతని ఆయన సహించేవాడు కాడు. పాఠాలు సరిగ్గా చెప్పని వాళ్ళని, క్లాసులు ఎగ్గొట్టేవాళ్ళను ఆయన క్షమించేవాడు కాడు. వెంటనే వాళ్ళమీద చర్య తీసుకునేవాడు. ఆయనను 'పనిరాక్షసుడు' అంటుండేవాళ్ళు.. కాలేజిని తప్ప అతని కుటుంబాన్ని అసలే పట్టించుకునేవాడు కాడన్న విమర్శ కూడా ఆయన మీదుండేది. ఎవరేమనుకున్నా అతడు లెక్కచేసేవాడు కాడు. గొప్ప అంకితభావంతో అతడు తన పనిని తను చేసుకుపోయేవాడు. అలా నరసింహారావు తను పని చేసిన కాలేజిని నిజమైన 'టెంపుల్ ఆఫ్ లెర్నింగ్'గా తీర్చిదిద్దాడు. నేను ప్రిన్స్‌పాల్ ప్రమోషన్ పొందిన మరుక్షణం నుండి నరసింహారావులా పనిచేయాలని కలగంటుండేవాడిని. ఇప్పుడా అవకాశం లభించింది.

ప్రిన్స్‌పాల్‌కు తను పనిచేస్తున్న కాలేజిని ఉన్నత ప్రమాణాలకు తీసికెళ్ళటంలో గురుతరమైన బాధ్యత ఉంటుంది. నేను మీకీరోజు మీ బాధ్యతల్ని గుర్తు చెయ్యాలనుకుంటున్నాను. ప్రభుత్వం మనకు చాలా పెద్ద మొత్తాల్నే జీతంగా ఇస్తున్నది. కొత్త స్కేళ్ళు అమలు జరిగాక మన జీతాలు గణనీయంగా పెరిగాయి. మనం తీసుకుంటున్న జీతాలకు తగినంత పనిని మనం చేస్తున్నామా? లేదా? అని మనల్ని మనం ప్రశ్నించుకోవాలి. అధ్యాపకవృత్తి చాలా ఉదాత్తమైంది. మనం సమాజానికి మార్గదర్శకంగా ఉండాలి. మనల్ని మన విద్యార్థులు కాలేజీలోనే కాదు బయట కూడా గమనిస్తుంటారు. మన వ్యక్తిగత జీవితం కూడా మచ్చలేనిదిగా ఉండాలి.

> **కొత్తగాలి...**
>
> **నాడు రాజులిచ్చిన సంపద**
> **పద్మనాభస్వామిది!**
> **నేడు ప్రజల సంపద**
> **సత్యసాయి స్వామిది!**
> **సంపదెపుడూ స్వాములదే!!**
>
> – రావి రంగారావు, మచిలీపట్నం

నేనీ కాలేజిని సరైన మార్గంలో పెట్టడానికి కొన్ని కఠినమైన విధానాల్ని అనుసరించబోతున్నాను. మీరంతా కాలేజికి ఉదయం పదింటికల్లా రావాలి. ఐదు నిమిషాలు ఆలస్యంగా వచ్చినా మీరు సంతకం చెయ్యడానికి మీ అటెండెన్స్ రిజిష్టర్ మీకు అందుబాటులో ఉండదు. కాలేజి పనిచేస్తున్నంత సేపు, అంటే ఉదయం పది నుండి సాయంత్రం నాలుగు వరకు మీరంతా కాలేజిలోనే ఉండాలి. సాయంత్రం నాల్గింటికి మీరు రెండోసారి సంతకం చేశాకే కాలేజి నుండి బయటకు వెళ్ళాలి. ఎప్పుడైనా అవసరమైతే వర్కింగ్ అవర్స్

తర్వాత కూడా మీరు కాలేజీలోనే ఉండాలి. పని లేకుండా కాలేజిలో ఉండి ఏం చెయ్యాలన్న అనుమానం మీకు కలగవచ్చు. పని చేసేవాళ్ళకు పనిలేకుండా ఉండటమనేది ఎప్పుడూ జరగదు. రేపు చెప్పబోయే పాఠానికి సంబంధించిన ప్రిపరేషన్స్ చేసుకోవచ్చు. లైబ్రరీకి వెళ్ళి చదువుకోవచ్చు. విజ్ఞానం అనేది క్షణక్షణానికి విస్తరిస్తున్నది. నేర్చుకోవడమనే దానికి అంతం అనేది లేదు. అధ్యాపకుడు ఎప్పుడూ నేర్చుకుంటూనే ఉండాలి. మీరు లేటెస్ట్ విజ్ఞానాన్ని ఎంత నేర్చుకుంటే మీ విద్యార్థులకు అంత ప్రయోజనం సమకూర్చినవారవుతారు. రోజూ మీ టీచింగ్ డైరీలను రాయండి. రోజూ రేపు మీరు చెప్పబోయే పాఠానికి సంబంధించిన సినాప్సిస్‌ను తయారుచేసుకోండి. ప్రతిరోజూ అటెండెన్స్ తీసుకోండి. నెలరోజుల కొకసారి నేను మీ అటెండెన్స్ రిజిష్టర్లను, టీచింగ్ డైరీలను, మీ సినాప్సిస్సులను చెక్ చేస్తాను. వీటిని సరిగ్గా మెయిన్‌టెయిన్ చెయ్యనివాళ్ళ మీద యాక్షన్ తీసుకుంటాను. క్లాసులను ఆలస్యంగా వెళ్ళినా, టైమ్ కాకముందే క్లాసులను వదిలేసి వచ్చినా నేను క్షమించను. వాళ్ళపట్ల చాలా కఠినంగా వ్యవహరించబోతున్నాను. మీరూ నేనూ కలిసి ఈ కాలేజినొక అద్భుతమైన విజ్ఞాన దేవాలయంగా మారుద్దాం. అమెరికన్ ప్రెసిడెంట్ కూర్చొనే చెయిర్ ముందుండే టేబుల్ మీద 'హియర్ స్టాప్స్ ది బక్ పాసింగ్' అన్న సైన్ బోర్డు ఉండేదట. అంటే ఏ సమస్యయినా ప్రెసిడెంటు దగ్గరకు రావాలి, ఏ సమస్యనయినా ప్రెసిడెంటే పరిష్కరించాలి అని. ఇదే విషయం ప్రిన్స్‌పాల్‌కు కూడా అన్వయించాలి. ఏ సమస్యనయినా నేను పరిష్కరిస్తాను. కాబట్టి మీకేమైనా సమస్యలుంటే నా దృష్టికి తీసుకురండి. మన కమిషనర్ ఆఫ్ హైయర్ ఎడ్యుకేషన్ ఈజ్ మై బెస్ట్ ఫ్రెండ్. ఆయనకు చెప్పి మన కాలేజి సమస్యల్ని సాధ్యమైనంత వరకు పరిష్కరించటానికి ప్రయత్నిస్తాను. మీకు న్యాయంగా రావాల్సిన ఆర్థికపరమైన బెనిఫిట్స్ ఏమన్నా ఉంటే చెప్పండి. వెంటనే అవి మీకు అందేలా చూస్తాను.. థాంక్యూ లేడీస్ అండ్ జెంటిల్మన్.. థాంక్యూ ఫర్ గెట్టింగప్ దిస్ మీటింగ్.. థాంక్యూ సోమచ్" అంటూ ప్రిన్స్‌పాల్ తన ప్రసంగాన్ని ముగించాడు.

దుర్గారెడ్డి వందన సమర్పణ చేస్తూ ప్రిన్స్‌పాల్‌గార్కి తమ సంపూర్ణ సహకారం ఉంటుందని తెలియజేశాడు. టీపార్టీ తర్వాత ఆ సమావేశం ముగిసింది.

"ఏ కొత్త ప్రిన్స్‌పాలొచ్చినా ఇలాగే మాట్లాడ్తాడు. ఇవన్నీ జరుగుతాయా? పాడా? " అన్నాడు భుజంగరావు.

"ఈయన ధోరణి చూస్తే తను చెప్పినవన్నీ అమలు చేసేటట్టే కనిపిస్తున్నాడు" అన్నాడు మేథ్స్ లెక్చరర్ ముకుందరెడ్డి.

"ఆయన చెప్పినవన్నీ జరగాలంటే యే హిట్లరో, స్టాలినో దిగి రావాలి. దిసీజ్ నాట్ ది ఏజ్ ఆఫ్ డిక్టేటర్స్. దీస్ ఆర్ ది డేస్ ఆఫ్ డెమొక్రసీ" అన్నాడు సూర్యారావు.

"ఈ ప్రిన్స్‌పాల్ గొప్ప ఆరేటర్‌లా ఉన్నాడు. ఎంత అనర్గళంగా మాట్లాడాడో! ఆయన ఉపన్యాసం వింటోంటే చక్కని కవిత్వం వింటున్నట్లుగా ఉంది" అంది రమాదేవి.

"ఆయన ఇంగ్లీషు మీకంత గొప్పగా అనిపించిందా మేడమ్? నేనూ మాట్లాడగలను ఆ మాత్రం ఇంగ్లీషు" అన్నాడు సూర్యారావు.

లెక్చరర్లంతా వాళ్ళవాళ్ళ ఇష్టాయిష్టాలను బట్టి, వాళ్ళవాళ్ళ సంస్కారాన్ని బట్టి ఇలాంటి కామెంట్స్ చేసుకుంటూ వాళ్ళ వాళ్ళ స్టాఫ్ రూమ్స్‌లోకి వెళ్ళిపోయారు.

★ ★ ★

ఆ మర్నాడు ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వర రావు బోధనేతర సిబ్బందితో కూడా ఒక మీటింగ్ పెట్టాడు.

ఆఫీసులో జరగాల్సిన పనులు వేగంగా జరిగిపోవాలనీ, అలసత్వాన్నీ, సోమరి తనాన్నీ తను క్షమించనని చెప్పాడు. ఆఫీ సును ఆర్డర్‌లో పెట్టాల్సిన బాధ్యత సూప రింటెండెంట్‌దని, మిగతా అందరూ ఆయ నకు సహకరించాలనీ, ఏదన్నా సమస్య ఉంటే తన దృష్టికి తీసుకురావాలని చెప్పాడు. అందరూ పంక్చువల్‌గా ఆఫీ సుకు రావాలని, ఫైల్స్‌ని అప్‌టు డేట్‌గా, సిస్టమాటిక్‌గా మెయిన్‌టైన్ చెయ్యాలని, తన వరకు తాను ఏ ఫైల్సును క్లియర్

**కొత్తగాలి...**

**చెట్టులాంటి 'అపార్టు'మెంట్లో**
**గూళ్లలాంటి ఫ్లాట్లు**
**గాల్లో మాట్లాడుకుంటూ**
**రెండు పిట్టలు**
**'మనకంటే మనిషి ఎదగలేదు!'**

– పాయసం సుబ్రహ్మణ్య మహర్షి, నెల్లూరు

చెయ్యడంలో ఆలస్యం చెయ్యనని చెప్పాడు. ఆఫీసులో ఎవరూ ఎలాంటి అవినీతికి పాల్పడినా తను క్షమించనని సీరియస్ యాక్షన్ తీసుకుంటానని చెప్పాడు.

ఆ తర్వాత లైబ్రరీకి వెళ్ళి దానినంతా ప రిశీలించాడు. లైబ్రరీలో ఎక్కడి పుస్తకాలు అక్కడే పడున్నాయి. ఒక ఆర్డర్‌గానీ, శుభ్రతగానీ అక్కడున్నట్లు కనిపించలేదు. అక్కడున్న లైబ్రేరియన్ సుబ్రహ్మణ్యంతో, "ఇది లైబ్రరీలా లేదు. చెత్తకుండీలా ఉం ది. లైబ్రరీ అంటే కళాశాలకు ఆత్మ.. అంటే సోల్‌లాంటిది. వారం రోజులు టై మ్ ఇస్తున్నాను. లైబ్రరీని ఆర్డర్‌లో పెట్టాలి. పుస్తకాలన్నింటికీ ఇండెక్స్ కార్డులు తయారుచెయ్యాలి. ఏ పుస్తకం ఎక్కడుందో క్షణాల్లో చెప్పగల్గాలి. మీకే దన్నా సహాయం కావాలంటే చెప్పండి.. ఇస్తాను. లైబ్రరీని మాత్రం ఆర్డర్‌లో పెట్టి విద్యార్థులకు, లెక్చరర్లకు పుస్తకాల్ని సకాలం లో అందచేస్తుండాలి. ఇచ్చిన పుస్తకాల్ని రెండు వారాల్లో తిరిగి వచ్చేలా చూడాలి. ఆలస్యంగా ఇస్తే పెనాల్టీలు విధించాలి. నేను యూజీసీ నుండి లైబ్రరీ కోసం గ్రాంట్స్ తెప్పిస్తాను. ప్రతి సబ్జెకుకు సం బంధించిన లేటెస్ట్ బుక్స్ అండ్ మేగజైన్స్ మన లైబ్రరీలో ఉండాలి. లైబ్రరీని మీరు ప్రాపర్‌గా మెయిన్‌టైన్ చెయ్యకపోతే మీమీద యాక్షన్ తీసుకుంటాను" అంటూ చెప్పి లైబ్రరీలోంచి వెళ్ళిపోయాడు.

ప్రిన్స్‌పాల్ అలా వెళ్ళిపోగానే "ఈయన చెప్పినవన్నీ బాగానే ఉన్నాయి. ఇవన్నీ జరిగేవా? పాడా? వారం రోజులు కాదు కదా.. నెల రోజులు టైమ్ ఇచ్చినా ఈ లైబ్రరీని ఆయన అంటున్న ఆర్డర్‌లో పెట్టలేం" అన్నాడు సుబ్రహ్మణ్యం తన అసిస్టెంట్ శంకరయ్యతో. కానీ ప్రిన్స్ పాల్ వచ్చి వెళ్లాక ఆ లైబ్రరీలో కొన్ని మార్పులొచ్చాయి.

ఆ తర్వాత సైన్స్‌ల్యాబ్స్ అన్నీ ప్రిన్స్ పాల్ చూశాడు. ఏమేం ప్రాబ్లమ్స్ ఉన్నాయో తెలుసుకున్నాడు. అన్ని ల్యాబ్స్‌ని శుభ్రం చేయించాడు.

వెంకటేశ్వరరావు ఆ కాలేజిలో చేరిన నెలరోజుల్లోనే ఎన్నో అద్భుతమైన మార్పులొచ్చాయి.

ఒకరోజు సాంబశివరావును పిలిచి "మన కాలేజిలో పీజీ క్లాసెస్‌కు తగిన క్లాసురూమ్స్ లేకపోవడం నాకు చాలా పెద్ద లోపంగా కనిపిస్తున్నది. ఆ విద్యా ర్థుల్ని మనం ఒంటిగంట తర్వాత రమ్మం

టున్నాం. అప్పటికి డిగ్రీ క్లాసెస్ కొన్ని పూర్తయిపోతాయి కాబట్టి ఆ క్లాసుల్లో పీజీ స్టూడెంట్స్‌ని ఎకామిడేట్ చేస్తున్నాం. కెమిస్ట్రీవాళ్ళకు సరైన ల్యాబ్ కూడా లేదు. డిగ్రీ స్టూడెంట్స్‌కున్న ల్యాబ్‌లోనే పీజీ స్టూడెంట్స్‌తో ఎక్స్‌పెరిమెంట్స్ చేయిస్తున్నాం.. దిసీజ్ వెరీ బ్యాడ్" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"అవును సార్! పీజీ క్లాసెస్ మంజూరు చేశారే తప్ప ఆ క్లాసుల్ని నడపటానికి ఇక్కడ సరైన వసతులున్నాయా? లేవా? అని ఎవరూ పట్టించుకోవడంలేదు. పీజీ క్లాసెస్ కోసం సెపరేట్‌గా నాల్గు క్లాసురూములు, ఒక ల్యాబ్‌ను నిర్మించటానికి ఫండ్స్ సాంక్షన్ చెయ్యండని కమిషనర్‌గార్కి రాశాను. ఇప్పట్లో అంత పెద్ద మొత్తం సాంక్షన్ చెయ్యలేమన్నారు" అన్నాడు సాంబశివరావు.

"ఆ సెపరేట్ బ్లాక్ నిర్మించటానికి ఎంతవుతుందంటారు? "

"ఓ పది లక్షలౌతుందని ఇక్కడి ఇంజినీర్ ఒకతను ఎస్టిమేట్ చేశాడు సార్"

"ఎవరా ఇంజినీర్.. ఆనందరావేనా? "

"అవును సార్! అతడు మీకు తెలుసా? "

"వాడు నాకు తమ్ముడౌతాడు. మా చిన్నమ్మ కొడుకు. నాకో ఐడియా ఉంది సాంబశివరావుగారూ.."

"చెప్పండి సార్!"

"గవర్నమెంట్ ఇప్పట్లో ఆ సెపరేట్ బ్లాక్‌కోసం ఫండ్స్‌ను సాంక్షన్ చేసే ఆశ లేదు.. కాబట్టి మనమే ఓ పని చేస్తే ఎలా ఉంటుంది? "

"ఏ పని సార్? "

"నాకు సినిమా హీరో విజయరామారావు.. అదే వి.ఆర్.రావు బాగా తెలుసు.. అతడూ నేనూ బీఏ వరకు ఒకటే కాలేజిలో చదువుకున్నాం. అతనితో ఈ ఊర్లో ఒక బెనిఫిట్ షో ఏర్పాటుచేస్తే ఎలా ఉంటుంది? "

"వి.ఆర్.రావు ఇప్పుడు మన సినిమా ఫీల్డులో టాప్ హీరో.. అతడంటే జనం పడి చస్తున్నారు. అతడితో బెనిఫిట్ షో ఏర్పాటుచేస్తే బ్రహ్మాండంగా ఉంటుంది"

"ఔను కదా! ఆ పని చేద్దాం.. పది లక్షలు కాదు.. వి.ఆర్. రావుతోబాటు ఓ టాప్ హీరోయిన్ను కూడా తీసుకువస్తే ఇరవై లక్షలొస్తాయి. మనం వెంటనే ఆ సెపరేట్ బ్లాక్ నిర్మాణాన్ని చేపట్టవచ్చు"

"ఐడియా బావుంది సార్!"

"వి.ఆర్. రావు ఈజ్ మై బెస్ట్ ఫ్రెండ్.. నేను అడిగాక కాదనడు! అతన్ని ఫోన్ మీద కాంటాక్ట్ చేసి వెంటనే వెళ్ళి కలిసి బెనిఫిట్ షోకు అతన్ని ఒప్పిస్తాను"

"మనం బెనిఫిట్ షో ఏర్పాటు చేసి ఫండ్స్‌ను కలెక్ట్ చెయ్యటానికి రూల్స్ ఒప్పుకోవేమో సార్!"

"నాకు తెలుసయ్యా.. మనం డైరెక్ట్‌గా ఇన్‌వాల్వ్ కాకూడదు. ఈ ఊర్లోని ప్రముఖులతో కాలేజి డెవలప్‌మెంట్ కమిటీ పేరుతో ఒక సంస్థను ఏర్పాటు చేద్దాం. వాళ్ళే ఈ బెనిఫిట్ షోను నిర్వహిస్తారు. అలా కలెక్టయిన డబ్బుతో వాళ్ళే ఈ సెపరేట్ బ్లాకును నిర్మించి కాలేజికి డొనేట్ చేస్తారు"

"బావుంది సార్! అలా చేస్తే మనకే సమస్యా ఉండదు"

"చూడండి సాంబశివరావుగారూ.. ఐదారు నెలల్లో ఈ కాలేజిని 'ది బెస్ట్ కాలేజి ఇన్ ఏపీగా' మార్చేస్తాను" అన్నాడు వెంకటేశ్వరరావు.

బెనిఫిట్ షోను నిర్వహించాలన్న ఐడియా వచ్చిన మరుక్షణం నుండి వెంకటేశ్వరరావు రాత్రింబవళ్లు దాన్ని అమలు చెయ్యడం కోసమే తనకున్న శక్తినంతా వినియోగించాడు.

ఆ ఊర్లో ఉన్న ప్రముఖులందర్నీ కది

లించాడు. వాళ్ళతో ఒక మీటింగ్‌ను నిర్వ హించి 'కాలేజి డెవలప్‌మెంట్ కమిటీ' పేరుతో ఒక సంస్థను ఏర్పాటు చేశాడు. ఆ తర్వాత వి.ఆర్. రావుతో అప్పాయింట్ మెంట్ తీసుకుని హైదరాబాద్ వెళ్ళి ఆ పాపులర్ సినిమా హీరోను కలిశాడు. ఎంతో బిజీగా ఉండే వి.ఆర్. రావు తన చిన్ననాటి మిత్రుని అభ్యర్థనను కాదనలేక పోయాడు. సరిగ్గా పదిహేను రోజుల తర్వాత తను తన ట్రూపుతో వచ్చి బెని ఫిట్ షోలో పాల్గొంటానన్నాడు. తనతో బాటు సుజాత అనే పాపులర్ హీరో యిన్నూ, సుమతి అనే ప్లేబాక్ సింగర్‌ని, మ్యూజిక్ డైరెక్టర్ రఘుపతిని, అతని ఆర్కెస్ట్రాని తీసుకొస్తానన్నాడు.

నవంబర్ 15వ తేదీన్నాడు జమాలపల్లికి ఈ సినిమావాళ్ళంతా వచ్చి కాలేజి డెవల ప్‌మెంట్ కోసం ఓ బెనిఫిట్ షో ఇవ్వబో తున్నారన్న ప్రచారం జమాలపల్లిలోనే కాకుండా ఆ చుట్టుపక్కల గ్రామాల్లో కూడా విస్తృతంగా జరిగింది.

ఐదు వందలు, వెయ్యి, రెండు వేలు - ఈ డినామినేషన్స్‌తో మూడు క్లాసులకు టికెట్ల రేట్లను నిర్ణయించారు.

వెంకటేశ్వరరావు ఆ జిల్లా కలెక్టర్‌ను, ఆ జిల్లా డి.ఐ.జి.ని, ఎస్పీని, ఇతర ముఖ్య అధికారులందర్నీ కలిశాడు. టికెట్లను అమ్మిపెట్టడంలో వారి సహకారం కావాల న్నాడు. వెంకటేశ్వరరావులోని ఉత్సాహాన్ని, అంకితభావాన్ని, డైనమిజాన్ని చూసిన ప్రభుత్వాధికారుల్లో కదలిక వచ్చింది. అందరూ తమ తమ డిపార్ట్‌మెంట్స్ ద్వారా ఇన్నిన్ని టికెట్స్ అమ్మి పెడ్తామని చెప్పటమే కాకుండా చెప్పిన మాటను నిల బెట్టుకున్నారు.

నవంబర్ 15వ తేదీనాడు జమాలప ల్లిలో భూనభోంతరాళాలు దద్దరిల్లేలా ఆ సినీ కళాకారుల ప్రదర్శన జరిగింది. తమ అభిమాన తారల్ని చూడటానికి జనం ప్రవాహంలా విశాలమైన ఆ సభాస్థలికి కదలివచ్చారు. దాదాపు నాల్గు గంటల పాటు ఆ సినీ కళాకారుల ప్రదర్శన ప్రజల్ని హర్షాతిరేకాలతో ఉర్రూతలూగిపో యేలా చేసింది. ఊహించిన దానికంటే ఎక్కువగా టికెట్లు అమ్ముడుపోయాయి.

సినీ కళాకారుల ప్రదర్శన ముగిశాక హీరో వి.ఆర్. రావు మాట్లాడుతూ..

"సాధారణంగా నేనిలాంటి బెనిఫిట్ షోలకు అంగీకరించను.. కానీ నా చిన్న నాటి స్నేహితుడు వెంకటేశ్వరరావొచ్చి ఒక సత్కార్యం కోసం నువ్వీ షోకి ఒప్పుకోవా లని అడిగినప్పుడు కాదనలేకపోయాను. వెంకటేశ్వరరావు, నేను ఒకప్పుడు ఒకే ప్రాణంగా బతికినవాళ్ళం. ఆయనకు చాలా గొప్ప ఐడియాస్ ఉన్నాయి. వాటిని అమలు చెయ్యాలన్న ఉత్సాహం అతనిలో పుష్కలంగా ఉంది. అనుకున్నదాన్ని సాధించటం కోసం అతడెంత సాహసాని కైనా పూనుకుంటాడు. హీ ఈజ్ ఎ డెవి లిష్ వర్కర్. ఈ షోని సక్సెస్ చెయ్యటా నికి అతడీ పదిహేను రోజుల్నుండి రాత్రిం బవళ్ళు నిద్రాహారాల్ని కూడా లెక్కచెయ్యకుండా ఎంత శ్రమించాడో చూడండి. హాట్సాఫ్ టు మై ఫ్రెండ్ వెంక టేశ్వరరావు" అని అనగానే సభంతా చప్ప ట్లతో దద్దరిల్లిపోయింది. చప్పట్లు ఆగిపో యాక వి.ఆర్. రావు మళ్ళీ తన ప్రసం గాన్ని మొదలుపెట్టాడు.

"ఇప్పుడే ఈ సభా నిర్వాహకులు చెప్పారు.. మా కాలేజి డెవలప్‌మెంట్ కోసం ఇరవై లక్షలు ఈ బెనిఫిట్ షో ద్వారా వసూలయ్యాయని" మళ్ళీ సభంతా చప్పట్లతో మార్మోగిపోయింది.

"ఈ ఇరవై లక్షల చెక్కుని మీ అందరి సమక్షంలో మీ కాలేజి డెవలప్‌మెంట్ కమిటీ చైర్మన్, ఈ ఊరి ప్రముఖ అడ్వొ

కేట్ ఆర్.వి.ఎస్.వి. ప్రసాద్‌గార్కి అంద జేస్తున్నాను" అని వి.ఆర్.రావు అనౌన్స్ చేశాడు. దాంతో వెంటనే ఆర్.వి.ఎస్.వి. ప్రసాద్ స్టేజిమీదకొచ్చి వి.ఆర్.రావు చేతుల మీదుగా ఆ ఇరవైలక్షల చెక్కును సభంతా చప్పట్లతో దద్దరిల్లిపోతోంటే, స్వీకరించారు.

"ఈ బెనిఫిట్ షోలో పాల్గొన్న మా సినీ కళాకారులందరూ ఒక్క పైసా కూడా తీసుకోకుండా ఇందులో పాల్గొన్నారని చెప్పటానికి నేను చాలా గర్విస్తున్నాను. ఒక మంచిపనికోసం మా సినీ కళాకారులె ప్పుడూ ఇలా స్వచ్ఛందంగా ముందుకొస్తా రని మనవి చేస్తూ నేను సెలవు తీసుకుం టున్నాను" అంటూ వి.ఆర్.రావు తన ప్రసంగాన్ని ముగించాడు.

ఆ తర్వాత డెవలప్‌మెంట్ కమిటీ ఛైర్మన్ ఆర్వీఎస్వీ ప్రసాద్ మాట్లాడుతూ "కేవలం ఒకే ఒక వ్యక్తి వల్ల మన ఊర్లో ఇంత బ్రహ్మాండమైన షో జరిగింది. ఆ ఒకే ఒక వ్యక్తి ఎవరో మీకు తెలుసు.. ఆయనే మన ఊరికి కొత్తగా వచ్చిన ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు" అనగానే మళ్లీ సభలో చప్పట్ల జడివాన కురిసింది.

"వెంకటేశ్వరరావు మన టౌనునంతా ఓ కుదుపు కుదిపి, నిద్రపోతున్న మమ్మల్నం దర్నీ మేలుకునేలా చేశాడు. కొన్ని క్షణాల్లో ఇరవై లక్షలు వచ్చిపడేలా చేశాడు. ఇదొక అద్భుతం. నిజానికి మేం.. డెవలప్‌మెంట్ కమిటీవాళ్ళం చేసిందేమీలేదు. చేసిందంతా వెంకటేశ్వరరావుగారే. ఈ ఇరవై లక్షల్ని ఒక్క పైసా కూడా దుర్వినియోగం కాకుండా ప్రతి పైసాను మన కాలేజి డెవ లప్‌మెంట్ కోసమే ఖర్చు చేస్తామని మనవి చేస్తున్నాను" అని ఆర్వీఎస్వీ ప్రసాద్ తన ప్రసంగాన్ని ముగించాడు.

చివర్లో వెంకటేశ్వరరావు గొప్ప ఆవే శంతో పదిహేను నిమిషాలసేపు అనర్గ ళంగా మాట్లాడి తన సంకల్పాన్ని విజయ వంతం చేసిన అందరికీ పేరుపేరునా కృత జ్ఞతలు చెప్పాడు.

ఆ జిల్లా కలెక్టర్, డీఐజీ, ఎస్పీ, ఎగ్జిక్యూ టివ్ ఇంజినీర్, స్థానిక ఎం.ఎల్.ఎ., ఎం.పి. మొదలైన వి.ఐ.పి.లందరూ వెంక టేశ్వరరావును అభినందించారు.

రెండు మూడు రోజుల తర్వాత ఆ ఇర వై లక్షల డబ్బును ఆర్ అండ్ బీలో డిపా జిట్ చేశారు.

ఎగ్జిక్యూటివ్ ఇంజినీర్ ఆనందరావు ప్రత్యేక శ్రద్ధ తీసుకొని ఆ కాలేజీలో పీజీ క్లాసుల నిర్వహణకోసం సెపరేటు బ్లాకు నిర్మాణాన్ని రెండు నెలల్లో పూర్తిచేశాడు.

ఆ సెపరేటు బ్లాకును ప్రారంభించటా నికి వెంకటేశ్వరరావు తన మిత్రుడు, కమి షనర్ ఆఫ్ హయ్యర్ ఎడ్యుకేషన్ పూర్ణచం

## పీవీ చతురోక్తులు



తెలుగుజాతి ముద్దుబిడ్డ పీవీ నరసింహారావు మొట్ట మొదటి దక్షిణాదిప్రధానిగా దేశాన్ని నూతన ఆర్థిక వి ధానంలోకి నడిపించారు. బహుభాషా కోవిదుడు, సాహితీవేత్త అయిన ఆయ న తన సంభాషణల్లో అనేక చమత్కారాలు వినిపించేవారు. వివిధ సందర్భాల్లో ఆయన పేల్చిన చతురోక్తులు కొన్ని..

**ఔనా? ఇరుపక్షాలకు బాధేనా?**

రాజీవ్‌గాంధీ మంత్రివర్గంలో పి.వి. విదేశాంగ శాఖ మంత్రిగా ఉన్నప్పుడు పాకిస్తా న్‌ను పర్యటించారు. అప్పుడు పాకిస్తానీయులు పి.వితో ఇలా అన్నారు- దేశవిభజన వల్ల తాజ్‌మహల్‌ను, కాశ్మీర్‌ను మేము వదలిరా వటంతో చాలా బాధగా ఉన్నది' అని.

దానికి పి.వి. వెంటనే సమయస్ఫూర్తితో 'మొహెంజోదారో, హరప్పా కట్టడాలను కోల్పోయి మేము కూడా అంతే బాధపడు తున్నాం' అన్నారు.

ద్రరావును ఆహ్వానించాడు. ఆ ప్రారంభోత్సవ సభకు మళ్ళీ జిల్లా అధికారులందరూ హాజరయ్యారు. స్థానిక ఎం.ఎల్.ఎ., ఎం.పి. మొదలైన ఇతర రాజకీయ నాయకులు కూడా ఆ సభకొచ్చారు.

ఒక్కొక్క గదిని ఒక్కొక్క వి.ఐ.పి. చేత రిబ్బన్ కట్ చేయించి ఓపెన్ చేయించారు. ఆ తర్వాత జరిగిన సభలో వక్తలంతా ప్రిన్సిపాల్ వెంకటేశ్వరరావును వేనోళ్ళ పొగిడారు. ఒకే ఒక వ్యక్తి- వెంకటేశ్వరరావులాంటి సమర్థుడైన వ్యక్తి- తలుచుకుంటే ఇలాంటి అద్భుతాలెన్నింటినో సృష్టించగలరని, అతని ఈ విజయం రుజువు చేసిందని అందరూ అంగీకరించారు. చివర్లో కమిషనర్ ఆఫ్ హయ్యర్ ఎడ్యుకేషన్ పూర్ణచంద్రరావు మాట్లాడుతూ "వెంకటేశ్వరరావు ఇలాంటి అద్భుతాలు సాధించగలడని నాకు తెలుసు.. అతడు ఎం.ఎ.లో నా క్లాస్‌మేట్.. యాజ్ ఎ స్టూడెంట్, హీ వాజ్ ఎక్స్‌ట్రీమ్లీ బ్రిలియంట్.. అతడూ నేనూ స్టడీస్‌లో పోటీ పడ్తుండేవాళ్ళం. మమ్మల్నిద్దర్నీ మా లెక్చరర్లు 'ఇంటలెక్చువల్ ట్విన్స్' అంటుండేవాళ్ళు. హీ ఈజ్ ఎ డెవిలిష్ వర్కర్.. ఎ హార్డ్‌టాస్క్ మాస్టర్ అండ్ ఎ గ్రేట్ డిసిప్లినేరియన్. ఇతని ఆధ్వర్యంలో ఈ కాలేజి ఒక బెస్ట్ అండ్ ఐడియల్ కాలేజిగా రూపొందుతుందన్న నమ్మకం నాకుంది. ఈ కాలేజిలో పనిచేస్తున్న ప్రతి ఒక్కర్నీ, ఈ కాలేజిలో చదువుకుంటున్న ప్రతి విద్యార్థినీ నేను ప్రత్యేకంగా కోరేదేమిటంటే ఇంత గొప్పవ్యక్తి మీకు ప్రిన్సిపాల్‌గా వచ్చినందుకు దాన్ని మీ అదృష్టంగా భావిస్తూ ఆయనకు మీరందరూ హృదయపూర్వకంగా సహకరించాలనీ, ఈ కాలేజినొక భూతల స్వర్గంగా మార్చాలని కోరుతున్నాను" అని పూర్ణచంద్రరావు తన ప్రసంగాన్ని ముగించాడు.

తర్వాత వెంకటేశ్వరరావు అందరికీ కృతజ్ఞతలు చెప్పడంతో ఆ సభ ముగిసింది.

ఆ కాలేజిలో పీజీ విద్యార్థులకోసం ఐదు వేరే గదులతో ఒక బ్లాక్ నిర్మాణం జరగటంతో ఆ కాలేజికొక కొత్తశోభ ఏర్పడింది. పీజీ క్లాసుల్ని తీసుకోవడానికి ప్రత్యేకంగా ఒక ఇంటర్వ్యూ ఏర్పాటు చేసి ఒక్కొక్క సబ్జెక్టుకూ ఇద్దరి చొప్పున కాంట్రాక్ట్ లెక్చరర్లను అపాయింట్ చేశారు. పీజీ విద్యార్థులందరూ ప్రిన్సిపాల్‌గార్కి కృతజ్ఞతలు చెప్పారు.

వెంకటేశ్వరరావు స్వయంగా వెళ్ళి ఎం.ఎ. ఇంగ్లీషు చదువుతున్న విద్యార్థులకు క్లాసులు తీసుకునేవాడు. ఆయన లెక్చర్లు విన్న విద్యార్థులు 'ఇంత గొప్పగా ఇంగ్లిషు చెప్పే లెక్చరర్లుంటారా?' అని ఆశ్చర్యపడ్తుండేవాళ్లు.

ప్రిన్సిపాల్‌గా వెంకటేశ్వరరావు ఆ కాలేజిలో చేరిన నాలుగు నెలల్లోనే ఆ కాలేజి స్వరూపం పూర్తిగా మారిపోయింది. రోజూ మూడు నాలుగుసార్లు రౌండ్స్ తీసుకుంటూ లెక్చరర్లందరూ క్రమం తప్పకుండా క్లాసులు తీసుకునేలా చేశాడు. విద్యార్థుల్ని వరండాల్లో తిరుగుతూ అల్లరి చేయకుండా చూశాడు. విద్యార్థులు కాలేజికి సక్రమంగా సకాలంలో వచ్చి క్లాసులో కూర్చునేలా చేశాడు. అందరికంటే ముందే

## కొత్తగాలి...

**జర్నలిస్టు దారుణహత్య**
**మరణానికి కారణం**
**అతని నిజాయితీగల కలం**
**అవును,**
**ఇప్పుడు కలంపైన కత్తిదే విజయం**

*- యార్లగడ్డ నిర్మల, హైదరాబాద్*

కాలేజికొచ్చి అందరూ వెళ్ళిపోయాకే తను వెళ్లిపోయేవాడు. అస్తవ్యస్తంగా ఉన్న లైబ్రరీని ఒక క్రమపద్ధతిలో పనిచేసేలా మార్చేశాడు. అలాగే కాలేజి ఆఫీసును, ఆఫీసులో పనిచేసే బోధనేతర సిబ్బందిని కూడా ఒక క్రమపద్ధతి ప్రకారం నడుచుకునేలా చేశాడు. చాలా త్వరలోనే 'ఇతను సామాన్యుడు కాదు... హార్డ్‌టాస్క్ మాస్టర్' అనే పేరు తెచ్చుకొన్నాడు.

ఓరోజు "యముడొస్తున్నాడు.. జాగ్రత్త" అన్నాడు సూర్యారావు తనతోబాటు స్టాఫ్ రూంలో కూర్చున్న మిగతా లెక్చరర్స్‌ని ఉద్దేశించి. యముడంటే ప్రిన్సిపాల్ అని అక్కడున్నవాళ్లందరికీ తెలుసు. వెంకటేశ్వరరావు పనిచేస్తున్న తీరును చూసి అతనికి ఆ కాలేజిలో పనిచేస్తున్న లెక్చరర్లు 'యముడు' అని పేరుపెట్టారు.

"ఈ కొత్త ప్రిన్సిపాల్‌కి రౌండ్స్ పిచ్చి బాగా ఉన్నట్టుంది. వచ్చినప్పట్నించి రోజూ రెండు మూడుసార్లు రౌండ్స్ తీసుకుంటున్నాడు" అన్నాడు మరో లెక్చరర్ వాసుదేవ్. ఆయన ఎకనామిక్స్ లెక్చరర్.

"ఈరోజు మరీ త్వరగా వచ్చేస్తున్నాడే.. నాకిప్పుడు క్లాస్ వుంది. పిల్లలంతా బయటే ఉన్నారు.. ఆయనొచ్చి మీకిప్పుడెవరి క్లాసని అడిగితే వాళ్లు నా పేరే చెబుతారు.. ఇప్పుడెలా? " అన్నాడు భుజంగరావు.

"ఎలా ఏమిటి? వెంటనే పరుగెత్తండి.. ఆయన రౌండ్స్‌కి రావడం ఇప్పుడే స్టార్ట్ చేసినట్టున్నాడు. ఆయన మీ క్లాసుదాకా రాకముందే మీరు వెళ్లి క్లాసు తీసుకోవడం ప్రారంభించండి" అన్నాడు సూర్యారావు.

"నేనేం ప్రిపేర్ కాలేదే.. ఈరోజసలు క్లాసులుండవనుకున్నాను. నిన్నటిదాకా సెలవులేకదా.. ఈరోజు పిల్లలెవరూ కాలేజికి రాకపోవచ్చనుకున్నాను" అన్నాడు భుజంగరావు. ఈయన హిస్టరీ లెక్చరర్.

"నేనూ అలాగే అనుకున్నాను. కొత్త బిచ్చగాడు పొద్దెరగడు అన్నట్టుగా ఈరోజు కూడా మన స్టూడెంట్స్ వచ్చి క్లాసుల్లో కూర్చున్నారు.. మహా చదివేవాళ్ళలాగ" అన్నాడు స్టాఫ్‌రూంలో ఉన్న పొలిటికల్ సైన్స్ లెక్చరర్ వీరస్వామి.

"మీరిలా కబుర్లు చెప్పుకుంటూ ఇక్కడే కూర్చుంటే ఆయనొచ్చి మిమ్మల్ని దొంగను పట్టుకున్నట్టు పట్టుకుంటాడు. మీరు వెళ్లి క్లాసులో కూర్చొని ఏదో చెబుతుండండి" అన్నాడు సూర్యారావు.

హడావిడిగా "అలాగే.. అలాగే" అంటూ భుజంగరావు అటెండెన్స్ రిజిష్టర్ పట్టుకొని తను తీసుకోవలసిన క్లాసురూం దగ్గరకు పరిగెత్తుతున్నట్టుగా వెళ్ళాడు.

అప్పటికే ప్రిన్సిపాల్ వరండాలో తిరుగుతూ ఒక్కొక్క క్లాసురూంలోకెళ్తూ లెక్చరర్లు క్లాసులో ఉన్నారో లేదో గమనిస్తున్నాడు. చాలా క్లాసుల్లో లెక్చరర్లున్నారు. కొంచెం దూరంలో ఉన్న క్లాసురూంలోకి అప్పుడే వెళ్తున్న భుజంగరావును ఆయన చూశారు. కొత్తగా వచ్చిన ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు ఆజానుబాహుడు.. స్ఫురద్రూపి, ఆరడుగుల ఎత్తు.. ఎత్తుకు తగిన లావు.. ఎర్రటి శరీరఛాయ.. విశాలమైన నుదురు.. చురుకైన కళ్ళు.. కోటేరులాంటి ముక్కు.. యాభైయేళ్ళొచ్చినా ఎక్కడా తెల్ల వెంట్రుకలు లేని క్రాఫ్.. ఎప్పుడూ ఫుల్ సూటులో గంభీరంగా కనిపించే ఆయన్ను చూస్తే ఒక డిగ్రీ అండ్ పీజీ కాలేజి ప్రిన్సిపాలంటే ఇలాగే ఉండాలన్న అభిప్రాయం కలుగుతుంది. ఆయన్నందరూ టాస్క్ మాస్టర్ అంటారు. స్ట్రిక్ట్ డిసిప్లినేరియన్ అంటారు. ఈ లెక్చరర్లు పెద్ద పెద్ద జీతాలు తీసుకుంటున్నారు. కానీ ఎవ్వరూ వాళ్లకు ముడుతున్న జీతాలకు ఎంత పని చెయ్యాలో అంత పనిచెయ్యటంలేదు అనే అభిప్రాయం ఆయనకుంది. అందరితోనూ పనిచేయించటం తన కనీస బాధ్యత.



దేన్నయినా క్షమించవచ్చుగానీ పని ఎగవేయటాన్ని క్షమించకూడదనుకుంటాడతడు.

ప్రతిరోజూ ఆయన తన కాలేజిలో లెక్చరర్లందరూ క్లాసులు తీసుకుంటున్నారో లేదో చూడటానికి రెండు మూడుసార్లు రౌండ్స్ తీసుకుంటాడు.

నెల రోజుల టర్మ్ హాలిడేస్ తర్వాత ఆ రోజే కాలేజిని తెరిచారు.

వరండాలో తిరుగుతూ ఒక క్లాసురూం తర్వాత మరో క్లాస్‌రూంను చెక్ చేస్తున్న వెంకటేశ్వరరావుకు హడావుడిగా బి.ఎ. సెకండియర్ క్లాసులోకెళ్తున్న భుజంగరావు కనిపించాడు.

భుజంగరావు క్లాసులు సరిగ్గా తీసుకోడని, ఏదో నెపంతో క్లాసులు కాన్సిల్ చేస్తుంటాడని వెంకటేశ్వరరావు దగ్గరికి చాలా ఫిర్యాదులొచ్చాయి. అందుకని ఆయన భుజంగరావు మీద ప్రత్యేక దృష్టి పెట్టాడు. హడావుడిగా వెళ్తున్న భుజంగరావును చూడగానే, క్లాసుకు ఇరవై నిమిషాలు ఆలస్యంగా వెళ్తున్నాడని అర్థమైంది. ఈ రోజతని సంగతి తేల్చాలనుకున్నాడు.

వేగంగా నడుస్తూ ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు వరండా చివర్లో ఉన్న ఆ క్లాసు రూం దగ్గరకు చేరాడు. భుజంగరావు చాలా మెల్లగా, టైమ్ గడవాలన్నట్టుగా అటెండెన్స్ తీసికొంటూ కనిపించాడు.

ప్రిన్స్‌పాల్ ఆ క్లాసులోకెళ్లి "మిస్టర్ భుజంగరావు" అన్నాడు.

"సార్!" అంటూ భుజంగరావు వినయంగా లేచి నిల్చున్నాడు.

"ఇప్పుడు టైమెంతయిందో తెలుసా? "

"పదిన్నరయ్యింది సార్!"

"మీ క్లాసు ఎప్పుడు స్టార్ట్ అవుతుంది? "

"పదింటికి సార్!"

"అంటే మీరు అరగంట ఆలస్యంగా క్లాసు తీసుకుంటున్నారు"

"సారీ సార్! నిన్నటిదాకా హాలిడేస్ కదా.. ఈరోజు పిల్లలు రారనుకున్నాను"

"అలా ఎలా అనుకుంటారు? పిల్లలు ఈరోజు క్లాసులకు రారని ముందే ఊహించుకొని, మీరు క్లాసు తీసుకోవద్దని నిర్ణయించుకోవడం దారుణం. ఈరోజు అన్ని క్లాసులు జరుగుతున్నాయి.. ఒక్క మీ క్లాసు తప్ప"

"నా క్లాసు కూడా జరుగుతూనే ఉంది కద సార్!"

"అరగంట ఆలస్యంగా వచ్చి అటెండెన్స్ తీసుకుంటున్నారు. అటెండెన్స్ తీసుకొని వదిలేస్తారు.. అంతేనా? "

"వదిలెయ్యను సార్.. పాఠం చెబుతాను"

"ఎప్పుడు చెబుతారు? మీరు పాఠం మొదలెట్టేటప్పటికే టైమయిపోతుంది"

"సారీ సార్.. ఈ ఒక్కరోజే ఇలా జరిగింది. నేనిదివరకెప్పుడూ క్లాసులకు లేట్‌గా వెళ్లలేదు. నేను చాలా రెగ్యులర్‌గా క్లాసులు తీసుకుంటాను సార్!"

"మీరు రెగ్యులర్‌గా క్లాసులు తీసుకోరని మీమీద బోల్డు కంప్లెయింట్సు ఉన్నాయి. యూ ఆర్ రెగ్యులర్లీ ఇర్రెగ్యులర్ అనడానికి నా దగ్గర చాలా సాక్ష్యాలున్నాయి"

"మీకెవరో నేనంటే గిట్టనివాళ్లు చెప్పి ఉంటారు సార్! నేను రెగ్యులర్‌గా క్లాసులు తీసుకుంటాను. కావాలంటే స్టూడెంట్స్‌ని అడగండి" అన్నాడు భుజంగరావు.

అతడామాట అనగానే వెనక బెంచీలో కూర్చున్న ఓ విద్యార్థి నవ్వాడు.

"మీ స్టూడెంట్సే చెప్పారు. మీరు క్లాసులు ఎగ్గొడ్తారని" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"నా స్టూడెంట్సే చెప్పారా? ఎవరు వాళ్లు? వాళ్ల పేర్లు చెప్పండి సార్..? "

"వాళ్ల పేర్లు చెబితే ఏం చేస్తారు? వాళ్ల తలలు పగలగొడ్తారా? "

"ప్రిన్స్‌పాల్ హోదాలో ఉన్న మీరు అలా మాట్లాడటం బాగాలేదు. కావాలంటే

# అరుదైన ఉద్యోగం!




ఇండియానా రాష్ట్రం, కొలంబస్ జాతీయ రహదారిలో ఉన్న మెక్‌డొనాల్డ్ రెస్టారెంట్‌లో పనిచేసే జోసెఫ్ ఎంబ్రే(25) ప్రత్యేక ఉద్యోగి. గత ఐదేళ్ళు అక్కడ పనిచేస్తున్న అతను విని యోగదారుల్లో చాలా మంది అభిమానుల్ని సంపాదించు కున్నాడు. వారందరితో అతను ఎంతో మర్యాదగా మసలుకుంటాడు. 'హౌ ఆర్యూ టుడే?' అని ఆద రంగా పలకరిస్తాడు. ఎవ రైనా చిరాగ్గా ఉంటే, జోక్స్ చెప్పి నవ్విస్తాడు. ఫోన్ ద్వారా కస్టమర్స్ ఆర్డర్స్ ఇచ్చే టప్పుడు, వారి కంఠ స్వరాన్ని బట్టే మూడ్‌ని గ్రహించగలడు. ఓసారి ఓ కస్టమర్ అభిరుచు ల్ని తెలుసుకుంటే దాని ప్రకారమే వారికి సర్వ్ చేస్తాడు. ఎవరికి కాఫీతో పాటు చక్కెర, పాలు ఎక్కువ కావాలో, ఇంకా ఎవరెవరికి ఏ మేమి కావాలో గొంతును గుర్తించే ఆ ప్రకారం సర్వ్ చేసాడు. ఓ రోజు హాస్పిటల్‌లో తన తల్లిని చేర్పించి వచ్చానని ఓ కస్టమర్ చెప్పాడు. అప్పటి నుంచి అతని కంఠం వినబడినప్పు డల్లా ఆమె ఆరోగ్యం గురించి అడిగేవాడు. ఇలాగే కస్ట మర్స్ పిల్లల గురించి కూడా అడుగుతుంటాడు. ఎవరైనా తన మీద చిరాకు పడ్డా జోసెఫ్ కోపం తెచ్చుకోడు.



ఇతని మంచి ప్రవర్తనని గమనించి మేక్‌డొనాల్డ్స్ యాజమాన్యం ఉద్యోగులకు మంచి ప్రవర్తనను బోధించ మని ఎక్కువ జీతంతో జోసెఫ్‌ను అందుకు నియమించింది.

'దేవుడు మనుషులకి ఒకరినొకరు ప్రేమిం చమని బోధించాడు. మనం చేయాల్సింది అదే' అనేది అతని బోధనా సారాంశం.

---

ఇప్పుడు ఈ క్లాసులో ఉన్న పిల్లల్ని అడ గండి. ఏమోయ్! మీరు చెప్పండి.. నేను క్లాసులు రెగ్యులర్‌గా తీసుకుంటానా? లేదా? " అన్నాడు భుజంగరావు, ఆ క్లాసులో ముందు వరుసలో కూర్చున్న పిల్లల్ని ఉద్దేశించి.

ఆ క్లాసులో కూర్చున్న పిల్లలంతా నిశ్శ బ్దంగా మారిపోయి ఒకరి మొహాలొకరు చూసుకోసాగారు.

"చెప్పండి.. ఎందుకలా ఒకరి మొహాలొ కరు చూసుకుంటున్నారు? నేనెంత రెగ్యు లర్‌గా క్లాసులు తీసుకుంటానో ప్రిన్స్‌పా ల్‌కు చెప్పండి.." అన్నాడు భుజంగరావు.

అతని గొంతులో అసహనం ధ్వనిం చింది.

అతడన్న ఆ మాట వినగానే వెనక సీట్లో కూర్చున్న కొందరు స్టూడెంట్స్ ఫక్కుమని నవ్వారు. వాళ్లు అలా నవ్వగానే మిగతా స్టూడెంట్స్ కూడా నవ్వారు. క్లాసంతా నవ్వులతో నిండిపోయింది.

"షటప్.. షటప్.. ఎందుకలా నవ్వుతు న్నారు? బ్లడీఫూల్స్.. మీకు బుద్ధిలేదా? మీకసలు చదువే అక్కర్లేదు. వీధుల్లో పడి తిరిగే రౌడీవెధవలు.. మీకు చదువెందు కురా? బయటకువెళ్లి గాడిదల్ని కాయండి" పెద్దగా అరిచాడు భుజంగరావు.

"వాళ్లనెందుకు తిడ్తారు.. మీ బండా రాన్ని బయటపెట్టినందుకా? వాళ్లకు చదువు అక్కర్లేదు అంటున్నారు.. మీకు చదువు చెప్పటం చేతనయితే కదా వాళ్లు చదువుకునేది.."

"నాకు చదువు చెప్పడం చేతకాదం టారా? నా విద్యార్థుల ముందే నన్నిలా

అవమానిస్తారా? మీరసలు ఏమనుకుంటున్నారు? ప్రిన్సిపాల్ అయినంత మాత్రాన మీ ఇష్టమొచ్చినట్టు మాట్లాడొచ్చుననుకుంటున్నారా? యూ మస్ట్ నో యువర్ లిమిట్స్" అన్నాడు భుజంగరావు కోపంగా.

"నా లిమిట్స్ ఏమిటో నాకు మీరు చెప్పాలా మిస్టర్ భుజంగరావు? నన్నో నిజం చెప్పమంటారా? మీరసలు క్లాసులే తీసుకోరు. ఎప్పుడైనా ఏ అమావాస్యకో పున్నమికో తీసుకుంటే ఏవో ఉబుసుపోక కబుర్లు తప్ప సీరియస్‌గా పాఠం చెప్పరని మీ విద్యార్థులే చెప్పారు. యూ ఆర్ అన్ ఫిట్ టు బీ ఎ లెక్చరర్!"

"నన్నూ ఓ నిజం చెప్పమంటారా? యూ ఆర్ అన్‌ఫిట్ టుబీ ఎ ప్రిన్స్‌పాల్.. యూ ఆర్ ఎ బ్లడీ సాడిస్ట్.. అందర్నీ అవమానించి ఏడ్పించటం తప్ప మీకేమీ చేతకాదు.."

"నన్ను అన్‌ఫిట్ టు బీ ఎ ప్రిన్స్‌పాల్ అంటావా? నన్ను సాడిస్ట్ అంటావా? నీకెన్ని గుండెలు? నన్ను.. ఈ కాలేజికి ప్రిన్స్‌పాల్‌ని.. నీ బాస్‌ని సాడిస్ట్ అంటావా? దిసీజ్ గ్రాస్ ఇన్‌సబార్డినేషన్.. నిన్నేం చేస్తానో చూడు" ఆవేశంతో ఊగిపోతూ అన్నాడు ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు. అలా అంటూనే క్లాసులోంచి బయటకు వెళ్లిపోయాడు. విపరీతమైన కోపంతో అతని తల తిరిగిపోయింది. అతని శరీరమంతా చెమటతో నిండిపోయింది. పిచ్చి ఆవేశం అతన్ని ఉక్కిరిబిక్కిరి చేసింది.

'వాడికెంత పొగరు? వాడి పొగరు అణచకపోతే నా జన్మ వృథా.. నన్ను సాడిస్ట్ అంటాడా? వాడో పనిదొంగ. ఏనాడూ క్లాసులు తీసుకున్న పాపాన పోడు. వాడికి నెలకు అరవై వేల జీతం. అరవై రూపాయల పనికూడా చెయ్యడం లేదు. వాడిని ఉద్యోగంలోంచి తీయించెయ్యాలి' అనుకుంటూ వరండాలో వేగంగా నడుస్తూ తన రూం చేరుకున్నాడు ప్రిన్స్‌పాల్.

వరండాలో నిల్చొని కబుర్లు చెప్పుకుంటున్న స్టూడెంట్స్ అంతా అతన్ని చూడగానే క్లాసుల్లోకెళ్లి కూర్చుంటున్నారు. అప్పుడే ఫస్ట్ పీరియడ్ అయిపోయి సెకండ్ పీరియడ్ స్టార్ట్ కాబోతున్నది. సెకండ్ పీరియడ్ తీసుకోవాల్సిన లెక్చరర్లు ఇంకా క్లాసుల్లోకి రాలేదు.

'అసలీ లెక్చరర్లు అందరూ దొంగలే. ఐదారు నిమిషాలకు ముందే క్లాసులు వదిలేస్తారు. ఐదారు నిమిషాలు ఆలస్యంగా క్లాసులోకెళ్తారు. అటో ఐదారు నిముషాలు.. ఇటో ఐదారు నిముషాలు.. అటెండెన్స్ తీసుకోవటానికి మరో ఐదారు నిమిషాలు.. కొందరైతే అటెండెన్సే తీసుకోరు. రిజిష్టర్ కూడా లేకుండా.. వట్టి చేతులతో క్లాసుల్లోకెళ్లి నాల్గు కబుర్లు చెప్పి బయటకొచ్చేస్తారు. ఏం ప్రిపేర్ కాకుండానే క్లాసులోకెళ్తారు.. పాఠం చెప్పటానికి మిగిలే టైమెంత? అరగంట కూడా ఉండదు. ఆ అరగంట కూడా వీళ్లు సరిగ్గా పాఠం చెబుతారా.. ఏవో ఉబుసుపోక కబుర్లో.. కుళ్లు జోకులో చెప్పి బయటపడ్తారు. నేను లెక్చరర్‌గా పనిచేసే రోజుల్లో ఎంత సిన్సియర్‌గా పాఠాలు చెప్పేవాడినో! ఆ భుజంగరావొక్కడే కాదు.. ఈ లెక్చరర్లలో చాలా మంది అధ్యాపకులుగా పనిచెయ్యటానికి అనర్హులనిపిస్తుంది' అనుకుంటూ తన ఛేంబర్‌లోకి వచ్చాడు వెంకటేశ్వరరావు.

ప్రిన్స్‌పాల్ ఛేంబర్ చాలా అర్భాటంగా ఉంది. చాలా విశాలమైన రూంలో రివాల్వింగ్ చెయిర్. తళతళ మెరుస్తున్న టేబుల్. ఆ టేబుల్ మీద కంప్యూటర్. ప్రిన్స్‌పాల్ టేబుల్ చుట్టూ చాలా విలువైన ఫర్నీచర్.. చాలా విలువైన చెయిర్స్.. ఎయిర్‌కండిషనర్స్‌ని అరేంజ్ చెయ్యటం వల్ల గది అంతా చాలా చల్లగా ఉంది.

ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరావొచ్చి చాలా విసురుగా తన రివాల్వింగ్ చెయిర్లో కూర్చున్నాడు. అతని దృష్టి టేబుల్ మీదున్న డస్ట్‌మీద పడింది.

వెంటనే అతడు బెల్ నొక్కాడు. అటెండర్ హుస్సేన్ వచ్చి ముందు నిల్చున్నాడు.

"సార్!" అన్నాడు హుస్సేన్.

"ఇడియట్.. నీకెన్నిసార్లు చెప్పానురా? ప్రతిరోజు ఉదయమే టేబుల్‌ను తుడవాలని.." అన్నాడు ప్రిన్స్‌పాల్.

"మరచిపోయాను సార్!" అంటూనే హుస్సేన్ టేబుల్‌ను తుడవటం మొదలెట్టాడు.

"మర్చిపోతావురా.. ఒంట్లో భయముంటే మరుపెందుకొస్తుంది? ఈయనేం చేస్తాడులే అన్న నిర్లక్ష్యం. ఈ కాలేజీలో ఎవడికీ బాధ్యత లేదు.. బరువూ లేదు. నెలనెలా వేలకొద్ది జీతాలకు మాత్రం రెడీ.. మీలాంటి వాళ్లందరూ కలిసి ఈ దేశాన్ని దోచుకుంటున్నారు. అది సరేగాని సూపర్నెంట్‌ను రమ్మను.." అన్నాడు ప్రిన్స్‌పాల్.

భుజంగరావు అన్నమాటే అతనికి పదే పదే గుర్తొస్తోంది. తనకే గనుక అధికారం ఉంటే అతన్ని వెంటనే ఉద్యోగంలోంచి డిస్మిస్ చేసేసేవాడు. ఇదో దరిద్రపు గవర్నమెంట్ కాలేజి.. ఏం చేయాలన్నా బోల్డు రూల్స్..

"సార్" అంటూ సూపర్నెంట్ పరమేశం వచ్చి నిల్చున్నాడు.

"ఏమిటోయ్ పరమేశం.. ఆఫీసులో అందరూ వచ్చారా? ఎవరైనా లీవ్స్ పెట్టారా? " అన్నాడు.

"ముగ్గురు పెట్టారు సార్" అన్నాడు సూపర్నెంట్.

"ఒకటేరోజు ముగ్గురికి లీవ్స్ సాంక్షన్ చేస్తే పనులెలా జరుగుతాయి? వియ్ మస్ట్ బి స్ట్రిక్ట్ ఎబౌట్ సాంక్షనింగ్ లీవ్స్.. లీవ్స్ విషయంలోనే కాదు.. ప్రతీ విషయంలోనూ స్ట్రిక్టు ఉండాలి. ఈ కాలేజి చాలా అధ్వాన్నంగా ఉంది. ఇదివరకటి ప్రిన్స్‌పాల్ హయాంలో ఏం జరిగిందో నా కనవసరం. నా టైమ్‌లో మాత్రం.. ఎవ్రీ థింగ్ షుడ్‌బీ ఇన్ ఆర్డర్.. ఎవ్రీథింగ్ షుడ్‌బీ సిస్టమాటిక్.. అయామ్ ఎ స్ట్రిక్ట్ ఫెలో.. సోమరితనాన్ని, బాధ్యతా రాహిత్యాన్ని నేను క్షమించను. ఈరోజు భుజంగరావనే లెక్చరర్ నేను రౌండ్స్‌కు వెళ్లినప్పుడు నాతో మిస్‌బిహేవ్ చేశాడు.. అతనికి వెంటనే మెమో ఇవ్వాలి.. క్లాసులు ఎగ్గొడ్తున్నావనీ, ప్రిన్స్‌పాల్‌తో దురుసుగా మాట్లాడావనీ, నీమీద క్రమశిక్షణ చర్య ఎందుకు తీసుకోకూడదో వారం రోజుల్లోగా చెప్పాలని మెమో ఇవ్వండి.." అన్నాడు ప్రిన్స్‌పాల్.

"ఆ భుజంగరావును ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు సార్.. ఇదివరకటి ప్రిన్స్‌పాల్ అతనికిలాగే మెమోలిచ్చి భంగపడ్డారు.. మీరతని జోలికి వెళ్లకపోతేనే మంచిది సార్!" అన్నాడు సూపర్నెంట్.

"మిస్టర్ సూపర్నెంట్! చెప్పిన పని చెయ్యకుండా మీరు మీ పైఆఫీసర్‌కు 'ఇలా చెయ్యకూడదు, అలా చెయ్యకూడదు' అని సలహాలు కూడా ఇస్తుంటారా? మీ లిమిట్స్ ఏమిటో మీరు తెలుసుకోవటం

## కొత్తగాలి...

**గతం**
**కాదు అసంగతం**
**భవితకు**
**దిశానిర్దేశం**

– కె.ఎన్. ఆచార్యులు,
విజయనగరం

చాలా అవసరం"

"సారీ సార్.. మీరీ కాలేజికి కొత్తకదా.. ఎవరెలాంటివాళ్లో మీకు తెలియదు కదా.. అందుకే మీకలా చెప్పాను. ఆ భుజంగరావుకు రాజకీయంగా ఈ ఊళ్లో చాలా పలుకుబడి ఉంది. అతడ్ని ఇక్కడి నుంచి రెండుసార్లు ట్రాన్స్‌ఫర్ చేశారు. రెండు సార్లూ అతడు ఆ ట్రాన్స్‌ఫర్‌ని కాన్సిల్ చేయించుకున్నాడు"

"అదంతా నాకనవసరం. మీరు నాకివన్నీ చెప్పడం కూడా అనవసరం. మీకు చెప్పిన పని చెయ్యండి. ఆ మెమోను డ్రాఫ్ట్ చేసి పట్టుకురండి.. వెళ్లండి" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"అలాగే సార్!" అంటూ పరమేశం వెళ్లిపోయాడు.

ప్రిన్స్‌పాల్ మళ్లీ బెల్ నొక్కాడు.

★ ★ ★

"సార్" అంటూ హుస్సేన్ వచ్చాడు.

"బీ వన్ సెక్షన్ సుజాతను రమ్మను"

"అట్లనే సార్" అంటూ హుస్సేన్ వెళ్లిపోయాడు.

రెండు నిమిషాల తర్వాత సుజాత ఓ ఫైల్ పట్టుకొని ఆ రూంలో ప్రవేశించింది.

సుజాత చాలా అందంగా ఉంటుంది. అధునికంగా అలంకరించుకుంటుంది. స్లీవ్‌లెస్ జాకెట్స్.. హైహీల్స్ షూస్.. వెంట్రుకల్ని లూజ్‌గా వదిలేస్తుంది. ఆమెను చూడగానే చాలామంది పురుషపుంగవులు కనుబొమ్మలెగరేస్తుంటారు.

సుజాత ఆ గదిలో ప్రవేశించగానే ఫ్రెంచ్ పెర్‌ఫ్యూమ్ సువాసనలు ఆ గదంతా వ్యాపించాయి.

ఆమెను చూడగానే వెంకటేశ్వరరావు నొసలు చిట్లించాడు. చూడకూడని దృశ్యాన్ని చూసినట్లుగా మొఖం పెట్టాడు.

"గుడ్‌మార్నింగ్ సర్!" అందామె చాలా హుషారుగా.

"ఈ గుడ్‌మార్నింగులకేంలే.. నిన్న డిక్టేట్ చేసిన లెటర్‌ను డీటీపి చేశావా?" అన్నాడు.

"చేశాను సార్.. ఇదిగో.." అంటూ ఫైలులోంచి ఓ పేపర్ తీసి అతనికి చాలా దగ్గరగా వచ్చి చేతికిచ్చింది.

"మరీ ఇంత దగ్గరకు రావలసిన అవసరం లేదు. ఎవరి ప్లేస్‌లో వాళ్లుండటం మంచిది" అన్నాడు, ఆమె ఇచ్చిన పేపర్ మీదకు దృష్టి సారిస్తూ.

"నో ప్రాబ్లెమ్ సర్!" అందామె కొంచెం దూరంగా నిలబడుతూ.

"ఏం సెంటు పూసుకున్నావు? వాసనతో నా తల తిరిగిపోతోంది. రేపట్నించి నువ్వా సెంట్ పూసుకొని కాలేజీకి రావొద్దు.. తెల్సిందా? నువ్వేదైనా పెళ్ళికో.. పేరంటానికో వెళ్తే పూసుకో. కానీ కాలేజికి.. ముఖ్యంగా నా రూంకు ఈ తల తిరిగే సెంట్ పూసుకొని రావొద్దు.."

"ఇది చాలా మంచి పెర్‌ఫ్యూమ్ సార్.. చాలా ప్లెజెంట్‌గా ఉంటుంది. మీరేదో బ్యాడ్‌మూడ్‌లో ఉన్నట్టున్నారు.." అంది సుజాత నవ్వుతూ.

"చాలు.. ఎక్కువ మాట్లాడొద్దు.. చెప్పింది చెయ్యి.. నేనేం బ్యాడ్ మూడ్‌లో లేను.. మంచి మూడ్‌లోనే ఉన్నాను" అంటూ అతడు ఆమె ఇచ్చిన పేపర్‌ను

## కొత్తగాలి...



**బద్దలైన అద్దంలో**
**బహిర్గతమైంది**
**బహుముఖీన దుఃఖం**

*– ఎలనాగ, హైదరాబాద్*

చదవడం మొదలెట్టాడు.

"ఏంటిది? లెటర్‌నిండా తప్పులే. ఇది హైయర్ ఎడ్యుకేషన్ మినిష్టర్‌గార్కి వెళ్ళా ల్సిన లెటర్. ఇన్ని తప్పులతో వెళ్తే మన పరువేమన్నా ఉంటుందా?" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"ఆ లెటర్‌లో తప్పులున్నాయంటు న్నారా? సరిగ్గా చూశారా మీరు? దాంట్లో తప్పులేవీ లేవు సార్!" అందామె చాలా కా న్ఫిడెంట్‌గా.

"తప్పుల్లేవని అంత మొండిగా ఎలా చెబుతున్నావు? ఇదిగో ఫస్ట్ పేరాగ్రాఫ్ లోనే ఇమ్మీడియెట్లీ స్పెల్లింగ్ తప్పుంది"

"ఇమ్మీడియెట్లీ స్పెల్లింగ్ తప్పుందా?"

> **కొత్తగాలి...**
>
> **పెట్టుబడికి**
> **ముడుపులు**
> **పట్టుబడితే**
> **ఏడుపులు**
>
> – *ఇంద్రగంటి నరసింహమూర్తి,*
> కాకినాడ

అంటూ ఆమె టేబుల్ మీదున్న లెటర్ మీదకు వంగి చూసినప్పుడు ఆమె పమిట కాస్త పక్కకు తొలగి ప్రిన్స్‌పాల్ మొఖం మీద పడింది.

"ఛీఛీ.. ఏమిటిది? మరీ మీదమీదకొస్తు న్నావు.. కొంచెం జాగ్రత్తగా బిహేవ్ చెయ్యలేవా?" అన్నాడతడు చాలా చిరాగ్గా.

"సారీ సార్! ఇమ్మీడియెట్లీ స్పెల్లింగ్ తప్పంటారేమిటి? కరెక్ట్‌గానే ఉందికదా!"

"కరెక్ట్‌గా లేదు.. 'ఐ' క్యాపిటల్ లెటర్ పెట్టావు. అక్కడ క్యాపిటల్ అవసరం లేదు. అవసరం లేనిచోట క్యాపిటల్ లెటర్ పెడ్తే అసహ్యంగా ఉంటుంది"

"ఓ! అదా మీ అభ్యంతరం? అదేం పెద్ద తప్పు కాదులెండి" అందామె కొంచెం నిర్లక్ష్యంగా.

"నువ్వు నాకు ఇంగ్లిషు నేర్పిస్తున్నావా? నేను ఎం.ఎ. ఇంగ్లిషు గోల్డ్‌మెడలిస్టుని తెలుసా?"

"కావొచ్చు సార్.. మీరు ఎం.ఏ. ఇంగ్లిషు చదివిన రోజుల్లో ఈ కంప్యూ టర్స్, ఈ ఇంటర్నెట్‌లు ఎక్కడున్నాయి సార్? ఏ వర్డన్నా స్పెల్లింగ్ తప్పుగా టైపు చేస్తే వెంటనే కంప్యూటర్ అది తప్పని తెలియజేస్తుంది. మాకు డౌటొస్తే ఆ స్పెల్లింగ్ తప్పా? రైటా? అని కంప్యూ టర్ని అడుగుతాం. మీ రోజుల్లో ఇంత టెక్నాలజీ ఎక్కడుంది సార్?" అందామె నవ్వటానికి ప్రయత్నిస్తూ.

"మీ రోజుల్లో అంటే ఏమిటి నీ ఉద్దే శం? ఇవి మీ రోజులనా? మేం పూర్తిగా వెనకబడిపోయామనా? చేసిన తప్పును సమర్థించుకోవటానికి ఏదేదో మాట్లాడేస్తు న్నావు. ఇవన్నీ నా దగ్గర సాగవు. అయామ్ ఎ వెరీ స్ట్రిక్ట్ అండ్ ఫోర్త్‌రైట్ ఆఫీసర్. ఈ స్టూడెంట్స్, కాలేజి, ఆఫీసు అస్తవ్యస్తంగా ఉన్నాయి. వీటన్నింటినీ డ్రాస్టిగ్గా మార్చాల్సిన బాధ్యత నా మీదుంది"

"మార్చండి సార్.. మంచిదే కదా"

"మంచిదే కదా అని చిలకపలుకులు బాగానే పలుకుతున్నావు. నువ్వు చేసింది తప్పంటే మాత్రం ఒప్పుకోవటంలేదు"

"నేనేతప్పు చెయ్యనప్పుడు తప్పు చేశానని ఎలా ఒప్పుకుంటాను? ఆ లెటర్‌లో ఒక్క తప్పు కూడా లేదు" అందామె దృఢంగా.

"ఈ మొండితనమే నన్ను ఇర్రిటేట్ చేస్తుంది. అక్కడ 'ఐ' క్యాపిటల్ లెటర్ తప్పని మొత్తుకుంటోంటే తప్పు కాదంటా వేమిటి? నీకు నువ్వు ఏమనుకుంటు

న్నావు? ఎందుకు నీకింత పొగరు? అందంగా, ఫేషనబుల్‌గా ఉన్నావనా? షోకులమీద ఉన్నంత శ్రద్ధ పనిమీదుంటే బాగుండేది. అసలు మీలాంటి ఆడవాళ్ళకు ఉద్యోగాలివ్వొద్దు. స్లీవ్‌లెస్ జాకెట్లు వేసుకొని, వెంట్రుకలు విరబోసుకొని, ఒళ్ళంతా చూపించుకుంటూ ప్రతి మొగాడ్ని తమ వైపు తిప్పుకోవాలని చూస్తుంటారు. మీతో పెద్ద న్యూసెన్స్.." అన్నాడతను ఆమెవైపు చూడకుండా.. టేబుల్ మీదున్న ఫైల్స్‌లోకి చూస్తూ.

ఆమె ఉబికివస్తున్న కన్నీళ్ళను దస్తీతో తుడుచుకుంటూ "మీరు చాలా హార్ష్‌గా, హర్ట్ చేసేలా మాట్లాడుతున్నారు సార్" అంటూ ఆ రూంలోంచి విసురుగా బయటకు వెళ్ళిపోయింది.

"చేసే తప్పులన్నీ చెయ్యడం.. ఏమన్నా అంటే ఇలా ఏడ్చెయ్యటం.. ఛీఛీ.. ఈ ఆడ జాతంటేనే అసహ్యం పుడ్తోంది" అతనిలో అతడే మాట్లాడుకుంటున్నట్టుగా అన్నాడు.

అతడు మళ్ళీ బెల్ నొక్కాడు.

హుస్సేన్ లోపలికి రాగానే, "సూపర్నెంట్‌ను రమ్మను" అన్నాడు.

కాస్సేపట్లోనే ఆ రూంలోకి సూపర్నెంట్ పరమేశం వచ్చాడు.

"భుజంగరావుకిమ్మన్న మెమో రెడీ అయ్యిందా? " అన్నాడు ప్రిన్స్‌పాల్.

"అయ్యింది సార్!" అంటూనే పరమేశం అతని చేతిలో ఉన్న పేపర్స్‌ని ప్రిన్స్‌పాల్‌కిచ్చాడు.

ప్రిన్స్‌పాల్ ఆ పేపర్స్‌లో ఉన్న మ్యాటర్‌ని చకచకా చదివేశాడు.

"మిస్టర్ పరమేశం! మీరు సూపర్నెంట్‌గా ఎంతకాలం నుండి పనిచేస్తున్నారు? " అన్నాడు గంభీరంగా మొఖంపెట్టి.

"ఐదేళ్ళయింది సార్!" అన్నాడు సూపర్నెంట్ పరమేశం.

"ఐదేళ్ళయింది సార్! అంటున్నారు.. ఐదేళ్ళలో మీకు కనీసం తప్పు చేసిన వ్యక్తికి ఓ మెమో ఎలా డ్రాఫ్ట్ చెయ్యాలో తెలీకపోవడం చాలా ఆశ్చర్యంగా ఉంది"

పరమేశం ఏమీ మాట్లాడకుండా నిశ్శబ్దంగా ఉండిపోయాడు.

"మరీ ఇంత సాఫ్ట్‌గా డ్రాఫ్ట్ చేస్తారా? భుజంగరావు ఈజ్ ఎ హెడ్‌స్ట్రాంగ్ ఫెలో .. అలాంటివాడికి ఇంత సాఫ్ట్‌గా మెమో ఇస్తారా? చాలా కఠినమైన పదజాలంతో ఉండాలి. నేను కొన్ని కరెక్షన్స్ చేసిస్తాను. వెంటనే దీన్ని టైపు చేయించి అతనికీరోజే సర్వ్ చెయ్యండి. వారం రోజుల్లోగా ఈ మెమోకు జవాబివ్వాలని మార్చాలి.. మీరు రెండు వారాల టైమిచ్చారు.. నాకో విషయం చెప్పండి.. అతన్ని మనం వెంటనే సస్పెండ్ చెయ్యొచ్చా ? "

"సస్పెండ్ చేసే అధికారం మీకు లేద్సార్. ఆ పని కమిషనర్ ఆఫ్ హైయర్ ఎడ్యుకేషన్ చెయ్యాలి" అన్నాడు పరమేశం.

"అన్నీ కమిషనర్‌గారే చేసినప్పుడు ఈ ప్రిన్స్‌పాల్ ఎందుకు? కనీసం ఓ అటెండర్‌ను ఉద్యోగంలోంచి తీసేసే అధికారం కూడా ప్రిన్స్‌పాల్‌కు లేనప్పుడు ఎందుకీ ప్రిన్స్‌పాల్‌షిప్? అఫ్‌కోర్స్! కమిషనర్ ఆఫ్ హైయర్ ఎడ్యుకేషన్.. పూర్ణచంద్రరావు నా బెస్ట్‌ఫ్రెండే అనుకో.. చదువుకునే రోజుల్లో మేమిద్దరం క్లాస్‌మేట్స్‌మి.

**కొత్తగాలి...**

**ప్రేమించేటప్పుడు**
**భరించలేనిది విరహం**
**పెళ్లిచేసుకున్న తర్వాత**
**వారించలేనిది కలహం**

*– బద్దిగం పాండురంగారెడ్డి,*
కరీంనగర్

క్లాసులో ఎప్పుడు మేమిద్దరమే ఫస్టొచ్చే వాళ్లం. మమ్మల్నిద్దర్నీ ఆ రోజుల్లో 'ఇంట లెక్చువల్ ట్విన్స్' అంటుండేవాళ్ళు. అది సర్లే.. ఇదిగో ఈ మెమో తీసికెళ్ళి డీటీపీ చేయించండి. నేను చేసిన కరెక్షన్స్ అన్నీ కరెక్ట్‌గా క్యారీ అయ్యేలా చూడండి. ఆ టైపిస్టును చూస్తే తెగ పొగరుబోతులా ఉంది. ఒంటిమీదున్న శ్రద్ధ పనిమీద ఉన్నట్టులేదు. తప్పుల్లేకుండా జాగ్రత్తగా చెయ్యమని చెప్పండి"

"సుజాతనందరూ చాలా ఎఫిషియెంట్ టైపిస్టనే అంటారు.."

"అంటారంటారు.. కాస్త ఎర్రగా బుర్రగా ఉంది కదా! మనిషి అందంగా ఉంది కాబట్టి ఆమె చేసేపని కూడా అందంగానే ఉందనుకుంటారు. నేను ఎవరు ఎఫిషియెంటో? ఎవరు ఇన్ఎఫిషియెంటో? సులభంగా గుర్తించగలను.. నాకెవరూ చెప్పాల్సిన పనిలేదు. మీరా మెమోని డీటీపీ చేయించి పట్టుకురండి. ఈలోగా మరోసారి రౌండ్స్‌కి వెళ్ళొస్తాను" అన్నాడు ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు సీట్లోంచి లేస్తూ.




ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు తన ఛాంబర్‌లోంచి బయటకొచ్చి క్లాస్‌రూమ్స్ వైపు గంభీరంగా నడవటం ప్రారంభించాడు. రూమ్స్ బయట వరండాలో చాలా మంది విద్యార్థులు అటూ ఇటూ తిరుగుతూ కనిపించారు. వాళ్ళు తమవైపే వస్తున్న ప్రిన్స్‌పాల్‌ను చూడగానే ఎవరి క్లాసుల్లోకి వాళ్ళు వెళ్తూ కనిపించారు.

"వీడెవడో స్ట్రిక్ట్ ఫెలో ఉన్నట్టుందిరోయ్.. పోయిన ప్రిన్స్‌పాల్ మంచోడుండే.. అసలు రూంలోంచి బయటకు వచ్చేటోడే కాదు" అన్నాడు బీఎస్సీ ఫైనలియర్ స్టూడెంట్ సురేష్.

"నిజంరా.. ఆయన ధర్మరాజు.. ఎవర్నీ అనేటోడు కాదు" అన్నాడు విశాల్ అనే మరో స్టూడెంట్.

"పోయినోడు ధర్మరాజయితే ఈ వచ్చినోడు యమధర్మరాజులా ఉన్నాడు"

"మనకిప్పుడు జువాలజీ ప్రాక్టికల్స్.. మన జువాలజీ మేడమ్ కూడా వచ్చి ప్రాక్టికల్ క్లాసు తీసుకుంటున్నట్టుంది. త్వరగా ల్యాబ్‌కు వెళ్దాం పదండి. యమధర్మరాజు చూశాడంటే తిట్లదండకంతో క్లాసు తీసుకుంటాడు" అన్నాడు ఇంకో స్టూడెంట్.

వాళ్ళలా మాట్లాడుకుంటూ జువాలజీ ల్యాబ్ వైపు వెళ్తుండగా వాళ్ళకు ప్రిన్స్‌పాల్ ఎదురుగా రానేవచ్చాడు.

"ఏయ్ పిల్లలూ.. ఆగండి" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"చచ్చాంరా బాబోయ్!" అన్నాడు సురేష్.

వేగంగా నడుస్తూ ప్రిన్స్‌పాల్ వాళ్ళ దగ్గరకొచ్చాడు.

"మీకిప్పుడు క్లాసు లేదా?" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"ఉందిసార్" వాళ్ళల్లో కాస్త బుద్ధిమంతుడిలా కనిపించే అనిల్‌కుమార్ అనే విద్యార్థి అన్నాడు.

"ఏ క్లాస్?"

"జువాలజీ ప్రాక్టికల్స్ క్లాస్. ఆ క్లాసుకే వెళ్తున్నాం సార్.." అన్నాడు అనిల్.

"ఆ క్లాసు ఎన్నింటికి?"

"పదకొండు గంటలకు సార్"

# శ్మశాన వ్యాపారుల కినుక!




మృతదేహాలను కట్టెల మీద కాల్చడం ఒక్క భారతదేశంలోనే కాదు అమెరికాలో కూడా కొన్ని ప్రాంతాల్లో ఇప్పుడు ఆచారంగా మారుతోంది. కొలరాడో రాష్ట్రంలోని క్రెస్టోన్ అనే ఊళ్ళో ఓ కట్టెల స్మశానం వెలిసింది. ఓ పర్వత ప్రాంతంలోగల ఈ ఊరివారు మృత



దేహాలను ఆ స్మశానానికే తరలిస్తున్నారు. 'ది క్రిస్టోన్ ఎండ్ ఆఫ్ లైఫ్ ప్రాజెక్ట్'గా పిలిచే ఈ పద్ధతి ఇప్పుడు అమెరికాలోని ఇతర ప్రాంతాలకు కూడా వ్యాపిస్తోంది. జనవరి 2008లో క్రిస్టోన్‌లో మొదటి సారిగా ఓ శవాన్ని కట్టెలమీద కాల్చారు. అప్పటినుంచి 180 శవాలని అక్కడ తగలబెట్టారు.

అయితే ప్రతి రాష్ట ప్రభుత్వం ఇలాంటి స్మశాన వాటికలను ఏర్పాటు చేసుకోడానికి అనుమతి ఇవ్వాల్సి వుంటుంది. అడవులు అధికంగా గల కొలరాడో రాష్ట్రం అమెరికాలో తొలిసారిగా ఇలాంటి అనుమతి ఇచ్చింది. అమెరికాలో ఈ కార్యక్రమాన్ని ఓపెన్ ఎయిర్ క్రమేషన్‌గా పిలుస్తున్నారు. ఈ స్మశానవాటికలో తొలిసారిగా బెలిండవల్లిస్ అనే స్త్రీ దేహాన్ని చితిమీద తగలబెట్టారు. పాతిపెట్టినప్పుడు గోతిలోకి బంధుమిత్రులు మట్టిని ఎలా జల్లుతారో అలా ఒక్కొక్కరు ఒక్కో కట్టెను ఆమె చితిమీద ఉంచారు. ఇటుకలతో నిర్మించిన ప్లాట్‌ఫాంమీద శవాన్ని ఉంచి, మన స్మశానాల్లోలాగే కాల్చారు. ఐతే అమెరికన్ ఫ్యూనరల్ ఇండస్ట్రీ మాత్రం దీన్ని వ్యతిరేకిస్తోంది. ఎందుకంటే ఇది విస్తరిస్తే శవాన్ని పాతేందుకు నేలను అమ్మే తమ వ్యాపారం అటకెక్క వచ్చనేది వారి భయం.

ఫ్లోరిడా, కాలిఫోర్నియా, ఉతా, నెవెడా లాంటి చాలా రాష్ట్రాల్లో కట్టెల స్మశానాలు వేగంగా వెలుస్తున్నాయట.

"ఇప్పుడు టైమెంత? "

"పదకొండున్నరవుతోంది సార్!"

"పదకొండు గంటలకు క్లాసయితే క్లాసు కెళ్ళకుండా వరండాలో తిరుగుతూ, గోల చేస్తూ, ఇతర క్లాసుల్ని డిస్టర్బ్ చేస్తున్నారు.. మీ కేకలతో, మీ నవ్వులతో ఈ కాలేజినో ఫిష్‌మార్కెట్‌గా మారుస్తున్నారు.. ఔనా? "

వాళ్ళెవరూ మాట్లాడకుండా నిశ్శబ్దంగా ఉండిపోయారు.

"మిమ్మల్ని మీ తల్లిదండ్రులు ఎన్నో ఆశలతో కాలేజీలకు పంపిస్తున్నారు. మీమీద ఎంతో ఖర్చు చేస్తున్నారు. మీ తల్లిదండ్రులే కాదు, ప్రభుత్వం కూడా మీమీద ఎంతో ఖర్చు చేస్తున్నది. ఈ బిల్డింగ్, ఈ క్లాసురూమ్స్, ఈ లాబ్స్.. వీటిమీద ఎంత ఖర్చయిందో మీకు తెలుసా? మీకు పాఠాలు చెబుతున్న లెక్చరర్లకి ఎంతెంత జీతాలిస్తున్నారో తెలుసా? మీలోని ఎంతో మందికి ప్రభుత్వం స్కాలర్‌షిప్పులిస్తోంది. ఈ డబ్బంతా ఎక్కడిదనుకుంటున్నారు? ఇదంతా ప్రజలు పన్నులు చెల్లిస్తోంటే వస్తున్న డబ్బు.. అంటే ఈ డబ్బు ఏ ఒక్కడిదో కాదు.. ఈ దేశ ప్రజలందరిదీ.. దీన్ని ఎంతో జాగ్రత్తగా ఒక్క పైసా కూడా వృథా కాకుండా ఖర్చు పెట్టుకోవలసిన

బాధ్యత మనందరిదీ. కానీ మీరేం చేస్తున్నారు? మీకు క్లాసులక్కర్లేదు, పాఠాలక్కర్లేదు.. మీకు టెక్స్ట్‌బుక్స్ అక్కర్లేదు... మీకెప్పుడూ ఎంటర్‌టెయిన్‌మెంట్ కావాలి.. అల్లరి కావాలి.. నవ్వులు కావాలి.. అచ్చోసిన ఆంబోతుల్లా వరండాల్లో తిరుగుతూ కామ్‌గా జరుగుతున్న క్లాసెస్‌ని డిస్టర్బ్ చేస్తూ.. వాటీజ్ దిస్? మీరేమనుకుంటున్నారు? మీరేం చేసినా మిమ్మల్ని అడిగేవాళ్ళు లేరనుకుంటున్నారా? " ప్రిన్స్‌పాల్ ఇంకా ఏదో చెప్పబోతుండగానే..

"లేరని ఎలా అనుకుంటున్నం సార్.. చెట్టంత మనిషి మీరుండగా.." అన్నాడు ఆ గుంపు మధ్యలో ఉన్న ఓ విద్యార్థి. ఆ మాటతో అందరూ గొల్లున నవ్వారు.

**కొత్తగాలి...**

**పట్నం వర్టికల్ వ్యూ**
**పల్లె, పాపం!**
**గుడిసె పైన గుడిసె**
**కట్టరాదుగా మరి!**

– సి.హెచ్. గోపీకళ, నిజామాబాద్

"అవును.. నేను చెట్టంత మనిషినే కాదు.. గుట్టంత మనిషిని.. నేను మీ ఇదివరకటి ప్రిన్స్‌పాల్‌లాంటి వాడిననుకుంటున్నారేమో.. అయామ్ ఎ స్ట్రిక్టుఫెలో.. వెరీ వెరీ వెరీ స్ట్రిక్టుఫెలో.. పిచ్చి పిచ్చి వేషాలేస్తే మీ తోకలు తెగ్గోస్తాను.. బీకేర్‌ఫుల్"

"మాకు తోకలు లేవుకద సార్? " అన్నాడు ఆ గుంపు చివర్లోని ఓ విద్యార్థి.

మళ్ళీ అందరూ గొల్లున నవ్వారు.

"నేనింత సీరియస్‌గా మాట్లాడుతోంటే మీరిలా అడ్డగాడిదల్లా తిరుగుతూ వెకిలి నవ్వులు నవ్వుతారా! మీకు చదువులెందుకురా? వెళ్ళండి.. గాడిదల్ని కాయండి. రండి.. మీ సంగతి చెబుతా రండి.. జువాలజీ ల్యాబ్‌కు వెళ్దాం రండి.."

వాళ్ళందర్నీ తీసుకొని ప్రిన్స్‌పాల్ ఫస్ట్ ఫ్లోర్‌లో ఉన్న జువాలజీ ల్యాబ్‌కు వెళ్ళాడు. ఆ ల్యాబ్‌లో ప్రాక్టికల్స్ క్లాసు తీసుకుంటున్న లెక్చరర్ రమాదేవినుద్దేశించి, "ఈరోజు వీళ్ళందరికీ ఆబ్సెంట్ మార్క్ చెయ్యండి మేడమ్.. వీళ్ళనెవర్నీ క్లాసులోకి రానీయొద్దు. అటెండెన్స్ వెయ్యొద్దు. పిల్లలూ, మీకందరికీ నేనింకో సంగతి చెబుతున్నా.. మీకు డెబ్భైఐదు శాతం అటెండన్స్ లేకపోతే మిమ్మల్ని ఎగ్జామ్స్‌కి పంపించను. అయామ్ గోయింగ్ టుబీ వెరీ స్ట్రిక్ట్ ఎబౌట్ దట్.. అర్థమైందా? " అన్నాడు ప్రిన్స్‌పాల్, ల్యాబ్‌లో కూర్చొని ఎక్స్‌పెరిమెంట్స్ చేస్తున్న మిగతా స్టూడెంట్స్‌ని కూడా ఉద్దేశించి.

విద్యార్థులంతా నిశ్శబ్దంగా మారిపోయి ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

"మరో విషయం.. డెబ్భైఐదు శాతం అటెండెన్స్ లేకపోతే మీకు స్కాలర్‌షిప్స్ కూడా ఇవ్వను.. ఐ విల్ గో ఎకార్డింగ్ టు ది రూల్స్. నో కాంప్రమైజ్ ఆన్ దట్" అంటూ అక్కడ్నించి కదిలాడు.

ఆయన కొంచెం దూరం వెళ్ళగానే "వీడెవడోగానీ తిక్కలోడురా బాబోయ్.. వీడు అన్నంత పనిచేస్తే మనం చచ్చామే" అన్నాడో విద్యార్థి.

"వాడు అన్నంత పనిచేస్తే మనం ఊరుకుంటామా? మనకు స్కాలర్‌షిప్పులు ఇవ్వకపోయినా, అటెండెన్స్ లేదని ఎగ్జామ్స్‌కు పంపించకపోయినా వీడి అంతు చూస్తాం.. ఈ కాలేజిని ఒక్కరోజు కూడా నడవకుండా స్తంభింపజేద్దాం" అన్నాడు మరో స్టూడెంట్.

అతడో పెద్ద స్టూడెంట్ లీడర్. వాళ్ళలా మాట్లాడుకుంటుండగానే వాళ్ళ దగ్గరకు ఆ

కాలేజిలోనే చదువుకుంటున్న కొందరు విద్యార్థి నాయకులు వచ్చారు.

"మన కొత్త ప్రిన్స్‌పాల్ ఏదో మాట్లాడు తున్నట్టుంది" అన్నాడు శ్యామ్‌సుందర్ అనే విద్యార్థి నాయకుడు. శ్యామ్‌సుందర్‌కు ఆ కాలేజిలో చాలా పలుకుబడి ఉందని చెప్పు కుంటారు. ఆ నియోజకవర్గపు ఎం.ఎల్.ఎ., ఎం.పీ. - ఇద్దరితోనూ అతనికి చాలా మంచి సంబంధాలున్నాయి.

"చాలా చాలా అంటున్నాడు. డెబ్బైఐదు శాతం అటెండెన్స్ కంపల్సరీ అంటూ.. అంత అటెండెన్స్ లేకపోతే మనకు స్కాల ర్‌షిప్పులివ్వడట, ఎగ్జామ్స్‌కు పంపించ డట.. వాడి ధోరణి చూస్తోంటే అన్నంత పని చేసేస్తాడనిపిస్తోంది" అన్నాడు సురేష్ అనే విద్యార్థి.

"వాడి మొఖంలే.. వాడలా చేస్తే మేం ఊరుకుంటామనుకుంటున్నారా? వాడిని ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించమా" అన్నాడు మరో విద్యార్థి నాయకుడు అఖిల్. అతడికి ప్రతిపక్ష పార్టీలవాళ్ళతో మంచి సంబంధాలు ఉన్నా యంటారు.

"ఏది ఏమైనా ఈ తిక్కలోడితో చాలా సమస్యలొచ్చేట్టున్నాయి" అన్నాడు సురేష్.

"మీరేం వర్రీకాకండి. ఈ తిక్కలోడి తిక్కను మేం కుదిరిస్తాం" అన్నాడు శ్యామ్ సుందర్.

★ ★ ★

స్టాఫ్‌రూంలోకి వస్తూనే భుజంగరావు అటెండెన్స్ రిజిష్టర్‌ను సీటుముందున్న టేబుల్ మీదకు కసిగా విసిరికొట్టాడు.

"వీడెవడో జూలో ఉండాల్సినవాడిని ఈ కాలేజీకి ప్రిన్స్‌పాల్‌గా పంపించారు.." అన్నాడు భుజంగరావు.

"జూలో కూడా కాదండీ.. పిచ్చాసుప త్రిలో ఉండాల్సినవాడు అనండి. పిచ్చివాడి చేతికి రాయిచ్చినట్టుగా వీడికి ప్రిన్స్‌పాల్‌గా అధికారం ఇచ్చారు. ఇదివరకొకసారి నేను కూడా క్లాసుకు లేట్‌గా వెళ్ళినందుకు పిచ్చి పిచ్చిగా మాట్లాడాడు" అన్నాడు ఇంగ్లిష్ లెక్చరర్ సూర్యారావు.

"ఇంతకూ ఏమైంది? మీరు క్లాసుకు లేట్‌గా వెళ్ళారని రుసరుసలాడాడా?" అన్నాడు తెలుగు లెక్చరర్ కేశవరావు.

"రుసరుసలాడటమేమిటి? నా స్టూడెంట్స్ ముందు నా పరువు తీశాడు. ఘోరంగా అవమానించాడు. నేనసలు క్లాసులే తీసు కోనని ఆయనకు బోల్డు కంప్లెయింట్స్ వచ్చాయట.. 'యూ ఆర్ రెగ్యులర్లీ ఇర్రె గ్యులర్ అని తెలిసింది.. పోయిన ప్రిన్స్ పాల్ ఇవేవీ పట్టించుకోలేదని తెలిసింది. నా హయాంలో అలా జరగటానికి వీల్లే

**కొత్తగాలి...**

**ఎవరి 'కాలో'.. అమెరికాలో**
**చూడదిగో టీవీలో**
**డాలర్ కలలకి**
**రేడియో సంకెళ్లు**

- జి.వి.ఎస్. నాగేశ్వరరావు,
విశాఖపట్నం

దు. నేను చాలా స్ట్రిక్టు ఫెలో' అంటూ ప్రగ ల్భాలు పలికాడు" అన్నాడు భుజంగరావు.

"ఏదేమైనా ఆయన స్టూడెంట్స్ ముందే మీతో అలా మాట్లాడటం బాగాలేదు. కావాలంటే ఆయన మిమ్మల్ని తన ఛేంబ ర్‌కు పిలిపించుకొని కాస్త మర్యాదగా చెబితే బావుండేది" అన్నాడు ఇన్‌ఛార్జి ప్రి న్స్‌పాల్ సాంబశివరావు. ఆయనే ఆ కాలే జిలో లెక్చరర్లందరిలోకి సీనియర్ మోస్ట్. ఇప్పటి ప్రిన్స్‌పాల్ ఎప్పుడైనా లీవ్‌మీద వెళ్ళినప్పుడు ఆ కాలేజీని చూసుకుంటాడు.

"అవును సార్! వాడికి కనీస మ్యానర్స్

కూడా లేవు. మన స్టూడెంట్స్ ముందే మనల్నిలా అవమానిస్తే వాళ్ళకు మన మెంత చులకనైపోతాం? ఏమైనాసరే.. వాడి అంతు చూడాల్సిందే. రేపే నేను హైయర్ ఎడ్యుకేషన్ మినిష్టర్ దగ్గరకు వెళ్ళి వీడి సంగతంతా చెబుతాను" అన్నాడు సూర్యారావు.

"అప్పుడే అంత తొందరెందుకులే సూర్యారావు? మనం కూడా కొంచెం మారితే బావుంటుంది కదా.." అన్నాడు సాంబశివరావు.

"అంటే? " అన్నాడు భుజంగరావు.

"ఏం లేదు.. కాలేజికి కరెక్ట్ టైమ్‌కు రావడం, కరెక్ట్ టైమ్‌కు వెళ్ళి క్లాసులు తీసుకోవడం, వర్కింగ్ అవర్స్‌లో కాలేజి లోనే ఉండటం.. అటెండెన్స్ సరిగ్గా తీసుకోవడమేకాక ప్రతినెలా షార్టేజున్నవాళ్ళ లిస్టు తయారుచెయ్యడం.. షెడ్యూల్ ప్రకారం సిలబస్ కంప్లీట్ చెయ్యడం.. ఇవన్నీ మనం కరెక్టుగా చేస్తే మన ప్రిన్స్‌పాల్‌తో మాట పడాల్సిన పరిస్థితి రాదు కదా!" అన్నాడు సాంబశివరావు.

"అంటే.. అవన్నీ ఇప్పుడు మనం పాటించటం లేదనా మీరు చెప్పదల్చుకున్నది? " అన్నాడు భుజంగరావు.

"పాటిస్తే ఇవ్వాళ మీరు ప్రిన్స్‌పాల్‌తో అన్ని మాటలు పడేవారా? అవన్నీ మనం పాటించటం లేదని మన అంతరాత్మకు తెలుసు. మనం పెద్ద పెద్ద జీతాలు తీసుకుంటున్నాం. అలాంటప్పుడు మన విధుల్ని మనం సక్రమంగా నిర్వహించటం మన బాధ్యత" అన్నాడు సాంబశివరావు.

"ఎప్పుడో ఒకసారి ఐదు నిమిషాలు క్లాసుకు లేట్‌గా వెళ్ళినంత మాత్రాన మన విధుల్ని మనం సక్రమంగా నిర్వహించటం లేదని అర్థమా? " అన్నాడు భుజంగరావు.

"ఎప్పుడో ఒకసారేమిటి? మనం చాలా సార్లు అలాగే వెళ్తున్నాం. కాలేజికి లేట్‌గా రావడం, వర్కింగ్ అవర్స్‌లో కూడా బయటకు వెళ్ళిపోవడం.. ఇవన్నీ మనకు మామూలే కదా! ఇదివరకటి ప్రిన్స్‌పాల్ ఇవేవీ పట్టించుకునేవాడు కాదు, కాబట్టి మనమేం చేసినా చెల్లింది. ఇప్పుడీయన అన్నీ పట్టించుకుంటున్నారు కాబట్టి ఆయనతో మాటలు పడకుండా నడుచుకుంటే మంచిది" అన్నాడు సాంబశివరావు.

"మాటలంటే ఊరుకుంటామేమిటి? ఇంతకాలం ఒక సిస్టమ్‌కు అలవాటు పడ్డాం. ఇప్పుడు ఈయనగారొచ్చి సడెన్‌గా 'స్ట్రిక్టు స్ట్రిక్టు' అని కేకలు వేయగానే మారటం సాధ్యమా? అసలు ఈ దేశంలో ఏది స్ట్రిక్టుగా రూల్స్ ప్రకారం జరుగుతున్నదని? ఈ కాలేజిలో అన్నీ స్ట్రిక్టుగా రూల్స్ ప్రకారం జరుగుతాయనుకుంటున్నాడా ఈయన? ఒక్క కాలేజీని మార్చినంత మాత్రాన దేశమంతా మారిపోతుందా? ఈ దేశంలో ఏదీ సరిగ్గా జరగదని అందరికీ . తెలుసు. ఓ అవ్యవస్థలో మనమున్నాం. మన దేశంలాగే మన కాలేజుంది కాబట్టి ఎవరైనా సరే, పరిస్థితుల్ని బట్టి మసలుకోవాలి. ఓ కాలేజీకి ప్రిన్స్‌పాలయినంత మాత్రాన ఏ హిట్లర్‌నో స్టాలిన్నో అనుకుంటే ఎలా? ఈ దేశంలో డిక్టేటర్‌షిప్ పనికిరాదు. నెమ్మదిగా, మర్యాదగా చెప్పి పని చేయించుకోవాలి.. మీరు ఇన్‌ఛార్జి ప్రిన్స్‌పాల్ కాబట్టి మీరే ఆయనకీ విషయాలు చెప్పాలి. మార్పు సడెన్‌గా కళ్ళు మూసి తెరిచేంతలో రాదు.. మంచిమాటలతో నెమ్మదిగా చెప్పి, అందరి అభిమానాన్ని పొంది, పనులు చేయించుకోండని చెప్పండి. దురుసుగా మాట్లాడి ఈ క్షణంలో మారాలంటే అది సాధ్యమయ్యే పనికాదని చెప్పండి.. హీ సీమ్స్ టు బి ఇన్ ఏ గ్రేట్ హర్రీ.." అన్నాడు సూర్యారావు.

"ఇదివరకటి ప్రిన్స్‌పాల్ ఎప్పుడూ ఒక

మాట అంటుండేవాడు- పనిచేసేవాళ్లు చేస్తారు. చెయ్యనివాళ్ళు చెయ్యరు. ప్రిన్స్‌పాల్ ఎంత మొత్తుకున్నా కొందరు పని దొంగలతో పని చేయించలేడు. అందుకే నేను పనిదొంగల జోలికి వెళ్ళను. పని చేసే వాళ్ళతోటే పని చేయించుకుంటాను- అనేవాడు" అన్నాడు భుజంగరావు.

"నిజమే.. అందుకే అతడెప్పుడూ మీ జోలికొచ్చేవాడు కాదు కదా!' అన్నాడు సాంబశివరావు.

స్టాఫ్‌రూంలో ఉన్న లెక్చరర్లందరూ నవ్వారు.

"నేను పనిదొంగనంటారు. అంతేనా? " అన్నాడు భుజంగరావు.

"జోక్ చేశాను. సీరియస్‌గా తీసుకోకండి" అన్నాడు సాంబశివరావు.

"ఈయన ధోరణి చూస్తోంటే ఒకరు చెబితే వినేవాడిలా కనిపించటంలేదు" అన్నాడు సాంబశివరావు, సూర్యారావుతో.

"చెప్పటం వరకు మీ బాధ్యత.. వింటే ఆయనకూ, మనకూ మంచిది. ఇదివరకటి ప్రిన్స్‌పాల్ లాగా మరీ పట్టనట్టుగానూ ఉండొద్దు.. సడెన్‌గా మరీ ఇంత స్ట్రిక్టుగానూ ఉండొద్దు. మిడిల్ పాత్ అంటారు చూడండి! మధ్యేమార్గం.. మధ్యే మార్గం అనుసరిస్తే మంచిదని చెప్పండి.. వింటే విన్నాడు.. లేకపోతే అనుభవిస్తాడు" అన్నాడు సూర్యారావు.

వాళ్ళు అలా మాట్లాడుకుంటుండగానే అటెండర్ హుస్సేన్ ఓ రిజిష్టర్ పట్టుకొని స్టాఫ్‌రూంలోకి ప్రవేశించాడు.

"సార్! భుజంగరావు సార్‌కీ కవరిచ్చి రమ్మన్నారు ప్రిన్స్‌పాల్ గారు" అన్నాడు హుస్సేన్.

"అదిగో.. శ్రీముఖం రానే వచ్చింది" అన్నాడు సూర్యారావు.

"నాకా.. ఏమిటా కవరు? " అన్నాడు భుజంగరావు కొంచెం కంగారుగా.

"మెమో అయ్యుంటుంది. తీసుకోండి"

## నవల పేరే ఇంటిపేరు



అంపశయ్య నవీన్

వరంగల్ జిల్లాలోని పాలకుర్తి మండలం, వావిలాల గ్రామంలో 1941లో నవీన్ జన్మించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్రంలో ఎం.ఎ. చేశారు. ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో ముప్పైమూడేళ్లు అర్థశాస్త్రోపన్యాసకునిగా, తర్వాత ప్రిన్స్‌పాల్‌గా పనిచేసి 1996లో పదవీ విరమణ చేశారు. వీరి మొదటి నవల 'అంపశయ్య' 1969లో ప్రచురితమై, ఇప్పటి వరకు పది ముద్రణలు పొందింది. ఈ నవల పేరే ఆయనకు ఇంటి పేరుగా మారడం విశేషం. ఇప్పటి వరకూ ఆయన ముప్పై నవలల్ని, దాదాపు తొంభై కథల్ని రచించారు. వీరి రచనలు అనేకం ఇతర భాషల్లోకి అనువాదమయ్యాయి. వీరి 'కాలరేఖలు' నవలకు 2004లో కేంద్ర సాహిత్య అకాడమి ఉత్తమ నవల పురస్కారం లభించింది. ఇంకా గోపిచంద్ జాతీయ పురస్కారం, కాకతీయ విశ్వవిద్యాలయం నుండి గౌరవ డాక్టరేట్ తదితర ఎన్నో అవార్డులు అందుకున్నారు. 'అవాస్తవికుడు' వీరి తాజా నవల.

చిరునామా :

అంపశయ్య నవీన్,
ఇంటి నెం. 2-7-71,
ఎక్సైజ్ కాలనీ, సుబేదారి,
హన్మకొండ, వరంగల్-506001

అన్నాడు సూర్యారావు.

"తీసుకోకపోతే..?" అన్నాడు భుజంగరావు.

"తీసుకుంటేనే మంచిది. తీసుకోకపోతే బాస్ ఆజ్ఞను ధిక్కరించినట్టౌతుంది. క్లాసుకు లేట్‌గా వచ్చినందుకు క్రమశిక్షణ చర్య ఎందుకు తీసుకోకూడదని ఇచ్చి ఉంటాడు. దాన్ని తీసుకుని ఏదో కారణం చెబుతూ సమాధానం ఇవ్వండి.. సరిపోతుంది" అన్నాడు సాంబశివరావు.

"అంతేనంటారా?" అన్నాడు భుజంగరావు సూర్యారావుకేసి చూసి.

**కొత్తగాలి...**

**పుట్టినరోజు వచ్చిందని**
**మురిసిపోతున్నావు**
**మృత్యువుకు చేరువవుతున్నావని**
**మరచిపోతున్నావు**

– పిరాట్ల సుబ్బలక్ష్మి,
బెంగళూరు

"అంతే అయ్యుంటుంది. ఇంకేమన్నా ఉంటే చూసుకుందాం. ఈ మెమోతోటి ఏమౌతుంది? వచ్చి నాల్గు రోజులైందో లేదో మెమోలివ్వడం మొదలెట్టాడన్న మాట. మీరైతే ఆ కవరు తీసుకోండి" అన్నాడు సూర్యారావు.

భుజంగరావు ఆ కవరు తనకు ముట్టినట్టుగా ఇన్‌వర్డ్ రిజిష్టర్‌లో సంతకం చేసి, దాన్ని తీసుకున్నాడు.

హుస్సేన్ రిజిష్టర్ తీసుకుని వెళ్ళిపోయాడు.

భుజంగరావు కవరు చించి లెటర్‌ను బయటకు తీసి చకచకా చదివేశాడు.

"చూశారా.. చూశారా.. ఎన్ని మాటలన్నాడో చూశారా? డీరిలెక్షన్ ఆఫ్ డ్యూటీ అనీ, ఇన్‌సబార్డినేషన్ అనీ, ఇర్రెస్పాన్సిబుల్ అనీ.. ఎన్ని చార్జెస్.. వారం రోజుల్లోగా ఎక్స్‌ప్లనేషన్ ఇవ్వాలట. నా ఎక్స్‌ప్లనేషన్ సంతృప్తికరంగా లేకపోతే క్రమశికణ చర్య తీసుకోవాలని పై అథారిటీస్‌కు రాస్తాడట.. ఏ ఆదిలాబాద్‌కో ట్రాన్స్‌ఫర్ చేయిస్తాడేమో?"

భుజంగరావుకు లోపల వణుకు ప్రారంభమయ్యింది. అతని శరీరమంతా చమటతో నిండిపోయింది.

"ఆ మెమోనిటివ్వండి" అన్నాడు సూర్యారావు.

భుజంగరావు వణుకుతున్న చేతులతో ఆ లెటర్ని సూర్యారావు చేతికిచ్చాడు.

సూర్యారావు ఆ లెటర్ని చదివేసి, "తన కొచ్చిన ఇంగ్లిషు పాండిత్యాన్నంతా ఈ లెటర్లో నింపేశాడు. ఈయనగారు తననొక గొప్ప మేధావినని చెప్పుకుంటాడు. ఈయనను, మన కమిషనర్‌గార్ని ఒకప్పుడు ఇంటలెక్చువల్ ట్విన్స్ అనేవాళ్లట. వెరీ ఆరొగాంట్ ఫెలో! అయినా మీరేమీ కంగారు పడకండి. దీనికి దీటైన సమాధానం రాద్దాం.." అన్నాడు సూర్యారావు.

"ఆ సమాధానం మీరే రాయాలి సూర్యారావుగారూ!" అన్నాడు భుజంగరావు.

"మీరు నిశ్చింతగా ఉండండి.. నేనే రాస్తాను. మన సమాధానం చదివాక మన యముడి బుర్ర గిర్రున తిరిగిపోవాలి" అన్నాడు సూర్యారావు.

ఈలోగా ఆ లెటర్ని సాంబశివరావు కూడా చదివేశాడు.

"అతడు తన పాండిత్యాన్నంతా నింపినట్టుగా మీరూ మీ పాండిత్యాన్నంతా నింపేయండి" అన్నాడు సాంబశివరావు.

"అవును.. చూపిస్తా.. నా పాండిత్యం చూసి అతడు దంగైపోవాలి. నేను వాడిన కొన్ని పదాల అర్థాలకోసం డిక్షనరీ చూసుకోవాలి.." అన్నాడు సూర్యారావు.

"అవును మరి. సూర్యారావా మజాకా!" అన్నాడు అంతసేపు నిశ్శబ్దంగా వున్న ముకుందరెడ్డి, మ్యాథమాటిక్స్ లెక్చరర్.

"మరీ దూకుడుగా రాయకండి. సమస్య లొస్తాయి. దాన్నాయన కమిషనర్‌కు పంపించినా పంపిస్తాడు" అన్నాడు సాంబ శివరావు.

"పంపించుకోనీయండి. ఈ సూర్యారావును ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు. అవసరమనుకుంటే నేను చీఫ్ మినిస్టర్ దగ్గరకు కూడా వెళ్ళగలను" అన్నాడు సూర్యారావు.

"మిమ్మల్నేమీ చెయ్యడు.. మీరు రాసేది భుజంగరావు పేరుమీద కదా! ఏమన్నా చేస్తే భుజంగరావును చేస్తాడు" అన్నాడు సాంబశివరావు.

"అందరూ కలిసి నన్ను ట్రాన్స్‌ఫర్ మాత్రం చేయించొద్దు. నేను ఈ ఊరు విడిచిపెట్టి మరోచోటికి వెళ్ళే పరిస్థితి లేదు" అన్నాడు భుజంగరావు.

"అవును.. మీరీ ఊర్నించి వెళ్ళిపోతే ఆ క్లబ్బేమయిపోవాలి? పేకాటేమయిపోవాలి? " అన్నాడు వీరాస్వామి.

అందరూ నవ్వారు.

"నేనుండగా మిమ్మల్ని ఎవరూ ఏమీ చెయ్యలేరు. పూర్వం పాండవులకు శ్రీకృష్ణుడెలాగో నేను మీకు అలాగనుకోండి.. ఈ సూర్యారావు విశ్వరూపాన్ని మీరింకా చూళ్ళేదు. కింది నుండి మీదివరకు నాకు తెలీని, నా మాట వినని ఆఫీసర్‌గానీ, నాయకులుగానీ ఎవ్వరూ లేరు" అన్నాడు సూర్యారావు.

"అయినా మీకు ట్రాన్స్‌ఫర్ అంటే అంత భయమెందుకండీ? గవర్నమెంట్ సర్వీసులో ఉన్నప్పుడు ట్రాన్స్‌ఫర్ అనేది చాలా మామూలు విషయం. పుట్టినవాడు గిట్టడం ఎంత అనివార్యమో గవర్నమెంట్ సర్వీసులో ట్రాన్స్‌ఫర్ అంత అనివార్యం" అన్నాడు ముకుందరెడ్డి.

"ఆ వేదాంతమంతా నాకు చెప్పకండి.. నేనీ ఊరు విడిచి వెళ్ళలేను.. అంతే!" అన్నాడు భుజంగరావు.

"ఎందుకు వెళ్ళలేరు? ఈ ఊర్లో మీకేమైనా వ్యాపారాలున్నాయా? " అన్నాడు ముకుందరెడ్డి.

"వ్యాపారాలు కావులెండి.. ఆయనకు ఈ ఊర్లో ఉన్న ఆఫీసర్స్ క్లబ్‌తో చాలా గాఢమైన అనుబంధం ఉంది. రోజూ క్లబ్‌కెళ్ళి అర్ధరాత్రిదాకా కార్డ్సు ఆడి ఓ ఐదారు వందలు సంపాదించటమో లేక పోగొట్టుకోవడమో చెయ్యకపోతే ఆయనకు తోచదు" అన్నాడు వీరాస్వామి.

"అదా కారణం? " ఆశ్చర్యంగా అన్నాడు

## కొత్తగాలి...

**నగరంలో**
**కాకులు కనబడవు**
**పలుగాకుల అరుపులకు**
**భయపడ్డాయేమో!!**

– శైలజామిత్ర, హైదరాబాద్

ముకుందరెడ్డి.

"అదే కారణం.. ఆయనకు క్లబ్ ప్రైమరీ.. కాలేజి సెకండరీ.." అన్నాడు వీరాస్వామి.

"మీరు మరీ ఎగ్జాగరేట్ చేస్తున్నారు సార్! నాకిప్పుడో క్లాసుంది.. వెళ్తొస్తాను. ఈ మెమోకు జవాబెలా రాయాలో ఆలోచించండి సూర్యారావుగారు" అంటూ భుజంగరావు ప్రిన్సిపాలిచ్చిన మెమోను సూర్యారావుకిచ్చి అటెండెన్స్ రిజిష్టర్ పట్టుకొని స్టాఫ్ రూంలోంచి బయటకెళ్ళాడు.

"ఈయన ఈ ఊర్లోనే ఉండిపోతాననటానికి మరో కారణం తెలుసా ముకుందరెడ్డి



గారూ? " అన్నాడు సూర్యారావు.

"నాకెలా తెలుస్తుంది? నేనీ కాలేజికొచ్చి రెణ్నెల్లు కూడా కాలేదు కదా!" అన్నాడు ముకుందరెడ్డి.

"ఈయనకు ఈ ఊరినిండా అప్పులే.. రోజూ కార్డ్స్ ఆడి వేలకువేలు పోగొట్టుకుంటాడు. ఎప్పుడూ పోవడమేగానీ రావడం అంటూ ఉండదు. పోగొట్టుకున్నదంతా సంపాదించుకునే దాకా కార్డ్స్ ఆడటం మానుకోనని ప్రతిజ్ఞ చేశాడట.. వచ్చిన జీతాన్నంతా పేకాటమీదనే తగలేస్తాడు.. ఈయనగారి లైఫ్‌స్టైలేమో చాలా ఆర్భాటంగా ఉంటుంది. చాలా హైక్లాసు విస్కీలు, సిగరెట్లు, డ్రెస్సులు, కార్లు తప్ప లోక్లాసువి పనికిరావు. అందరి దగ్గరా అప్పులే.. బార్లలో, క్లాత్ షాప్స్‌లో, జువెలరీ షాప్స్‌లో. ఈయనగారి లైఫ్‌స్టైల్ చూసి ఈయనకందరూ అప్పులిచ్చి ఈయనింటి చుట్టూ తిరుగుతుంటారు. ఇంకా ఈయనగారి శృంగార లీలలు కూడా చాలా ఉన్నాయి" అంటూ ఇంకా ఏదో చెప్పబోతున్న సూర్యారావుకు సాంబశివరావు అడ్డుపడ్డాడు.

"అతని పర్సనల్ లైఫ్ గురించి మనకెందుకులెండి? ఎంతచెడ్డా అతడు మన కొలీగ్ కదా? " అన్నాడు సాంబశివరావు.



"అందుకే కదా.. అతని పర్సనల్ లైఫ్ ఎంత చెత్తగా ఉన్నా అతనికి చాలాసార్లు.. ముఖ్యంగా సర్వీసు మ్యాటర్స్‌లో నేను సహాయం చేస్తున్నాను.." అన్నాడు సూర్యారావు.

"మనం అధ్యాపకవృత్తిలో ఉన్నాం కాబట్టి మన పర్సనల్ లైఫ్ కూడా చాలా ముఖ్యమేనండి.. మనల్ని మన విద్యార్థులు కాలేజిలోనే కాదు.. బయటకూడా గమనిస్తుంటారు.. మీరన్నట్టు మన పర్సనల్ లైఫ్ చెత్తగా ఉంటే వాళ్ళు 'వీడేం లెక్చరర్.. వీడు మనకేం పాఠాలు చెబుతాడు' అంటారు. ఈ ప్రొఫెషన్లో ఉన్నవాళ్ళు ఎంతో కొంత ఆదర్శప్రాయంగా ఉండటానికి ప్రయత్నించాలనుకుంటాను" అన్నాడు ముకుందరెడ్డి.

"అది నిజమే అనుకోండి. కానీ ఆదర్శంగా ఉండాలనే నీతి ఇప్పటివాళ్ళల్లో ఎక్కడుంది? అందరికీ చాలా విలాసవంతమైన లైఫ్‌స్టైల్ కావాలి. చాలా వేగంగా డబ్బు సంపాదించాలన్నదే లక్ష్యంగా ఉంటున్నది తప్ప, వేరే విలువల్ని పట్టించుకోవడం లేదు" అన్నాడు సాంబశివరావు.

"మన ఈ కొత్త ప్రిన్స్‌పాల్ మరీ చెడ్డవాడేం కాదనిపిస్తోంది. కాలేజీని కాస్త ఆర్డర్‌లో పెడదామనుకుంటున్నాడు. తప్పేముంది? " అన్నాడు ముకుందరెడ్డి.

"తప్పేంలేదు.. మరీ వేగంగా వెళ్తున్నాడు. ఇంతకాలం ఒక సిస్టమ్‌కు.. మరీ లూజ్ సిస్టమ్‌కు అలవాటుపడ్డవాళ్ళు సడెన్‌గా స్ట్రిక్టు సిస్టమ్‌కు మారమంటే మారరు. ఆయన కాస్త నెమ్మది నెమ్మదిగా సిస్టమ్‌ను మార్చటానికి ప్రయత్నిస్తే బావుండునని నా అభిప్రాయం" అన్నాడు సాంబశివరావు.

"నెమ్మది నెమ్మదిగా మార్చటానికి ప్రయత్నిస్తే మాత్రం వీళ్లు మార్తారా? " అన్నాడు ముకుందరెడ్డి.

"మారరు.. ఎలా అయినా మారరు. ఇప్పటి మన కాలేజి పరిస్థితేమిటో నన్ను చెప్పమంటారా? స్టూడెంట్స్‌కు క్లాసుల్లో కూర్చోవాలని లేదు. లెక్చరర్లకు పాఠాలు చెప్పాలని లేదు. స్కాలర్‌షిప్పుల కోసం విద్యార్థులు కాలేజిల్లో చేరుతున్నారు... జీతాలకోసం మనం కాలేజికొచ్చి స్టాఫ్ అటెండెన్స్ రిజిష్టర్లో సంతకాలు పెట్టేసి చదువు చెప్పటం ఒక్కటి తప్ప, వేరే వ్యాపకాలు చాలా చేస్తున్నాం.. ఇదింతే.. దీన్ని ఇప్పుడొచ్చిన ప్రిన్స్‌పాలే కాదు.. ఆయన జేజమ్మ కూడా మార్చలేడు. ఆయన కూడా కొన్ని ఫైళ్ళమీద సంతకాలు

పెట్టేసి తన జీతం తను తీసుకుంటే హాయిగా ఉంటారు.. మనమూ హాయిగా ఉంటాం" అన్నాడు సూర్యారావు.

"మేబీ యూఆర్ రైట్. మన దేశ పరిస్థితులలాగే ఉన్నాయి" అన్నాడు సాంబశివరావు.

"మరి ఇంత ఉత్సాహంగా ఈ పరిస్థితుల్ని మార్చాలని ప్రయత్నిస్తున్న ఈ ప్రిన్స్‌పాల్ ప్రయత్నం ఏమౌతుందంటారు? " అన్నాడు ముకుందరెడ్డి.

"చూద్దాం.. ఏమౌతుందో? " అన్నాడు సాంబశివరావు.

"ఏమీకాదు.. అతన్నే ఇక్కడ్నించి పంపించేస్తారు" అన్నాడు సూర్యారావు.




ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు కాలేజి నుండి ఇంటికి రాగానే "లక్ష్మి" అంటూ అరిచాడు.

ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. అతని పిలుపు విని లక్ష్మి వెంటనే రాలేదు. ఆమె దృష్టంతా ఓ టీవీ ఛానెల్లో ప్రసారమౌతున్న సీరియల్ మీదే ఉంది. ఆమెకతని పిలుపు వినిపించినా చాలా రసవత్తరంగా, ఉత్కంఠభరితంగా ఉన్న ఆ సీరియల్‌ను వదిలేసి రాబుద్ధి కాలేదు.

"లక్ష్మి" అంటూ లివింగ్‌రూమంతా దద్దరిల్లిపోయేలా రెండోసారి అరిచాడు.

ఈసారి ఆమెలో చిన్న కదలిక కల్గింది.

"అబ్బబ్బా! వస్తున్నానండి.. ఒక్క నిమిషం ఓపిక పట్టలేరా? " అంటూ ఆమె అయిష్టంగా టీవీ ముందు నుండి కదిలి, అతడు కూర్చున్న రూంలోకి ప్రవేశించింది.

"ఏం కావాలి మీకు? ఎందుకంతలా అరుస్తున్నారు? " అంది లక్ష్మి.

"ఎప్పుడూ ఆ పాడు సీరియల్స్ గొడవేనా? రోజంతా కాలేజి గొడవలతో సతమతమైపోయి వచ్చిన భర్తను పట్టించుకోవా? వాడి మొహాన ఓ కప్పెడు కాఫీనీళ్ళైనా పోయవా? " అన్నాడతడు చాలా అసహనంగా.

"మొహం మీద వేడివేడి కాఫీనీళ్ళు పోస్తే మొఖమంతా కాలిపోతుంది. నాకా మాత్రం తెలీదనుకున్నారా? అందుకే కాఫీ నీళ్ళను మొహం మీద పోయలేదు" అందామె గొప్పజోక్ చేసినట్టుగా నవ్వుతూ.

"నీ జోక్ ఏడ్చినట్టుంది"

"జోకేమిటి? బతుకే ఏడ్చినట్టుంది" ఆమె మొఖం మీది నవ్వు మాయమైపోయి అసహనం చోటుచేసుకుంది.

"ఏమైంది నీ బతుక్కిప్పుడు? "

"అనుక్షణం ఇలా కేకలేసే భర్త ఉన్నాక ఇంకేం కావాలి? మీరిప్పుడేగా వచ్చింది.. అప్పుడే కాఫీనీళ్ళెప్పుడియ్యకపోయాను? "

"కాఫీనీళ్ళివ్వకపోతే మానె.. కనీసం మంచినీళ్ళైనా ఇచ్చావా? "

"ఆ ఫ్రిజ్ లో మంచినీళ్ళున్నాయని తెలీదా మీకు.. తీసుకొని తాగొచ్చుగా"

"నన్ను మంచినీళ్ళు తీసుకొని తాగమంటావా? నేనంటే నీకంత చులకనా? నేనెవరనుకుంటున్నావు? "

"తెలుసు.. ఓ పెద్ద డిగ్రీ అండ్ పీజీ కాలేజికి ప్రిన్స్‌పాలని.. మీ కింద యాభైమంది లెక్చరర్లు, పది మంది నాన్‌టీచింగ్‌స్టాఫ్, పన్నెండుమంది అటెండర్లు పనిచేస్తున్నారనీ తెలుసు. వెయ్యిమంది

స్టూడెంట్స్ కూడా మీ కాలేజీలో చదువుకుంటున్నారనీ తెలుసు"

"అవును.. అవును.. అట్లాంటి నాకు కనీసం మంచినీళ్ళు కూడా తెచ్చివ్వవా? నన్నే తీసుకొమ్మంటావా? "

"సారీ ప్రిన్స్‌పాల్‌గారూ.. తప్పయింది.. ఇదిగోండి చల్లటి మంచినీళ్ళు.. ఇవి తాగేసి కాస్త కూలవండి" అందామె ఫ్రిజ్ తెరచి అతనికి మంచినీళ్ళు తెచ్చిస్తూ.

అతడు ఒక్క గుక్కలో మంచినీళ్ళు తాగేశాడు.

"అంత పెద్దకాలేజిని మేనేజ్ చెయ్యటం అంటే ఏమిటనుకున్నావు? అనుక్షణం ఏదో ఒక టెన్షన్. ఎవ్వరూ సరిగ్గా పనిచెయ్యరు. అందరూ పనిదొంగలే. వేలకువేల జీతాలు తీసుకోవడమేగానీ పనిచెయ్యమంటే మాత్రం చెయ్యరు. ప్రభుత్వం సొమ్ము పుణ్యానికి తినేస్తున్నారు. క్లాసుకెళ్ళి పాఠం చెప్పండిరా అంటే లెక్చరర్లు పాఠాలు చెప్పరు.. క్లాసుల్లో కూర్చోండిరా అంటే స్టూడెంట్స్ క్లాసుల్లో కూర్చోరు. నాకన్నా ముందు ఇక్కడ పనిచేసిన ప్రిన్స్‌పాల్ చవట. దేన్నీ పట్టించుకోకుండా కాలేజిని భ్రష్టుపట్టించాడు. పూర్తిగా చెడిపోయిన ఆ ఇన్‌స్టిట్యూషన్‌ను బాగుచెయ్యాలని నేను ప్రయత్నిస్తున్నాను. వెధవలకు పనిచెయ్యండిరా అంటే కోపం" అతడు తనలోతను మాట్లాడుకుంటున్నట్టుగా మాట్లాడుకోసాగాడు. ఆమె ఇంకా అక్కడే ఉందనుకొని మాట్లాడుతున్నాడు. ఆమె వంటగదిలోకెళ్ళి కాఫీ కప్పుతో అతని దగ్గరికొచ్చింది.

"కాఫీ! తీసుకోండి.." అంది.

"నువ్వు కిచెన్‌లోకెళ్లావా? ఇక్కడే ఉన్నావనుకొని నేనేదో మాట్లాడేస్తున్నాను"

"నేను వింటూనే ఉన్నాను. కొత్తగా చెప్పిందేముంది? ఈ ఊరొచ్చి ఈ కాలేజిలో చేరినప్పట్నించి రోజూ ఇదే చెబుతున్నారుగా.. చెడిపోయిన కాలేజిని బాగుచెయ్యాలని కంకణం కట్టుకున్నారు. మీ దృష్టిలో ఈ దేశంలో చెడిపోనిదంటూ ఏదన్నా ఉందా? కాలేజీలు చెడిపోయాయి.. రాజకీయాలు చెడిపోయాయి.. ఉద్యమాలు చెడిపోయాయి.. సమాజం చెడిపోయింది.. వివాహ వ్యవస్థ చెడిపోయింది.. విడాకులెక్కువైపోయాయి.. విలువలు పతనమైపోయాయి.. ఇంట్లో ఉండాల్సిన ఆడవాళ్ళు బయటకొచ్చి చెడిపోయారు.. ఆడవాళ్ళను దిగంబరంగా చూపిస్తున్న సినిమాలు చెడిపోయాయి.. అంతం అంటూ లేకుండా వేలవేల ఎపిసోడ్లకు పెరిగిపోతున్న టీవీ సీరియల్స్ చెడిపోయాయి.. తల్లిదండ్రులంటే గౌరవ లేకుండా ఈనాటి యువతీయువకులు ప్రేమోన్మాదులుగా మారిపోయి చెడిపోతున్నారు.. భర్తల మాటలు వినకుండా టీవీ సీరియల్స్‌కు అంకితమైపోయి భార్యలు చెడిపోతున్నారు.. లక్షలకు లక్షల డొనేషన్స్ వసూలు చేసి ఎందుకూ పనికిరాని వాళ్లకు మెడిసిన్‌లోనూ, ఇంజినీరింగ్‌లోనూ సీట్లిస్తున్న కార్పొరేట్ కాలేజీలు ఈ దేశంలో ఉన్నత విద్యను చెడగొట్టాయి. అసలు మీ దృష్టిలో ఈ ఇరవై ఒకటో శతాబ్దంలో చెడిపోనిదంటూ ఏదన్నా ఉందా? మీకేగనుక ఏ హిట్లర్‌కో, స్టాలిన్‌కో ఉన్నంత అధికారం ఉంటే ఈ దేశాన్ని, ఈ సమాజాన్ని సమూలంగా మార్చేసి ఓ ఆదర్శ సమాజంగా మార్చేసేవారు.." అందామె.

అలా అంటూనే మళ్ళీ వెళ్ళి టీవీ ముందు కూర్చుంది.

ఆమె మాటల్లో ధ్వనించిన వ్యంగ్యం అతన్ని ఆశ్చర్యపరచలేదు. ఆరునెలల క్రితం రెండు లక్షల డొనేషన్ చెల్లించి కార్పొరేట్ కాలేజీలో మెడిసిన్ చదివించనని తను నిష్కర్షగా చెప్పినప్పుడు తమ

ఏకైక పుత్రుడు వినోద్ అలిగి, ఇల్లు విడిచి వెళ్ళిపోయాడు. వాడి ఆచూకి ఇంతవరకూ తెలియలేదు. వినోద్ ఇంట్లోంచి వెళ్ళిపోయినప్పట్నించి లక్ష్మి తనమీద పగబట్టింది. ప్రతి తల్లిలాగే లక్ష్మికి కూడా కొడుకంటే పిచ్చిప్రేమ.

వినోద్ చదువులో పెద్ద తెలివైనవాడు కాడు. మెడిసిన్ చదివే తెలివితేటలు వాడికి లేవని తనకు తెలుసు. అలాంటివాడిని డబ్బుతో సీటుకొని మెడిసిన్ చదివిస్తే సమాజానికి హానిచేసిన వాడినౌతానని ఫీలయ్యాడు. వాడు మెరిట్‌తో సీటు తెచ్చుకోవాలే తప్ప తండ్రి సంపాదించిన డబ్బుతో సీటు కొనుక్కొని చదకూడదని భావించాడు. అందుకే 'ఎంసెట్ టెస్ట్‌రాసి సీటు తెచ్చుకో.. లేకపోతే మామూలుగా బీఎస్సీ చదువు' అని అన్నాడు.

వినోద్‌కు ఎంసెట్‌లో చాలా తక్కువ మార్కులు వచ్చాయి. అటాంటివాడిని మెడిసిన్ చదివించటమేమిటి?

"నా క్లాస్‌మేట్స్ అందరూ మెడిసిన్‌లో చేరారు. నేనూ చేర్తాను.. డొనేషన్ కట్టండి. ఏ కార్పొరేట్ కాలేజిలో అయినా సీటు దొరుకుతుంది" అన్నాడు వాడు.

"నథింగ్ డూయింగ్" అన్నాడు తను.

డొనేషన్ కట్టి చదివించటం తన ప్రిన్సిపుల్స్‌కు విరుద్ధం అన్నాడు.

లక్ష్మి తనతో ఓ వారం రోజులు రాత్రింబవళ్ళు 'వాడికోసం మీ ప్రిన్స్‌పుల్స్‌ని పక్కనబెట్టి డొనేషన్ కట్టండి' అని పోరాడింది.

తను డొనేషన్ కట్టేదిలేదు, తన దగ్గర అంత డబ్బులేదని, అప్పులు చెయ్యడం కూడా తన ప్రిన్సిపుల్స్‌కి వ్యతిరేకమని చెప్పేశాడు.

"కన్నకొడుకు కోసం ఈ మాత్రం చెయ్యలేరా? ఎంతోమంది తమ కొడుకుల కోసం డొనేషన్స్ కడ్తున్నారు.. మీదింత రాతి గుండె అని ఇంతకాలం తెలుసుకోలేకపోయాను" అంది.

ఉరేసుకొని చచ్చిపోతానంది. అయినా తను చలించలేదు. తమ బంధువులతో చెప్పించింది. స్నేహితులతో చెప్పించింది. అయినా తను మారలేదు.

తను మారనని రూఢి కావడంతో ఒక రోజు అకస్మాత్తుగా వినోద్ ఇంట్లోంచి వెళ్ళిపోయాడు. 'తనెక్కడికో తనకే తెలియని చోటికి వెళ్ళిపోతున్నాను. తనకోసం ఎక్కడా వెతకవద్దు' అని చిన్న నోట్ రాసి పెట్టి వినోద్ ఇంట్లోంచి వెళ్ళిపోయాడు.

లక్ష్మి నెత్తీనోరు బాదుకుంది.

వినోద్ ఫ్రెండ్స్ ఎక్కడెక్కడుంటే అక్కడికి వెళ్ళి వెతికారు. బంధువుల దగ్గరకు వెళ్ళారు. చివరకు పోలీసు రిపోర్టు కూడా ఇచ్చారు. పేపర్లో కూడా ప్రకటన ఇచ్చారు.

'నువ్వు కోరుకున్నట్లే డొనేషన్ కట్టి నిన్ను మెడిసిన్ చదివిస్తామనీ, ఎక్కడున్నా వెంటనే ఇంటికొచ్చెయ్యమని ప్రకటన ఇవ్వండి' అని లక్ష్మి తన కాళ్ళు పట్టుకుంది. తను అలాంటి ప్రకటన ఇవ్వనన్నాడు. నాల్గు రోజులు పోతే వాడే వస్తాడని చెప్పాడు. వాడు చాలా సుఖవంతమైన జీవితానికి అలవాటు పడ్డాడనీ, మనింట్లో తప్ప వేరే ఎక్కడా వాడు ఎక్కువ రోజులు ఉండలేడని, అసలు వాడెక్కడికీ వెళ్ళలేదని, ఇదంతా తల్లీ కొడుకులు కలిసి ఆడుతున్న నాటకమని కూడా అన్నాడు.

మేం ఇలాంటి నాటకమాడటంలేదని, వాడెక్కడున్నాడో తనకు తెలియదని లక్ష్మి ఎన్నో ప్రమాణాలు చేసింది. అయినా తను నమ్మలేదు. ఇది జరిగినప్పట్నించి లక్ష్మి తనతో చాలా ముభావంగా ఉంటోంది. ఎప్పుడు మాట్లాడినా చాలా వ్యంగ్యంగా మాట్లాడడం, ఎత్తిపొడుపు మాటలనడం ప్రారంభించింది. ఇదివరకు లక్ష్మి ఇలా ఉండేది కాదు. తనంటే బోల్డు ప్రేమా, గౌరవం చూపించేది.

అతడు కాఫీ తాగేసి టీపాయ్ మీదున్న పేపర్ చేతిలోకి తీసుకొని హెడ్‌లైన్స్ చూడసాగాడు. కాస్సేపట్లోనే అది నిన్నటి పేపరని అర్థమైంది.

అతడు వెంటనే 'లక్ష్మీ' అని కేకేశాడు.

ఇతనికి మళ్ళీ ఏమొచ్చిందో అనుకుంటూ టీవీ ముందు నుంచి అసహనంగా లేచొచ్చి, "ఎందుకలా గావుకేకలు పెడ్తారు? ఏం కావాలి మీకు?" అందామె విసురుగా, అతడున్న గదిలోకొచ్చి.

"గావుకేకలు పెట్టకపోతే ఆ టీవీ చప్పుడుకు నీకు వినబడి చావదుగా. టీపాయ్ మీద ఇవ్వాల్టి పేపర్ లేదేమిటి? ఈ ఇంట్లో ఏదీ ఉండాల్సిన చోట ఉండదు.. ఛీఛీ" అన్నాడు.

"నేనోసారి తిరిగేద్దామని లోపలి రూంలోకి తీసికెళ్ళాను. దీనికే ఇంతగా విసుక్కోవాలా? రోజురోజుకు మీకు కోపం ఎక్కువైపోతున్నది.. మీ గావుకేకలతో నాకు పిచ్చెక్కుతున్నది.. మీరోసారి బీపీ చెక్ చేయించుకోండి" అంటూనే ఆమె లోపలున్న ఆ రోజు పేపర్ను తెచ్చి అతని ముందు పడేసింది.

"కోపం ఎక్కువకాక ఏం చేస్తుంది? ఇటు ఇంట్లో, అటు కాలేజిలో ఏదీ జరగాల్సినట్టుగా జరగడంలేదు. ప్రతిదాన్నీ ఆర్డర్‌లో పెట్టాలని, ప్రతిదీ సిస్టమాటిక్‌గా జరగాలని నేనెంత ప్రయత్నించినా లాభం లేకపోతున్నది"

"ఈయనగారొక్కరే దిగొచ్చారు, ఈ సిస్టమ్‌ని బాగుచెయ్యడానికి.. ఏదైనా జరగాల్సినట్టే జరుగుతుంది. మీ ఇష్టప్రకారమే జరగాలంటే ఏదీ జరగదు"

"ఎందుకు జరగదు? జరిపించటం చేతకాని దద్దమ్మలు అడ్మినిస్ట్రేటర్స్‌గా రావటం వల్ల జరగటంలేదు. నాలాంటి వాడొస్తే ఏదైనా జరిగి తీరుతుంది. ఇంకో నెలరోజుల్లో ఆ కాలేజీనెలా ఆర్డర్‌లో పెడ్తానో నువ్వే చూద్దువుగాని" అన్నాడు ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు.

"చూస్తానులెండి.. మీకింకేమైనా కావాలా.. నన్ను వెళ్ళమంటారా?"

"ఎందుకు వెళ్ళవు? అవతల ఆ దిక్కుమాలిన సీరియల్స్ పిలుస్తున్నాయిగా.. నీకు కట్టుకున్న భర్తకంటే ఆ దిక్కుమాలిన సీరియల్సే ఎక్కువైపోయాయే.."

"అవును మరి. మీకు కట్టుకున్న పెళ్ళానికంటే ఆ దిక్కుమాలిన ఆదర్శాలే ఎక్కువైనప్పుడు.."

"మాటకు మాటంటావా? నువ్వు ఎవరితో మాట్లాడుతున్నావో, నీ హద్దులేమిటో

## సభ్యుల ప్రేమ?

రాజ్యసభలో ఉపాధ్యక్షురాలిగా నజ్మాహెప్తుల్లా ఉన్నప్పుడు ప్రశ్నోత్తరాల సమయంలో ప్రధానికో ప్రశ్న వేశారు. కానీ ఆ సమయానికి పీవీజీ అక్కడ లేరు. ప్రతిపక్ష సభ్యులు తమ అభ్యంతరాన్ని ఉపాధ్యక్షురాలి దృష్టికి తీసుకెళ్ళారు. సరిగ్గా అప్పుడే పి.వి. సభలోకి ప్రవేశించారు. ఆయన్ని చూసిన నజ్మాహెప్తుల్లా,



'ప్రధానిగారూ! మీరంటే సభ్యులకు ఎంత ప్రేమో చెప్పలేం. మీరు రావడం ఓ నిమిషం ఆలస్యమైనా తాళలేకపోతున్నారు' అని నవ్వుతూ చెప్పారు.

దానికి వెంటనే పి.వి. 'అయ్యో! ఈ విషయం కాస్త ముందే తెలిసివుంటే మరికొంచెం ఆలస్యంగా వచ్చేవాడినే. అప్పుడు సభ్యులు విరహవేదనతో మరింత ఎక్కువ ప్రేమ కురిపించేసి ఉండేవాళ్లు కదా!' అని ఛలోక్తి విసిరారు.

సభ్యులంతా హాయిగా నవ్వుకున్నారు.

మరచిపోతున్నావు? "

"మరచిపోలేదు మహాశయా? భగవత్ స్వరూపులైన నా భర్తగారితో మాట్లాడుతున్నాను"

"నేను నీ భర్తను మాత్రమే కాదు.. ఓ డిగ్రీ కాలేజికి ప్రిన్స్‌పాల్‌ను"

"ఆ విషయం కూడా తెలుసు ప్రిన్స్‌పాల్‌గారు.. మీ అండర్‌లో ఉన్నవారినందరినీ మీరో ఆట ఆడించి తీర్తారని కూడా తెలుసు. వాళ్ళు కూడా మిమ్మల్నో ఆట ఆడించి తీర్తారనీ.."

"ఏమిటా వ్యంగ్యం? మామూలుగా మాట్లాడలేవా? ఇట్లా వ్యంగ్యంగా మాట్లాడితే నాకు వొళ్ళు మండుతుంది"

"ఎలా మాట్లాడినా వొళ్ళు మండుతూనే ఉంటుంది మీకు. వొళ్ళు మండనిదెప్పుడు? చల్లగా ఉండేదెప్పుడు? " అంటూ ఆమె లోపలి గదిలోకెళ్ళిపోయింది.

"ఇదో పిచ్చిది" మనసులో అనుకున్నాడు ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు.




"**నీ**కేమన్నా బుద్ధుందా? డర్టీ ఫెలో" అన్నాడు ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు తన ముందు చేతులు కట్టుకొని నిల్చున్న రికార్డు అసిస్టెంట్ గోపాల్‌తో.

"తప్పయింది సార్!" అన్నాడు గోపాల్.

"తాగి డ్యూటీకొస్తావురా రాస్కెల్.. నువ్వు మన ఓల్డ్ స్టూడెంట్స్‌కు టీసీలు, మార్కుల మెమోలు ఇస్తున్నప్పుడు వాళ్ళ దగ్గర లంచాలు తీసుకుంటున్నట్టు కూడా నాకు తెలిసింది. అలా తీసుకుంటున్న లంచాలతో బాగా తాగి కాలేజికొస్తున్నావు. నిన్ను క్షమించేది లేదు. నిన్నిప్పుడే సస్పెండ్ చేస్తున్నాను.. సస్పెండ్ కాదు.. నిన్ను ఉద్యోగంలోంచే తీసేస్తాను.." అన్నాడు ప్రిన్స్‌పాల్ చాలా కోపంగా.

"వద్దు సార్.. నన్ను సస్పెండ్ చెయ్యకండి సార్.. మీ కాళ్ళు పట్టుకుంటా సార్.. మరోసారి తాగి కాలేజికి రాను సార్.. నాకుద్యోగం పోతే నా భార్యా పిల్లలు ఆగమైపోతరు సార్.." అన్నాడు గోపాల్.

"నీకొచ్చిన జీతాన్నంతా ఇలా తాగుడు మీద తగలేస్తోంటే నీ భార్యాపిల్లలకేం మిగుల్తుందిరా వెధవా! నిన్నిప్పుడే ఇమ్మీడియెట్‌గా సస్పెండ్ చేస్తున్నాను.. సూపర్నెంట్‌ను పిలువు" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"వద్దు సార్! నన్ను సస్పెండ్ చెయ్యొద్దు సార్! మీ కాళ్ళు మొక్కుత సార్!" అంటూనే గోపాల్ వచ్చి ప్రిన్స్‌పాల్ కాళ్ళు పట్టుకోబోయాడు.

"ఛీఛీ! పాడుకంపు.. నా దగ్గరకొచ్చావంటే చంపేస్తా.. పోరా.. పో.. నా ఛాయలకు కూడా రావొద్దు. డర్టీ ఫెలో.. ఎన్ని లీటర్ల గుడంబా తాగొచ్చాడో.. నా ఆఫీసు మొత్తం కంపుతో నిండిపోయింది" అంటూ దగ్గరకు రాబోతున్న గోపాల్‌ను శక్తికొద్దీ వెనక్కి నెట్టేశాడు ప్రిన్స్‌పాల్.

తాగిన మత్తులో జోగుతున్న గోపాల్ ప్రిన్స్‌పాల్ తోపుడుకి కింద పడిపోయాడు. కింద పడ్తున్నప్పుడు అతడి నొసలు ఫ్లోరింగ్‌కు తాకి రక్తం వచ్చింది.

సరిగ్గా అప్పుడే ప్రిన్స్‌పాల్ రూంలోకి లెక్చరర్స్ సాంబశివరావు, సూర్యారావులు ప్రవేశించారు.

"ఏమైంది గోపాల్? ఎందుకలా పడిపో

యావు?" అంటూ సూర్యారావు అతన్ని లేపి కూర్చోబెట్టాడు. నొసలు చిట్లి రక్తం రావటాన్ని గమనించిన సూర్యారావు వెంటనే అయొడిన్ తెప్పించి, ఆ గాయానికి రాసి, దూదితో అద్దాడు.

"ఏమైంది సార్?" అన్నాడు సాంబశివరావు.

"వీడు బాగా తాగి కాలేజికొచ్చాడు. టీసీలు ఇస్తూ లంచాలు తీసుకుంటున్నాడు. నేనొచ్చి నా ఛేంబర్ ముందు నిల్చున్నా వీడు నన్ను చూడటంలేదు. స్టూడెంట్స్ ఎవరు కనిపించినా ఓ పదిరూపాయలివ్వండి బాబూ అని డబ్బులడుక్కుంటున్నాడు. ఇలాంటివాడు ఈ కాలేజిలో ఉండొచ్చా? వీడిని వెంటనే సస్పెండ్ చేస్తున్నాను" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"వద్దు సార్. నన్ను సస్పెండ్ చెయ్యొద్దు సార్.. వీపుమీద కొట్టండ్రిగని కడుపుమీద కొట్టకండి సార్.." అంటూ గోపాల్ మళ్ళీ ప్రిన్స్‌పాల్ దగ్గరకు రాబోయాడు.

"నా దగ్గరకొచ్చావంటే చంపేస్తాను.. గుడుంబా కంపుతో నా తల తిరిగిపోతోంది" అన్నాడు ప్రిన్స్‌పాల్, చేతిలో ఉన్న పేపర్‌వెయిట్‌ను తీసి, దానితో కొడ్తానన్నట్టుగా గోపాల్‌కు చూపిస్తూ.

"అరేయ్ గోపాల్.. నువ్వు బయటకు వెళ్ళిపోరా.. నీ విషయం మేం ప్రిన్స్‌పాల్ గారితో మాట్లాడతాంగానీ నువ్వు బయటకు వెళ్ళిపో.." అన్నాడు సూర్యారావు.

"అయ్యా, సూర్యారావు దొరా.. చచ్చి నీ కడుపున పుడ్తా.. ప్రిన్స్‌పాల్ దొర నన్ను సస్పెండ్ చెయ్యకుండా కాపాడుండ్రి" అన్నాడు గోపాల్.

"అలాగే.. అలాగే.. నువ్వయితే బయటకు వెళ్ళు. చెప్పేది నీకే.. బయటకు వెళ్ళు" అన్నాడు సూర్యారావు.

గోపాలొచ్చి సూర్యారావు కాళ్ళు పట్టుకున్నాడు.

"వద్దులేరా.. కాళ్లు పట్టుకోవడం తప్పు.. నేను చెబుతున్నానుగా.. వదులు.." అన్నాడు సూర్యారావు.

"వాడెందుకొదుల్తాడు? వాళ్ళ బుద్ధులెందుకు మార్తాయి. తాగొచ్చి కాలేజిలో న్యూసెన్స్ చేస్తున్నాడని ఇప్పుడే నేను పోలీసులకు ఫోన్ చేస్తానుండు.." అన్నాడు ప్రిన్స్‌పాల్.

"ఈ మాత్రానికి పోలీసులెందుకు సార్.. ఈ గోపాల్ వొట్టి అల్పసంతోషి. నాలుగు పైసలు చేతులబడ్తే చాలు, తాగేస్తాడు. తాగి కాలేజికి రావడం వీడికి కొత్త కాదు. ఇదివరకటి ప్రిన్స్‌పాల్ పట్టించుకునేవాడు కాదు" అన్నాడు సూర్యారావు.

"ఇదివరకటి ప్రిన్స్‌పాలో చవట.. దద్దమ్మ.. ఇన్‌స్టిట్యూషన్ను పాడుచేశాడు. దీన్ని బాగు చేసేటప్పటికి నా తలప్రాణం తోకకొచ్చేలా ఉంది. ఇలా తాగి కాలేజికొచ్చేవాళ్ళను నేను క్షమించను. పైగా వీడో లంచగొండి. వీడిని వెంటనే డిస్మిస్ చేసేస్తాను" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"వద్దు సార్.. నన్ను డిస్మిస్ చెయ్యొద్దు సార్" అంటూ గోపాల్ భోరుమని యేడ్చేశాడు.

సూర్యారావు "ఏడ్వొద్దురా గోపాల్! ప్రిన్స్‌పాల్ అలా అంటాడేగాని నిన్ను నిజంగా డిస్మిస్ చెయ్యడు. మేమంతా ఉన్నాంగా.. నువ్వు మొదలైతే బయటకు వెళ్లు" అంటూ సూర్యారావు గోపాల్‌ను ప్రిన్స్‌పాల్ రూములోనుంచి మెల్లగా బయటికి తీసికెళ్ళాడు.

"మిస్టర్ సూర్యారావు! డోంట్ మేక్ ఎనీ ఫాల్స్ ప్రామిసెస్.. వాడిమీద నేను డెఫినెట్‌గా యాక్షన్ తీసుకుంటాను. హి కెనాట్ గెట్ అవే ఫ్రమ్ దిస్ క్రైమ్.." అన్నాడు ప్రిన్స్‌పాల్.

ఇంటర్‌కామ్ నుండి ఆఫీసుకు ఫోన్‌చేసి సూపరెన్టెంట్ పరమేశాన్ని రమ్మన్నాడు.

పరమేశం వచ్చి ప్రిన్స్‌పాల్ ముందు నిల్చున్నాడు.

"వాడు, రికార్డ్ అసిస్టెంట్ గోపాల్ బాగా తాగొచ్చి కాలేజిలో న్యూసెన్స్ క్రియేట్ చేస్తున్నాడు. వాడిని వెంటనే సస్పెండ్ చేస్తున్నాను. వాడి సస్పెన్షన్ ఆర్డర్స్ టైపు చేయించి పట్టుకురండి" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"వాడో పేదోడు సార్! అప్పుడప్పుడు తాగొస్తాడు. వాడు తాగుడుకు అడిక్టయి పోయాడు. మెల్లగా వాడిచేత తాగుడు మానిపిద్దాం సార్! వాడిని సస్పెండ్ చేస్తే వీధుల్లో పడిపోయి, అక్కడో ఇక్కడో బిచ్చ

కొత్తగాలి... 

**ప్రభుత్వాలు**
**విషవృక్షాలను పెంచితే..**
**వాటి ఊడలు**
**కాలనాగులై కాటేస్తాయి!**

– పెన్మెత్స సూరిబాబు, హైదరాబాద్

మెత్తి ఇంకా తాగుతాడు. వాడి భార్యాపిల్లలు దిక్కులేనివాళ్ళయిపోతారు. ఈ సారికి వాడిని క్షమించండి సార్! వాడిచేత తాగుడు మానిపించే పూచీ నాది" అన్నాడు సూర్యారావు.

"మిస్టర్ సూర్యారావు.. మీరనవసరంగా దీంట్లో జోక్యం చేసుకుంటున్నారు. సస్పెన్షన్ పెద్ద పనిష్‌మెంట్ కాదు. వాడి ప్రవర్తన మారితే మళ్ళీ తీసుకుంటాను" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"సస్పెండ్ చెయ్యడమెందుకు? మళ్ళీ తీసుకోవడమెందుకు? వదిలెయ్యండి సార్! నేను చెబుతున్నానుగా.. వదిలెయ్యండి" అన్నాడు సూర్యారావు.

"నేను చెబుతున్నానంటున్నారు. చెప్పడానికి మీరెవరు? " అన్నాడు ప్రిన్స్‌పాల్.

"నేనెవరో మీకు తెలియదా? లెక్చరర్స్ అసోసియేషన్ ప్రెసిడెంట్‌ను"

"సోవ్వాట్! లెక్చరర్స్ అసోసియేషన్‌కు ప్రెసిడెంటువయినంత మాత్రాన నా అడ్మినిస్ట్రేషన్‌లో జోక్యం చేసుకునే హక్కు మీకుందనుకుంటే పొరపాటు. ఈ కాలేజికి సంబంధించిన నిర్ణయాలన్నీ నేను తీసుకోవాలి. నేనీ కాలేజికి ప్రిన్స్‌పాల్‌నని మరచిపోకండి.." అన్నాడు వెంకటేశ్వరరావు.

"నేనూ ఈ స్టేట్ లెక్చరర్స్ అసోసియేషన్‌కు ప్రెసిడెంట్‌నని మీరూ మరచిపోవద్దు" అన్నాడు సూర్యారావు.

"మీరు మీ లిమిట్స్ మరచిపోయి మాట్లాడుతున్నారు" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"మీరూ మీ లిమిట్స్ మరచిపోయి మాట్లాడుతున్నారు" అన్నాడు సూర్యారావు.

"షటప్ యువర్ మౌత్.. అండ్ బిహేవ్ యువర్‌సెల్ఫ్. ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసుకునే మాట్లాడుతున్నావా? " అన్నాడు ప్రిన్స్‌పాల్.

"నన్ను షటప్ అంటావా? ఇంతవరకు నన్నీ కాలేజిలో షటప్ అన్నవాడెవడూ లేడు. దీని ఫలితం నువ్వు తప్పకుండా అనుభవిస్తావు" అంటూ సూర్యారావు దిగ్గున లేచి నిల్చున్నాడు.

"అనుభవిస్తానంటున్నావు? ఏం చేస్తావు? " అన్నాడు ప్రిన్స్‌పాల్.

"ఏం చేస్తానో చెప్పను. చేసి చూపిస్తాను" అంటూనే సూర్యారావు బయటికెళ్ళిపోయాడు.

"ఏమిటండీ సాంబశివరావుగారూ! ఈ కాలేజిలో ప్రతివాడూ ఇంత దురుసుగా మాట్లాడ్తాడేమిటి? ప్రిన్స్‌పాలంటే ఎవరికీ భయంలేదు.. భక్తీ లేదు" అన్నాడు ప్రిన్స్‌పాల్ సాంబశివరావు వైపు తిరిగి.

"పరిస్థితులు మారాయి సార్! ఎవరూ

ఎవరికీ భయపడే రోజులు కావివి. ఇది డెమోక్రసీ కదా! దేశంలో డెమోక్రసీ చాలా ఎక్కువయిపోయింది. ప్రతివాడికీ ఫ్రీడం.. టూమచ్ ఆఫ్ ఫ్రీడం అయిపోయింది. ఫ్రీడం కావాలేగాని బాధ్యతలు ఎవడికీ అక్కర్లేదు" అన్నాడు సాంబశివరావు.

"పరిస్థితులు మారితే మారాయేమో? నేను మాత్రం మారలేదు. ప్రిన్స్‌పాలంటే ఏమిటో వీళ్ళకు అర్థమయ్యేట్లు చేస్తాను"

"కష్టం సార్.." అన్నాడు సాంబశివ రావు.

"ఎందుకు కష్టం? ఈ సూర్యారావులు, భుజంగరావులు.. నన్నేం చెయ్యలేరు. కమిషనర్ ఆఫ్ హైయర్ ఎడ్యుకేషన్ ఈజ్ మై బెస్ట్ ఫ్రెండ్. ఆయనకు చెప్పి వీళ్లిద్దర్నీ శంకరగిరిమాన్యాలు పట్టించకపోతే నా పేరు వెంకటేశ్వరరావు కాదు"

"మేమిప్పుడొచ్చింది భుజంగరావు విషయం మాట్లాడటానికే. సూర్యారావు ఏమన్నాడంటే భుజంగరావుతో సారీ చెప్పిస్తాను.. అతనికిచ్చిన మెమోను విత్‌డ్రా చేసుకొమ్మందాం.. మీరూ రండి అని నాతో అంటే నేనొచ్చాను. భుజంగరావుకు మీకు మధ్య శాంతి కుదర్చటానికొస్తే అది మీకూ సూర్యారావుకు మధ్య యుద్ధంగా మారింది" అన్నాడు సాంబశివరావు.

"భుజంగరావుకిచ్చిన మెమోను విత్‌డ్రా చేసుకునే ప్రసక్తే లేదు. అతడు చాలా రెక్‌లెస్‌గా, ర్యాష్‌గా మాట్లాడాడు.. హీ మస్ట్ పే ఫరిట్"

"భుజంగరావంటే ఫరవాలేదుగాని సూర్యారావుతో మాత్రం పెట్టుకోకండి సార్!" అన్నాడు సాంబశివరావు.

"ఏం చేస్తాడంటారు? "

"మీ క్షేమం కోరే చెబుతున్నాను. అతనికీ కాలేజిలోనూ, ఈ ఊర్లోనూ చాలా పలుకుబడుంది. ఇదివరకు రెండుసార్లు అతనికీ ఊర్నుండి ట్రాన్స్‌ఫరయ్యింది. రెండుసార్లు కాన్సిల్ చేయించుకొని పదేళ్ళుగా ఇక్కడే ఉంటున్నాడు. ఈ కాలేజికి ప్రిన్స్‌పాల్ ఎంతో నేనూ అంతే అనుకుంటాడతను. స్టూడెంట్స్‌తో కూడా అతనికి మంచి సంబంధాలున్నాయి. స్టూడెంట్స్ అతడు చెప్పినట్టు వింటారు. వాళ్ళను సూర్యారావు తన గ్రిప్‌లో పెట్టుకున్నాడు"

"అంటే.. ఈ కాలేజిలో అతడో పవర్ సెంటర్నమాట. ఇంచుమించు పారలల్ అడ్మినిస్ట్రేషన్ నడుపుతున్నాడన్నమాట. అతడి ఆటలిక సాగనివ్వను. అయామ్ ది ప్రిన్స్‌పాల్ ఆఫ్ దిస్ కాలేజ్. యాజ్ ఫర్ యాజ్ కన్‌సర్న్‌డ్ టు దిస్ కాలేజ్, అయామ్ ది కింగ్! కమిషనర్ ఆఫ్ హైయర్ ఎడ్యుకేషన్ ఈజ్ మై బెస్ట్ ఫ్రెండ్.. ఈవెన్ మినిస్టర్ ఆఫ్ హైయర్ ఎడ్యుకేషన్ ఈజ్ ఆల్సో మై బెస్ట్ ఫ్రెండ్.. నేనతన్ని ఈ కాలేజి నుండి పంపిస్తానో లేదో చూడండి"

"మీరు పంపిస్తారు సరే.. అతడు మళ్ళీ ఈ కాలేజికే వస్తాడు"

"నేనేమిటో మీకింకా అర్థమైనట్టు లేదు మిస్టర్ సాంబశివరావు. అతడు పాపాత్ముడైతే నేను పాపాల భైరవున్ని. త్వరలోనే నేనేమిటో మీకు అర్థమౌతుందిలెండి" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"వాళ్ళిద్దరు అలా మాట్లాడుకుంటుండగానే జూనియర్ అసిస్టెంట్ ప్రభాకర్ కొన్ని ఫైళ్ళు పట్టుకుని ప్రిన్స్‌పాల్ రూంలో ప్రవేశించాడు.

"ఏమిటవి? " అన్నాడు ప్రిన్స్‌పాల్.

"స్టూడెంట్స్ స్కాలర్‌షిప్పుల ఫైళ్లు సార్! వీటిని సోషల్ వెల్ఫేర్ డిపార్ట్‌మెంట్ వాళ్ళకు సబ్మిట్ చెయ్యాలి. లాస్ట్ డేట్ దగ్గర పడ్తోంది" అన్నాడు ప్రభాకర్.

"ఈ స్కాలర్‌షిప్పుల విషయంలో నేనో నిర్ణయం తీసుకున్నాను. డెబ్భైఐదు శాతం అటెండెన్స్ లేని స్టూడెంట్స్‌కి స్కాలర్‌షిప్స్

ఇచ్చేది లేదు. ఎగ్జామ్స్‌కి కూడా పంపించేది లేదు. అయామ్ గోయింగ్ టుబీ వెరీ స్ట్రిక్ట్ ఆన్ దిస్. చూడు ప్రభాకర్! వెంటనే లెక్చ రర్ల దగ్గర్నుండి స్టూడెంట్ల అటెండెన్స్ పర్టి క్యులర్స్ తెప్పించుకోండి. డెబ్భైఐదు శాతం అటెండెన్స్ పుటప్ చేసిన విద్యార్థుల స్కాల రోషిప్ ప్రపోజల్స్‌నే సోషల్ వెల్ఫేర్ డిపా ర్ట్‌మెంట్‌వాళ్ళకు సబ్మిట్ చెయ్యండి" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"లాస్ట్ డేట్ అయిపోతుందేమో సార్! మొదలైతే ఈ ఫార్మ్ మీద మీరు సైన్ చేస్తే పంపించేద్దాం. తర్వాత అటెండెన్స్ విషయం చూసుకుందాం సార్" అన్నాడు ప్రభాకర్.

"ఆఫ్టరాల్.. నువ్వో జూనియర్ అసి స్టెంట్‌వి. చెప్పింది చెయ్యకుండా హెడ్ ఆఫ్ ది ఇనిస్టిట్యూషన్‌కే సలహాలిస్తావా? యూజ్‌లెస్ ఫెలో! ఏమిటి నీ వేషం? కాలేజికి ఇలాగేనా రావడం? టీషర్ట్ వేసు కొని.. నెత్తి సరిగ్గా దువ్వుకోకుండా ఓ పోకిరోడిలా ఇంత కేర్‌లెస్‌గా కాలేజికొ స్తావా? రేపట్నుంచి కాస్త నీట్‌గా తయారై రా.. పో.. నేను చెప్పేంతవరకు స్కాలర్‌షిప్స్ ఫైలు నా దగ్గరకు తీసుకురా వొద్దు" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"అలాగే సార్!" అంటూ ప్రభాకర్ వెళ్ళి పోయాడు.

"స్కాలర్‌షిప్స్ ఫార్మ్స్ లాస్ట్‌డేట్ అయి పోయేలోగా పంపించకపోతే చాలా గొడవై పోతుంది సార్" అన్నాడు సాంబశివరావు.

"ఒక్కరోజు కూడా కాలేజికి రానివాడు కూడా స్కాలర్‌షిప్ తీసుకోవడం అన్యా యమా? కాదా? తేరగా వచ్చింది కదా అని ప్రభుత్వ సొమ్ము తినేయడమేనా? ఇలాంటివి నా హయాంలో జరగటానికి వీల్లేదు" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"మీ ఇష్టం సార్!" అంటూ సాంబశివ రావు వెళ్ళిపోవటానికి సిద్ధపడ్తూ లేచి నిల్చున్నాడు.

"లెక్చరర్లందరికీ చెప్పండి.. ఈ రోజు తప్పనిసరిగా అటెండెన్స్ తీసుకోవాలని. ప్రతినెలా అటెండెన్స్ షార్టేజి ఉన్న విద్యార్థుల పేర్లను ప్రిన్స్‌పాల్‌కు పంపిం చాలని చెప్పండి. నేను ఆల్రెడీ నోటీసు పంపించాననుకోండి.. ఓకే సాంబశివ రావుగారు.. నేనోసారి రౌండ్స్‌కు వెళ్తా స్తాను" అన్నాడు ప్రిన్స్‌పాల్ కూడా లేచి నిల్చుంటూ.




**సాం**బశివరావు స్టాఫ్‌రూంలో అడుగు పెడ్తుండగా "వాడి అంతు చూడకపోతే నా పేరు సూర్యారావే కాదు" అంటూ పెద్దగా అరుస్తున్న సూర్యారావు మాటలు వినిపిం చాయి.

సూర్యారావు అలాగే మాట్లాడ్తాడని అను కుంటూ సాంబశివరావు వెళ్ళి తన సీట్లో కూర్చున్నాడు.

"అసలు ఏమనుకుంటున్నాడు వాడు? నన్ను షటప్ అంటాడా? మీరే చెప్పండి సాంబశివరావుగారు.. నా తప్పేమన్నా ఉందా? వాడో పేదోడు.. వాడిని క్షమించి వదిలెయ్యండి అన్నాను. అంతమాత్రానికే షటప్ అంటాడా? " అన్నాడు సూర్యారావు.

"పోనీయండి సూర్యారావుగారూ.. అతడు మన బాస్ కదా.."

"బాసయితే మాత్రం నోటికొచ్చినట్టు

వాగుతాడా? వాడేమన్నా పెద్ద డిక్టేటరా? మనం ప్రజాస్వామ్య వ్యవస్థలో జీవిస్తున్నాం సార్! ఇక్కడ ఇలాంటి డిక్టేటర్లకు స్థానంలేదు. ఆ బాస్టర్డ్‌ని ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించకపోతే నా పేరు సూర్యారావే కాదు. భుజంగరావు గారు.. నీకిచ్చిన మెమోకు ఎలాంటి రిప్లై రాస్తానంటే అది చదివితే వాడి బుర్ర గిర్రున తిరిగిపోవాలి. వాడి బీపీ పెరిగిపోయి మెంటల్ బ్రేక్‌డౌన్ రావాలి" అన్నాడు సూర్యారావు.

"సూర్యారావుగారూ! మరీ దూకుడుగా రాయకండి. వాడు నామీద పగబట్టి ఏ ఆదిలాబాద్‌కో ట్రాన్స్‌ఫర్ చేయిస్తే ఛస్తాను" అన్నాడు భుజంగరావు.

"నువ్వు చావకుండా చూసే పూచీ నాది. మిమ్మల్ని వాడంత సులభంగా ట్రాన్స్‌ఫర్ చేయించగల్గుతాడనుకుంటున్నారా? ఒకవేళ చేయించాడే అనుకోండి.. నేను మీ ట్రాన్స్‌ఫర్‌ని కాన్సిల్ చేయించలేననుకుంటున్నారా? ఈ జిల్లాకు చెందిన మంత్రులు, ఎం.ఎల్.ఎ.లు అందరూ నా చేతుల్లో ఉన్నారు. మీరేం భయపడకండి" అన్నాడు సూర్యారావు.

ఈలోగా అక్కడకు గోపాల్ వచ్చి సూర్యారావుతో, "దొరా.. ప్రిన్స్‌పాల్ నాకు సస్పెన్షన్ ఆర్డర్స్ ఇచ్చిండు. మీరే కాపాడాలె దొరా!" భోరుమని ఏడుస్తూ సూర్యారావు కాళ్ళ మీద పడ్డాడు.

"అరేయ్ గోపాల్.. లేయ్‌రా.. నీకో మంచి ఉపాయం చెబుతాను. నీ ఉద్యోగం ఎక్కడా పోదు. నువ్వు వెంటనే పోలీసుస్టేషన్‌కు వెళ్ళి ప్రిన్స్‌పాల్ నీ మీద రక్తం వచ్చేలా చెయ్యి చేసుకున్నాడని, కింద పడేశాడనీ, కులం పేరుతో దూషించాడని కంప్లెయింట్ ఇవ్వు. వెంటనే పోలీసులు వాడిని అరెస్టు చేస్తారు. తర్వాత కథ నేను నడిపిస్తాను" అన్నాడు సూర్యారావు.

"నన్ను ప్రిన్స్‌పాల్ కులం పేరుతో దూషించాడా? " అన్నాడు గోపాల్ నెత్తి గోక్కుంటూ

"ఔన్రా.. వాళ్ళ బుద్ధులెందుకు మార్తాయి- అన్నాడు.. అంటే ఏమిటి? నువ్వు ఎస్సీవి కదా? ఎస్సీలు తాగుబోతులని, వాళ్ళ బుద్ధులు మారవని అన్నాడు. ఇది కులంపేరుతో దూషించటం కాదా? నేనో కంప్లెయింట్ లెటర్ రాసిస్తాను.. దీన్ని తీసికెళ్ళి ఎస్.ఐ.కి ఇవ్వు.. పోలీసు స్టేషన్ ఇక్కడికి దగ్గరే" అంటూ సూర్యారావు ఓ పెన్నూ పేపర్ తీసుకొని ఓ కంప్లెయింట్ లెటర్ రాయసాగాడు.

"ఇంతదానికి పోలీసులదాకా ఎందుకు సూర్యారావు? మన కాలేజి పరువు పోతుంది కదా? " అన్నాడు సాంబశివరావు.

"పోయేది కాలేజి పరువు కాదు. వాడి పరువు" అన్నాడు సూర్యారావు.

"ఎంత చెడ్డా అతడు మన ప్రిన్స్‌పాల్. మన ఇన్‌స్టిట్యూషన్‌కు హెడ్! అతని పరువు పోతే మన పరువూ పోయినట్టే.. కాస్త ఓపిక పట్టండి.. ఈ సమస్యని మనం మరోలా పరిష్కరించే ప్రయత్నం చేద్దాం" అన్నాడు సాంబశివరావు.

"మరోలా అంటే ఎలా? " అన్నాడు సూర్యారావు.

"ప్రిన్స్‌పాల్‌ని మరోసారి రిక్వెస్ట్ చేద్దాం"

## కొత్తగాలి...

**డబ్బుంటే**
**'అవినీతి' కబుర్లు**
**లేకపోతే**
**అవి నీతి కబుర్లే**

*– మండ విజయశ్రీ, శ్రీకాకుళం*

"వాడో జగమొండి. ఎవరి మాటా వినడు. అరేయ్ గోపాల్.. ఈ లెటర్ తీసుకొని నువ్వు పోలీసుస్టేషన్‌కు వెళ్ళు" అన్నాడు సూర్యారావు, పోలీసులకు అప్లికేషన్ రాయడం పూర్తిచేసి.

"గోపాల్ బాగా తాగిన మత్తులో ఉన్నాడు. అతడిలా వెళ్తే పోలీసులు అతన్ని స్టేషన్ లోపలికి రానివ్వరు" అన్నాడు ముకుందరెడ్డి.

"నేనిప్పుడే ఎస్.ఐ.కి ఫోన్‌చేసి చెబుతాను. ఎస్.ఐ. వెంకటరమణ ఈజ్ మై బెస్ట్ ఫ్రెండ్. ఒరేయ్ గోపాల్, నువ్వెళ్ళు. నేను ఎస్.ఐ.తో నువ్వొస్తున్నావని చెబుతాను" అన్నాడు సూర్యారావు.

"నువ్వు చెప్పినంక పోత దొరా" అన్నాడు గోపాల్.

సూర్యారావు తన జేబులో ఉన్న సెల్ ఫోన్ తీసి ఎస్.ఐ. వెంకటరమణతో మాట్లాడాడు.

"ఎస్.ఐ.గారేనా? నమస్కారం సార్! నేను సూర్యారావును మాట్లాడుతున్నాను. మా కాలేజిలో ఓ గొడవ జరిగింది. రికార్డు అసిస్టెంట్‌గా పనిచేసే గోపాల్‌ను మా ప్రిన్స్‌పాల్ కొట్టాడు. నోటికొచ్చినట్టు తిట్టాడు. అతడు కంప్లెయింటివ్వడానికి మీ దగ్గరకొస్తున్నాడు.. పంపించమంటారా? థాంక్యూ సార్! థాంక్యూ వెరీమచ్" అన్నాడు సూర్యారావు.

"రమ్మంటున్నాడు- నువ్వు వెళ్లరా గోపాల్" అన్నాడు సూర్యారావు ఫోన్ కట్‌చేసి, తను రాసిన అప్లికేషన్ను గోపాల్ చేతికిచ్చి.

"నాకైతే ఏం కాదుగదా? నా ఉద్యోగం పోదు గదా?" అన్నాడు గోపాల్ సూర్యారావు ఇచ్చిన కాగితాన్ని తీసుకుంటూ.

"నీకేం ఫరవాలేదులేరా! నువ్వెళ్ళు.." అంటూ, "మరచిపోయాను. ఆ అప్లికేషన్ మీద నీ సంతకం కావాలి" అంటూ తనిచ్చిన కాగితం మీద గోపాల్‌తో సంతకం చేయించి, "ఇక నువ్వు వెళ్లు" అన్నాడు సూర్యారావు.

గోపాల్ మరోసారి ఆ స్టాఫ్‌రూంలో కూర్చున్న లెక్చరర్లందరికేసి 'నాకేమన్నా అయితే మీదే బాధ్యత' అన్నట్టుగా చూసి ఆ రూంలోంచి బయటకు వెళ్ళిపోయాడు. అతడలా వెళ్ళిపోయిన కాస్సేపట్లోనే కొందరు సీనియర్ స్టూడెంట్స్ స్టాఫ్‌రూంలోకి ప్రవేశించారు.

"ఏమోయ్ శ్యామ్‌సుందర్! ఏమిటిలా స్టాఫ్‌రూంలోకి దూసుకొచ్చారు?" అన్నాడు సూర్యారావు.

"ఈ ప్రిన్స్‌పాల్ ఎవడోగాని తిక్కలోడిలా ఉన్నాడేం సార్? మాకు స్కాలర్‌షిప్స్ రాకుండా చేస్తున్నాట్ట. సెవెంటీఫైవ్ పర్సెంట్ అటెండెన్స్ లేనివాళ్ళకు స్కాలర్‌షిప్స్ ఇవ్వనంటున్నాడట.." అన్నాడు శ్యామ్‌సుందర్.

"అంటున్నాడు.. చాలా అంటున్నాడు. సెవెంటీఫైవ్ పర్సెంట్ అటెండెన్స్ లేకపోతే మిమ్మల్ని పరీక్షలక్కూడా పంపించనంటున్నాడు" అన్నాడు సూర్యారావు.

"మేమంత చేతకానివాళ్ళం అనుకుంటున్నాడా? మాకు స్కాలర్‌షిప్స్ రాకపోయినా, మమ్మల్ని అటెండెన్స్ లేదని పరీక్షలకు పంపించకపోయినా అతడెలా ఈ కాలేజిలో పనిచేస్తాడో చూస్తాం.. ఈ కాలేజి టాప్ లేపేస్తం సార్.." అన్నాడు శ్యామ్‌సుందర్.

"మీరు లేపాల్సింది ఈ కాలేజి టాప్‌ను కాదు.. అతన్ని లేపెయ్యాలి.. లేపెయ్యాలంటే మొత్తం మనిషినే లేపెయ్యాలని కాదు.. అతన్నిక్కణ్నించి పంపించెయ్యాలని" అన్నాడు సూర్యారావు.

"తప్పకుండా పంపిస్తం సార్! చాలా విచిత్రమైన మనిషిలా ఉన్నాడేం సార్! ఈ రోజుల్లో అటెండెన్స్ ఎవడన్నా పట్టించు

కుంటున్నాడా? ఇతడు కాస్సేపన్నా రూంలో కూర్చోడు. ఎప్పుడూ బయటే తిరుగుతుంటాడు. వరండాల్లో తిరుగుతున్న స్టూడెంట్స్‌ను చూసి 'అడ్డగాడిదలు.. దున్నపోతులు' అంటూ నోటికొచ్చినట్టు తిడ్తాడు. మొన్న జువాలజీ స్టూడెంట్స్‌ను ల్యాబ్ బయటే నిల్చోబెట్టి వాళ్ళకు అటెండెన్స్ ఇవ్వొద్దని రమా మేడంకు చెప్పాడు. కొత్తగా వచ్చాడని చూస్తూ ఊరుకుంటోంటే రోజురోజుకు మితిమీరిపోతున్నాడు" అన్నాడు శ్యామ్‌సుందర్ పక్కనే ఉన్న మరో విద్యార్థి అఖిల్.

"మీరు ఇలాగే చూస్తూ కూర్చుంటే అతడింకా రెచ్చిపోయి మీ జీవితాలతో ఆడుకుంటాడు.. మీ తడాఖా ఏమిటో చూపిస్తే తప్ప తగ్గడు" అన్నాడు సూర్యారావు.

"చూపిస్తం సార్.. మా తడాఖా ఏమిటో చూపిస్తం. రాండ్రిరా.. ఇప్పుడే మనం ప్రిన్స్‌పాల్ దగ్గరకు పోదాం" అన్నాడు శ్యామ్‌సుందర్.

"ఆయనేం చేసిన రూల్స్ ప్రకారం చేస్తున్నాడు. కొందరు మీ విద్యార్థులు ఒక్క రోజు కూడా కాలేజికి రాకుండా స్కాలర్‌షిప్పులు తీసుకుంటున్నారు. అది అన్యాయం కాదా? " అన్నాడు సాంబశివరావు.

"అన్యాయమే సార్! ఈ కాలేజిలో ఏది న్యాయంగా జరుగుతున్నదని? ఒక్కరోజు కూడా క్లాసులు తీసుకోని మీ లెక్చరర్లల్లో కొందరు ప్రతినెలా జీతాలు తీసుకోవడం అన్యాయం కాదా? " అన్నాడు అఖిల్.

"ఔనయ్యా! అలాంటి అన్యాయాలు జరక్కుండా చూడాలనే గదా ఈ ప్రిన్స్‌పాల్ తాపత్రయం. మీ స్టూడెంట్స్‌నే కాదు. మా లెక్చరర్లను కూడా ఆర్డర్‌లో పెట్టాలని ఆయన ప్రయత్నిస్తున్నాడు" అన్నాడు దుర్గారెడ్డి.

"ఎవరు ఎవర్నీ ఆర్డర్‌లో పెట్టలేరు. ఆర్డర్లో పెట్టే రోజులెప్పుడో పోయాయని ఆయనకు తెలిసినట్టులేదు. ఆయన పద్ధతి మార్చుకోకపోతే ఆయన్నే మేం ఆర్డర్‌లో పెట్టాల్సొస్తుంది" అన్నాడు శ్యామ్‌సుందర్.

"పెట్టాలి.. మీరే ఆ మొండిఘటాన్ని ఆర్డర్‌లో పెట్టగలరు" అన్నాడు సూర్యారావు.

"మన స్కాలర్‌షిప్పు ఫార్మ్‌ని ఇంతవరకు పంపించలేదట్రా.. వెళ్లి అడుగుదాం పదండి" అన్నాడు అఖిల్.

వాళ్ళంతా స్టాఫ్‌రూంలోంచి బయటకొచ్చి ప్రిన్స్‌పాల్ రూంవైపు కదిలారు.

వాళ్ళలా బయటకు వెళ్ళగానే అటెండర్ హుస్సేన్ ప్రిన్స్‌పాల్ పంపించిన ఓ నోటీసు పట్టుకొని స్టాఫ్‌రూంలో కొచ్చాడు.

"సార్.. ప్రిన్స్‌పాల్‌గారు ఈ నోటీసును సార్లందరికీ చూపించి రమ్మనిచ్చిండు సార్!" అంటూ తను తెచ్చిన నోటీసును సాంబశివరావు చేతికిచ్చాడు.

సాంబశివరావా నోటీసును చదివాడు.

"ఏమిటిది? " అన్నాడు సూర్యారావు.

"లెక్చరర్లందర్నీ తాము తీసుకుంటున్న క్లాసులకు సంబంధించిన అటెండెన్స్ వివరాలను వెంటనే పంపించమంటున్నాడు. స్కాలర్‌షిప్ ఫార్మ్లు పంపించటానికి విద్యార్థుల అటెండెన్స్ పర్టిక్యులర్స్ కావాలట" అన్నాడు సాంబశివరావు.

"చచ్చాంరా బాబోయ్!" అన్నాడు భుజంగరావు.

**కొత్తగాలి...**

**ఇంటి దొంగల్ని**
**ముందు పట్టండి**
**తర్వాత స్విస్సు**
**తలుపు తట్టండి**

– ఎస్. హర్షవర్ధన్,
సికింద్రాబాద్

# మరుగున పడ్డ బ్రిటన్ సింబల్!




బ్రిటన్‌కు మొట్టమొదటి సింబల్ బిగ్‌బెన్ గడియారంకాగా, తర్వాతది ఎర్రరంగు పబ్లిక్ టెలిఫోన్ బూత్. ఈ బూత్‌లను వాళ్లు 'టెలిఫోన్ బాక్స్' అనేవారు. చెక్క, గాజుతో చేసిన ఎర్రరంగులో ఉండే ఇవి బ్రిటన్ వ్యాప్తంగా కనిపించేవి. కాని సెల్‌ఫోన్స్ వచ్చాక వీటికి ఆదరణ తగ్గింది. కేవలం పదిహేను శాతం మందే నేడు వీటిని ఉపయోగిస్తుండటంతో గిట్టుబాటు కాక నిరుపయోగంగా మిగిలిపోయాయి. వాస్తవానికి ఒక్కో టెలిఫోన్‌బూత్ ధర పదకొండు వందల డాలర్లు లేదా ఏడువందల పౌండ్లు.




బ్రిటిష్ టెలికాం వీటిని ప్రజలకి 'అడాప్ట్ ఎ కియోస్క్' పేరిట కొని, ఉపయోగించమని ప్రచారం మొదలు పెట్టింది. ఖాళీగా ఉండటంతో వీటిలో సెక్స్ కార్యకలాపాలు కూడా అధికమయ్యాయి. ఇటీవలే బ్రిటిష్ టెలికాం వెయ్యో టెలిఫోన్ బూత్‌ను అమ్మింది. వీటిని కేవలం ఒక పౌను ధరకే అతి చౌకగా సమాజానికి ఉపయోగపడే సంస్థలకు అమ్ముతోంది. వాటిని కొన్నవారు పుస్తకాల షెల్ఫ్‌గా, పోస్ట్‌కార్డులు విక్రయించే షాపుగా, ప్రపంచంలోని అతిచిన్న ఆర్ట్ గేలరీగా, వాన, మంచు నుంచి తల దాచుకునే ప్రదేశంగా ఉపయోగించుకుంటున్నారు. 2002లో బ్రిటన్ మొత్తం మీద తొంభైరెండు వేల టెలిఫోన్ బాక్సులు ఉంటే, నేడు అవి కేవలం 12,500 మాత్రమే.

1924లో మంచి టెలిఫోన్ బాక్సును రూపొందించేందుకు ఏర్పాటు చేసిన పోటీలో పాల్గొన్న సర్‌గైల్స్ గిల్బర్ట్ స్కాట్ ఈ ఎర్ర టెలిఫోన్ బాక్సును రూపొందించాడు. కేటూ అని పిలిచే ఈ బాక్సును 1926లో మొదటిసారి ఉపయోగించారు. ఐదో జార్జి చక్రవర్తి సిల్వర్ జూబ్లీ సందర్భంగా 1936లో గిల్బర్ట్ స్కాట్ ఈ మోడల్‌ను మరింత అభివృద్ధి చేశాడు. తర్వాతి కాలంలో బ్రిటన్‌లో విరివిగా ఉపయోగించింది ఈ మోడలే. దాంతో దీనికి 'జూబ్లీ కియోస్క్' అనే నిక్‌నేమ్ కూడా ఉండేది.

"ఎందుకలా అన్నారు? " అన్నాడు దుర్గారెడ్డి

"నేనెప్పుడోగాని అటెండెన్స్ తీసుకోను. కొన్ని క్లాసుల అటెండెన్స్ రిజిష్టర్లే నా దగ్గర లేవు. పోయిన ప్రిన్స్‌పాల్ అటెండెన్స్‌ను గురించి అడిగేవాడే కాదు.." అన్నాడు భుజంగరావు.

"నేను క్లాసుకెళ్ళి పాఠం చెబుతానుగాని అటెండెన్స్ తీసుకోను. ఇప్పుడీయన అకస్మాత్తుగా విద్యార్థుల అటెండెన్స్ పర్టిక్యులర్స్ పంపించమంటే ఎలా పంపించటం? " అన్నాడు వీరాస్వామి.

"ఈయన డెబ్బైఐదు శాతం అటెండెన్స్ లేనివాళ్ళ స్కాలర్‌షిప్ ఫార్మ్స్‌ని సోషల్ వెల్ఫేర్ వాళ్ళకు పంపించనే పంపించడట! అలాచేస్తే మన స్టూడెంట్స్ ఊరుకుంటారా? ఈయనగారి అంతు చూస్తారు.. ఈ రోజుల్లో అటెండెన్స్‌నెవడు పట్టించుకుంటున్నాడు? " అన్నాడు సూర్యారావు.

"ఈయన పట్టించుకుంటున్నాడు కదా! ఈ రోజుల్లో కూడా తిక్క మనుష్యులు కొందరుంటారు" అన్నాడు భుజంగరావు.

"అతని తిక్కను మన స్టూడెంట్స్ వదిలిస్తార్లెండి.. మీరేం వర్రీ కాకండి. ఈ

పాటికి శ్యాంసుందర్ వాళ్ళు వెళ్ళి ఆయన తిక్క కుదిరించే ఉంటారు. కాస్సేపట్లోనే ఆయనగారి దగ్గరకు పోలీసులు కూడా వచ్చి జైలుకు తీసుకెళ్తారులెండి" అన్నాడు సూర్యారావు.




ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు అప్పుడే రౌండ్స్‌కు నుండి తన రూంలోకొచ్చాడు. అతడు తన సీట్లో కూర్చున్నాడో లేదో శ్యామ్‌సుందర్, కొండారెడ్డితోపాటు మరో ఎనమండుగురు విద్యార్థులు ప్రిన్స్‌పాల్ రూంలోకి దూసుకొచ్చారు.

"మీకిప్పుడు క్లాసుల్లేవా? ఇలా వచ్చారేమిటి? మిమ్మల్నసలు లోపలికెవరు రానిచ్చారు? బయట అటెండర్ హుస్సేన్ లేడా? అతడొచ్చి ఫలానా వాళ్ళొచ్చి మిమ్మల్ని కలుస్తారట.. అని చెప్పాక నేను రమ్మంటేనే లోపలకు రావాలి.." అంటూ ప్రిన్స్‌పాల్ ఇంకేదో చెప్పబోయాడు.

"అవన్నీ పక్కన పెట్టండి సార్! మీరు మా స్కాలర్‌షిప్ ఫార్మ్ మీద సంతకం చెయ్యనన్నారట.. వాటిని పంపించటానికి రేపే లాస్ట్‌డేట్. రేపటిలోగా వాటిని పంపించకపోతే మాకు స్కాలర్‌షిప్స్ రావు. వాటిని వెంటనే పంపించండని చెప్పడానికొచ్చాం" అన్నాడు శ్యామ్‌సుందర్.

"మీరెవరితో మాట్లాడుతున్నారో తెలుసా? " అన్నాడు ప్రిన్స్‌పాల్.

"తెలుసు.. ఈ కాలేజి ప్రిన్స్‌పాల్ గారితో మాట్లాడుతున్నామని తెలుసు"

"తెలుసా? అయితే వినండి.. ఈ కాలేజిలో ఏం జరగాలన్నా అది ప్రిన్స్‌పాల్ ద్వారానే జరగాలి. ఏ విషయంలోనైనా సరే నిర్ణయం తీసుకోవాల్సింది ప్రిన్స్‌పాలే. ఈ కాలేజికి సంబంధించినంతవరకు, ప్రిన్స్‌పాల్ ఈజ్ ది కింగ్!" అన్నాడు వెంకటేశ్వరరావు.

"ఈ కాలేజికి ప్రిన్స్‌పాల్ కాదు కింగ్.. మేం.. విద్యార్థులం.. మేం కింగ్స్‌మి. ప్రభుత్వం ఈ కాలేజిని నడుపుతున్నది ప్రిన్స్‌పాల్ కోసం కాదు.. మా కోసం.. విద్యార్థుల కోసం. విద్యార్థుల ప్రయోజనాలను దెబ్బతీయటానికి ప్రయత్నిస్తే ఏ ప్రిన్స్‌పాలైనా ఈ కాలేజిలో ఒక్కరోజు కూడా పనిచెయ్యలేడని తెలుసుకోండి" అన్నాడు కొండారెడ్డి.

"నేను విద్యార్థుల ప్రయోజనాలను కాపాడటానికే పనిచేస్తున్నాను. విద్యార్థులు చక్కగా చదువుకోవటానికి అనువైన వాతావరణం సృష్టించటం కోసమే నేను ప్రయత్నిస్తున్నాను"

"విద్యార్థులకు స్కాలర్‌షిప్స్ రాకుండా చేయటం విద్యార్థుల ప్రయోజనాలను కాపాడటం అవుతుందా? మేం స్కాలర్‌షిప్స్ కోసమే ఈ కాలేజిలో చేరామన్న సంగతి మీకు తెలీదా? " అన్నాడు శ్యామ్‌సుందర్.

"నేను స్కాలర్‌షిప్స్ రాకుండా చేస్తున్నానని మీకెవరు చెప్పారు.. రేపటిలోగా మీ అటెండెన్స్ తెప్పించుకొని సరిపోయేంత అటెండెన్స్ ఉన్నవాళ్ళందరి ఫార్మ్‌ని పంపిస్తాను" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"అటెండెన్స్‌కు, స్కాలర్‌షిప్స్‌కు లింకు పెట్టకండి సార్! ఇదివరకు ఈ కాలేజిలో పనిచేసిన ఏ ప్రిన్స్‌పాల్ కూడా అట్లా చెయ్యలేదు. అటెండెన్స్ ఎక్కడిది సార్?

ఈ లెక్చరర్లెవరైనా అటెండెన్స్ తీసుకుంటున్నారనుకుంటున్నారా? ఒకవేళ తీసుకున్నా అటెండెన్స్ కరెక్ట్‌గా వేస్తున్నారనుకుంటున్నారా? అటెండెన్స్ అనేదొక ఫార్స్. మీకు చాలా మర్యాదగా చెబుతున్నాం. స్కాలర్‌షిప్స్‌కు, అటెండెన్స్‌కు లింకు చెయ్యకండి. అటెండెన్స్ షార్టేజి కారణంతో మీరు ఏ ఒక్కరి స్కాలర్‌షిప్ ఆపినా పరిణామాలు చాలా తీవ్రంగా ఉంటాయి" అన్నాడు శ్యామ్‌సుందర్.

"స్కాలర్‌షిప్‌కు అర్హులు కావాలంటే డెబ్బైఐదు శాతం అటెండెన్స్ ఉండాలన్నది రూలు.. ఐ విల్ గో ఎకార్డింగ్ టు రూల్స్. అటెండెన్స్ షార్టేజి ఉన్నవాళ్ళకు స్కాలర్‌షిప్స్ ఇవ్వను. పరిణామాలు తీవ్రంగా ఉంటాయని బెదిరిస్తే బెదురుతాననుకుంటున్నారా? ఈ వెంకటేశ్వరరావు సంగతి మీకు తెలియదు. ఎలాంటి పరిణామాలనైనా ఎదుర్కోగలడీ వెంకటేశ్వరరావు. లెక్చరర్లు అటెండెన్స్ తీసుకోరంటున్నారు.. ఎలా తీసుకోరో, కరెక్ట్‌గా ఎందుకు మార్క్ చెయ్యరో నేను చూస్తాను. కరడుగట్టిన సోమరిపోతుల చేత కూడా ఈ వెంకటేశ్వరరావు పనిచేయించగలడు. నన్ను మీరు తక్కువ అంచనా వెయ్యకండి"

"మమ్మల్ని కూడా మీరు తక్కువగా అంచనా వెయ్యకండి సార్! రేపు మా స్టూడెంట్సందరి స్కాలర్‌షిప్ ఫార్మ్స్ మీరు సోషల్ వెల్ఫేర్ ఆఫీసుకు పంపకపోతే మేం ఏం చేస్తామో చెప్పం.. చేసి చూపిస్తాం" అన్నాడు శ్యామ్‌సుందర్.

"మంచిది. అలాగే చూపించండి.. మీరిక వెళ్ళొచ్చు. డోన్ట్ వేస్ట్ మై టైమ్" అన్నాడు ప్రిన్స్‌పాల్.

విద్యార్థులు ప్రిన్స్‌పాల్ రూం నుండి బయటకొచ్చి, "ప్రిన్స్‌పాల్- డౌన్ డౌన్.. ప్రిన్స్‌పాల్- డౌన్ డౌన్" అంటూ చాలాసేపు అరిచారు. వాళ్ళలా అరుస్తుండగానే అక్కడికి సీనియర్ లెక్చరర్ సాంబశివరావొచ్చాడు.

"ఏమిటోయ్ శ్యామ్‌సుందర్! ఏమిటీ గొడవ? ఏమైంది?" అన్నాడు సాంబశివరావు.

"ఈ ప్రిన్స్‌పాలెవడు సార్! ఇతన్నెక్కడ్నించి పట్టుకొచ్చి మన నెత్తిన రుద్దింద్రు సార్" అన్నాడు శ్యామ్‌సుందర్.

"ప్రిన్స్‌పాల్‌ను గురించి అలా లూజ్‌గా మాట్లాడకూడదు. హీ ఈజ్ ది హెడ్

## కాగితాల్ని కన్పించనివ్వం!

జర్మనీలో భారతీయ ఉత్సవాలను ప్రారంభించటానికి 1991లో బాన్ నగరం వెళ్లిన ప్రధాని పి.వి. ఆ దేశాధినేత హెల్మెట్ కోల్‌తో వాణిజ్య ఒప్పందాల గురించి సుదీర్ఘంగా చర్చించారు. మనదేశంపైనున్న దురభిప్రాయాల్ని, అపోహల్ని తొలగించేందుకు విశేష కృషి చేశారు. ఆ సందర్భంలో ఓ పారిశ్రామిక



వేత్త, 'భారత్‌తో వ్యాపారం చేయాలంటే చాలా చాలా కాగితాలు మారాల్సి ఉంటుంది' అని వ్యంగ్యంగా అన్నారు.

దానికి పి.వి. 'మా దేశంలో తగినంత కాగితం ఉత్పత్తి జరగడం లేదు. అందువల్ల ప్రస్తుతం మేము కాగితం వినియోగం తగ్గించడానికి మా శాయశక్తులా ప్రయత్నిస్తున్నాం. కాబట్టి మీరిక ఆ విషయంపై బెంగపెట్టుకోనక్కర్లేదు. సంతోషంగా పెట్టుబడులు పెట్టుకోవచ్చు' అని చమత్కరించారు.

ఆఫ్ అవర్ ఇనిస్టిట్యూషన్. అతనికిచ్చే గౌరవం ఇవ్వాలి" అన్నాడు సాంబశివరావు.

"తప్పకుండా ఇస్తం సార్! ఆయన ఆ గౌరవాన్ని నిలుపుకోవాలె గద. మాకు స్కాలర్‌షిప్స్ రాకుండా చేస్తానంటాడేమిటి? అటెండెన్స్‌కూ స్కాలర్‌షిప్స్‌కు లింకు పెడ్తానంటాడేమిటి? ఈ రోజుల్లో అటెండెన్స్ ఎవరు పట్టించుకుంటున్నారు సార్!" అన్నాడు కొండారెడ్డి.

"ఈయన పట్టించుకుంటున్నాడు కదా! రూల్స్ ప్రకారం నడుచుకునే మనిషి. ఇప్పుడైతే స్కాలర్‌షిప్ ఫార్మ్‌ను పంపించండి. స్కాలర్‌షిప్స్ డిస్‌బర్స్ చేసేటప్పుడు అటెండెన్స్‌ని చూద్దాం. అప్పుడు అటెండెన్స్ షార్టేజి ఉన్నవాళ్ల స్కాలర్‌షిప్స్‌ను ఆపుదామని చెబుతాను. మీరందుకు ఒప్పుకుంటారా? " అన్నాడు సాంబశివరావు.

"ఒప్పుకోము సార్.. అటెండెన్స్‌కు, స్కాలర్‌షిప్స్‌కు లింక్ పెట్టొదన్నదే మా డిమాండ్" అన్నాడు కొండారెడ్డి.

మిగతా స్టూడెంట్స్ కూడా కొండారెడ్డి అన్న మాటను బలపరచారు.

"అలా అంటే మీ స్కాలర్‌షిప్ ఫార్మ్స్ అసలు ఈ కాలేజి నుండి వెళ్లనేవెళ్లవు. అటెండెన్స్‌కూ, స్కాలర్‌షిప్స్‌కూ లింకు పెట్టొద్దంటే ఆయన అసలే ఒప్పుకోడు. మీరే ఆలోచించుకోండి" అన్నాడు సాంబశివరావు.

విద్యార్థులు వాళ్లలో వాళ్లు చాలాసేపు చర్చించుకున్నారు. సాంబశివరావు వాళ్ల మధ్యలోంచి బయటకొచ్చి ఓ పక్కకు నిల్చున్నాడు.

పదిహేను నిమిషాలసేపు విద్యార్థులు తమలో తాము వాదించుకున్నాక ఓ నిర్ణయానికొచ్చినట్లు కనిపించారు. శ్యామ్‌సుందర్ సాంబశివరావు దగ్గరకొచ్చి..

"మీరు చెప్పింది బాగుంది సార్! ప్రస్తుతమైతే లాస్ట్‌డేట్‌లోగా ఆ ఫార్మ్స్ వెళ్లేటట్టు చూడండి. డిస్‌బర్స్‌మెంట్ అప్పుడు ఏం జరుగుతుందో చూద్దాం. స్కాలర్‌షిప్ ఫార్మ్స్ వెళ్లకపోతే మొదటికే మోసం వస్తుంది కదా? " అన్నాడు.

"సరే, అయితే నేను వెళ్లి ప్రిన్స్‌పాల్‌తో మాట్లాడతాను. మీరిప్పట్నించి క్లాసులు సరిగ్గా అటెండ్ చేసి ఎవరికీ అటెండెన్స్ షార్టేజ్ లేకుండా చూసుకోండి. మీరలా చేస్తే స్కాలర్‌షిప్‌ను ఆపాల్సిన అవసరం ప్రిన్స్‌పాల్‌కు రాదు.. అందరూ ఈ మాట మీద నిలబడ్తారా? " అన్నాడు సాంబశివరావు.

"నిలబడ్తాం సార్.. నిలబడ్తాం సార్" అన్నారు విద్యార్థులంతా ఒకేసారి.

"అప్పటివరకు ఈ ప్రిన్స్‌పాల్ ఉంటే కదా!" అన్నారు కొందరు వెనక నిల్చున్న విద్యార్థులు.

"ఈ ప్రిన్స్‌పాల్ మీ శత్రువేమీ కాదు. మన ఇనిస్టిట్యూషన్ను సరైన దార్లో పెట్టాలనే ఆయన ప్రయత్నిస్తున్నాడు. మనమందరం ఆయనకు సహకరించాలే తప్ప ఇలా 'ప్రిన్స్‌పాల్ డౌన్‌డౌన్' అంటూ అల్లరి చెయ్యొద్దు" అన్నాడు సాంబశివరావు.

"అట్లాగే సార్" అన్నారు విద్యార్థులందరూ ఒకేసారి.

"నేను వెళ్లి ప్రిన్స్‌పాల్‌తో మాట్లాడి వస్తాను.. మీరు కామ్‌గా ఉండండి"

**కొత్తగాలి...**

**ప్రతిభకు మూత**
**పర్సుకు పీట**
**పైరవీయే కదా ప్రతిచోట**

– పట్ల యాదగిరి,
*గుండాల, నల్గొండ జిల్లా*

అంటూ సాంబశివరావు ప్రిన్స్‌పాల్ రూంలోకెళ్లాడు.

"రండి సాంబశివరావుగారు.. మీరేదో వాళ్లతో మాట్లాడుతున్నారు. వాళ్లు ప్రిన్స్‌పాల్ డౌన్‌డౌన్ అని అరిచినంత మాత్రాన నేను వెనక్కిపోతానుకుంటున్నారేమో! ఒక్కరోజు కూడా కాలేజికి రానివాడికి వేల రూపాయల స్కాలర్‌షిప్ ఇవ్వడానికి నేను రెడీగా లేను. ప్రతిరోజూ కాలేజి కొచ్చి బుద్ధిగా చదువుకునే వాడికే స్కాలర్‌షిప్ ఇవ్వాలి"

"అది నిజమే సార్. మీరీ కాలేజిని అర్డర్‌లో పెట్టాలని ప్రయత్నిస్తున్నారు. మంచిదే.. కానీ మరీ వేగంగా వెళ్లటం మంచిది కాదు. మీకు ముందున్న ప్రిన్స్‌పాల్ ఈ కాలేజీని ఎంత పాడుచెయ్యాలో అంత చేశాడు. ఇంతగా చెడిపోయిన ఈ ఇనిస్టిట్యూషన్‌ని ఒక్కరోజులో బాగు చెయ్యలేరు. మీరు కాస్త నెమ్మదిగా ఇదే పట్టుదలతో వెళ్తే మీరనుకున్నది సాధించగల్గుతారు"

"ఆల్‌రైట్.. ఆల్‌రైట్.. నేను ఏపని చేసినా వేగంగానే చేస్తాను. దట్స్‌మై నేచర్. ఈ కాలేజినొక ఆదర్శవంతమైన కాలేజిగా మార్చాలని నా ప్రయత్నం. వేగంగా వెళ్తేనే నేను నా లక్ష్యాన్ని సాధించగలను. ఇంతకూ మీరేం చెప్పదల్చుకున్నారో చెప్పండి"

"మీరు విద్యార్థుల అటెండెన్స్ పర్టికులర్స్ పంపించండని లెక్చరర్లకు నోటీసు పంపించారు. రేపు ఉదయం పదింటికల్లా ఆ రిపోర్టు మీ టేబుల్ మీదుండాలన్నారు. కానీ అది సాధ్యమయ్యే పనికాదు. ఎందుకంటే చాలామంది లెక్చరర్లు ఈ అటెండెన్స్ రిజిష్టర్లని సరిగ్గా మెయిన్‌టైన్ చెయ్యడం లేదు. కొందరసలు అటెండెన్స్ తీసుకోనే తీసుకోరు. మీరు అటెండెన్స్ విషయంలో స్ట్రిక్టుగా ఉంటారని తెలిసింది కాబట్టి ఇప్పట్నించి అందరూ జాగ్రత్తగా అటెండెన్స్ తీసుకుంటారు. అందువల్ల నేను చెప్పేదొక్కటే.. రేపు స్కాలర్‌షిప్ ఫార్మ్స్ పంపించెయ్యండి. స్కాలర్‌షిప్స్ సాంక్షనయి రావటానికి ఇంకా నాలుగైదు నెలలు పడ్తుంది. స్కాలర్‌షిప్స్‌ని విద్యార్థులకు చెల్లించేటప్పుడు వాళ్ల అటెండెన్స్‌ని చూడండి. తక్కువ అటెండెన్స్ ఉన్న విద్యార్థుల స్కాలర్‌షిప్స్‌ని ఆపేయండి" అన్నాడు సాంబశివరావు.

"మీ సజెషన్ బాగానే ఉంది. కానీ అప్పుడు మాత్రం వీళ్లు ఇలాగే గొడవ చెయ్యరని నమ్మకమేమిటి? అంత్య నిష్టూరం కంటే ఆది నిష్టూరం బెటర్ కదా? "

"అప్పుడు వాళ్లిలా గొడవ చెయ్యరు. ఇప్పట్నించి వాళ్లు ప్రతిరోజూ క్లాసులు అటెండ్ చేసి అటెండెన్స్ షార్టేజి లేకుండా చూసుకుంటామని వాళ్లిప్పుడే నాతో చెప్పారు"

"సర్లేండి. నేను మీ సలహాని స్వీకరిస్తున్నాను. నిజం చెప్పాలంటే నేనూ ఇలాగే చేద్దామనుకుంటున్నాను. నేను చెయ్యాలనుకున్నది, మీరు చెప్పిందీ ఒకటే కాబట్టి సమస్యే లేదు. రేపు వాళ్ల స్కాలర్‌షిప్ ఫార్మ్స్ పంపిస్తాను. ఇప్పట్నించి అటెండెన్స్ విషయంలో నేను చాలా స్ట్రిక్టుగా ఉంటానని, షార్టేజి ఉన్నవాళ్లకు స్కాలర్‌షిప్ ఎమౌంట్ చెల్లించబడదని మీరు మరోసారి వాళ్లకు చెప్పండి"

"అలాగే చెబుతాను సార్"

"ఎగ్జామ్స్‌కు పంపించే విషయంలో కూడా నేను అటెండెన్స్‌ను చూస్తానని చెప్పండి.. రేపు వాళ్లు మళ్లీ ఇలాగే గొడవ చేస్తే ఫలితం ఉండదని చెప్పండి. బ్రహ్మదేవుడు దిగొచ్చినా నా నిర్ణయం మారదు.. ప్రిన్సిపుల్స్ విషయంలో నేను చాలా మొండివాణ్ణి. నేను నమ్మిన ప్రిన్స్

పుల్స్‌ని ఆచరణలో పెట్టడానికి ఎన్ని ప్రతిబంధకాలెదురైనా లెక్కచెయ్యను. పూర్వం నరసింహారావని ఓ ప్రిన్స్‌పాలుండేవారని, ఆయనే నాకు మోస్ట్ ఐడియల్ ప్రిన్స్‌పాల్ అని చెప్పాను కదా! ఆయన ఎన్ని అడ్డంకులొచ్చినా, ఎందరు అరచి గీపెట్టినా తన ప్రిన్సిపుల్స్ నుండి ఒక ఇంచ్ కూడా డీవియేట్ అయ్యేవాడు కాడు. ఆయనే నా రోల్ మోడల్. ప్రిన్సిపుల్స్ విషయంలో నేనెంతమాత్రం కాంప్రమైజ్ కాను"

"ఆ విషయం తెలుస్తూనే ఉందికదా సార్! కాని మీ నరసింహారావుగారు ప్రిన్స్‌పాల్‌గా పనిచేసినప్పటి పరిస్థితులు ఇప్పుడు లేవు సార్"

"అదిసరే నన్ను మా బంధువుల్లో కొందరు పాపాలభైరవుడు అంటారు. ఎందుకో తెలుసా సాంబశివరావుగారూ? "

"చెప్పండి సార్!"

"ప్రిన్సిపుల్స్ విషయంలో నేను మా ఆవిడ మాట కూడా విననని. నేను డొనేషన్స్ కట్టి కార్పొరేట్ మెడికల్ కాలేజిల్లో సీట్లు కొనుక్కోవడానికి వ్యతిరేకం. మా అబ్బాయిని డాక్టర్ను చెయ్యాలని మా ఆవిడ కోరిక. ఎంసెట్ రాసి, మంచి ర్యాంకు తెచ్చుకొని మెడిసిన్ చదవమని, నాకేం అభ్యంతరం లేదన్నాను. డొనేషన్ చెల్లించి కార్పొరేట్ కాలేజిలో చేర్పించనని చెప్పాను. ర్యాంకొచ్చింది. సీటొచ్చే అవకాశమే లేదు. అప్పుడు మా ఆవిడ నన్ను మూడు లక్షల డొనేషన్ చెల్లించి ఓ కార్పొరేట్ మెడికల్ కాలేజిలో మావాడిని చేర్పించమని పట్టుబట్టింది. నథింగ్ డూయింగ్ అన్నాను. ఏడ్చింది. ఉపవాసాలుంది. చచ్చిపోతానని బెదిరించింది. నేను చలించలేదు. నేను డొనేషన్ చెల్లించనని రూఢీ కావడంతో మావాడు ఇంట్లోంచి వెళ్ళిపోయాడు. వాడిప్పుడెక్కడున్నాడో తెలీదు.. వాడు ఇంట్లోంచి వెళ్ళిపోయినప్పట్నించి వాడికోసం వెతుకుతూనే ఉన్నా. కానీ ఇంతవరకు వాడి ఆచూకీ తెలియలేదు. 'నువ్వు కోరుకున్నట్టే డొనేషన్ చెల్లించి నిన్ను మెడిసిన్ చదివిస్తాను, నువ్వు వెంటనే ఇంటికి రావాలి' అనే పేపర్ ప్రకటన ఇవ్వమని మా బంధువులొచ్చి నాతో పోరాడారు. నథింగ్ డూయింగ్ అన్నాను. నాకొక్కడే కొడుకు. ఒక్కగానొక్క కొడుకును పోగొట్టుకుంటావా? అన్నారు. కొడుకునైనా పోగొట్టుకుంటాను గానీ నా ప్రిన్సిపుల్స్‌ని మాత్రం వదులుకోను అన్నాను. దటీజ్ వెంకటేశ్వరరావు!"

"మీ ఆవిడగారు ఇప్పుడెలా ఉన్నారు? "

"రోజూ నాతో పోట్లాడటమే. మీది రాతి గుండె అంటుంది.. పిచ్చి ప్రిన్సిపుల్స్ కోసం కన్న కొడుకునే పోగొట్టుకుంటారా? అంటుంది. సాక్షాత్తు మహాత్మాగాంధీగారే ఇలా దిగొచ్చాడని దెప్పుతుంటుంది. బట్ ఐ డోంట్ కేర్"

"మీ అబ్బాయి ఏమై వుంటాడు? "

"ఎక్కడో అక్కడ క్షేమంగానే ఉండి ఉంటాడు. ఇవ్వాళో రేపో వచ్చేస్తాడు. వాడిని వాళ్ళమ్మ ఎంతో గారాబంగా పెంచింది. ఆమెను చూడకుండా వాడు, వాడిని చూడకుండా ఈమె ఒక్కరోజైనా ఉండలేదు. నా అనుమానమేమిటంటే వాడెక్కడున్నాడో మా ఆవిడకు తెలుసు.. వాళ్ళు నన్ను టెస్ట్ చేస్తున్నారు. అంతే.."

"మీకు అమ్మాయిలు లేరా సార్!"

"ఎందుకు లేరు. మాకో అమ్మాయుంది. అదిప్పుడు ఇంటర్ చదువుతోంది. అదొక్కతే నన్ను సపోర్ట్ చేస్తోంది. 'మీ ఐడియల్స్ చాలా గొప్పవి డాడీ' అంటుంది. దానికి జర్నలిస్టు కావాలని ఉంది. ఎవరికి ఏ రంగం మీద సహజమైన ఇంటరెస్ట్ ఉంటే ఆ రంగంలోనే కృషి చెయ్యమనాలి. మా ఆవిడ మా అమ్మాయిని కూడా మెడి

సిన్ చెయ్యమంటోంది. 'నాకు మెడిసిన్ మీద ఇంటరెస్ట్ లేదు మమ్మీ!' అంటే విని పించుకోదు"

"బావుంది సార్.. అందరూ మీలాంటి ఐడియలిస్టులే ఉంటే ఈ దేశం ఎంతో బాగుండేది" అంటూ సాంబశివరావు లేచి బయటకొచ్చాడు.

బయట విద్యార్థులందరూ అతనికోసం వెయిట్ చేస్తూ నిల్చున్నారు.

"డోంట్‌వర్రీ బోయ్స్.. రేపు మీ స్కాల ర్‌షిప్ ఫార్మ్స్ వెళ్తాయి.. రావాల్సిన వాళ్ళందరికీ స్కాలర్‌షిప్స్ వస్తాయి. కానీ ఈ రోజు నుంచి మీరు కాలేజికొచ్చి క్లాసులు అటెండ్ చేసి బుద్ధిగా చదువుకో వాలి" అన్నాడు సాంబశివరావు.

"అలాగే సార్! థాంక్యూ సార్.." అన్నారు వాళ్ళల్లో కొందరు.

"మీ లెక్చరర్లు బుద్ధిగా చెబితేకదా, మేం బుద్ధిగా చదువుకోవడానికి.." అన్నారు వాళ్ళల్లోనే మరికొందరు.

"ఎందుకు చెప్పరు? ఎవరన్నా క్లాసులు సరిగ్గా తీసుకోకపోయినా, అటెండెన్స్ సరిగ్గా తీసుకోకపోయినా ప్రిన్స్‌పాల్‌కు చెప్పండి. ఆయన వెంటనే యాక్షన్ తీసు కుంటారు" అంటూ సాంబశివరావు వాళ్ళ మధ్యలోంచి వెళ్ళిపోయాడు.

సాంబశివరావు చక్కగా స్టాఫ్‌రూంలో కొచ్చి తన సీట్లో కూర్చున్నాడు.

లెక్చరర్లందరూ అటెండెన్స్ రిజిష్టర్లను అప్‌టుడేట్ చేసే ప్రయత్నంలో మునిగిపో వడాన్ని సాంబశివరావు గమనించాడు.

అటెండెన్స్ క్రమం తప్పకుండా తీసుకునే లెక్చరర్ల రిజిష్టర్లు చూసి, అటెండెన్స్ ఎప్పుడూ తీసుకోని లెక్చరర్లు తమ రిజిష్ట ర్లను నింపుకుంటున్నారు.

"రేపు పదింటిలోగా అటెండెన్స్ పర్టిక్యు లర్స్ సబ్మిట్ చెయ్యకపోతే ఆయనగారు ఏం చేస్తారట? " అన్నాడు సూర్యారావు.

"రేపు పదింటికనే కాదు.. ఇప్పట్నిం చైనా మనం మన అటెండెన్స్ రిజిష్టర్లని అప్‌టుడేట్ చేసుకొని క్రమం తప్పకుండా అటెండెన్స్ తీసుకొని ఏ నెలకు ఆ నెల మన రిజిష్టర్లని, మన టీచింగ్ డైరీలను ప్రిన్స్‌పాల్‌కు చూపిస్తే మంచిది. ఏ రోజు పని ఆ రోజు చేసుకుంటే మనకూ మంచిదే కదా? " అన్నాడు సాంబశివరావు.

"ఈ రోజుల్లో అటెండెన్స్ రిజిష్టర్లని, టీచింగ్ డైరీలను ఎవడు పట్టించుకుంటు న్నాడండీ.. ఇలాంటి చాదస్తపు ప్రిన్స్‌పాళ్ళు తప్ప" అన్నాడు సూర్యారావు.

"పోయిన ప్రిన్స్‌పాల్ ఎంత మంచి వాడో! ధర్మరాజు! ఇలాంటి పిచ్చి పిచ్చి

## కొత్తగాలి...

**రాతిలో రాముడ్ని**
**చూడగలిగే మనసు**
**రాయిలా ఎలా మారుతుందో?!**

– ప్రతాప వెంకట సుబ్బారాయుడు,
సికింద్రాబాద్

వాటిని గురించి అస్సలు పట్టించుకునే వాడు కాదు" అన్నాడు భుజంగరావు.

"మరీ అంత లీనియెంట్‌గా కూడా ఉండకూడదు. ఇన్‌స్టిట్యూషన్స్ చెడిపో తాయి" అన్నాడు ముకుందరెడ్డి.

"మరీ ఇంత స్ట్రిక్టుగా ఉంటే కూడా ఇ న్‌స్టిట్యూషన్స్ చెడిపోతాయి" అన్నాడు భుజంగరావు.

ఇలా లెక్చరర్లు చాలాసేపు తమలో తాము చర్చించుకున్నారు. సాయంత్రం నా లుగు గంటలు కాగానే అందరూ తమ తమ ఇళ్ళకు బయల్దేరారు.

"ఇదివరకైతే మనలో చాలామంది కాలే

జీకి అలా వచ్చి ఇలా వెళ్లిపోయి ఊర్లో తమ పనుల్ని చూసుకునేవాళ్లు. ఈయన వచ్చినప్పట్నించి అందర్నీ ఉదయం పదింటి నుండి సాయంత్రం నాల్గింటిదాకా కాలేజీలో ఉండేలా చేస్తున్నాడు" అన్నాడు భుజంగరావు.

"వీడు మనపాలిటి యముడిలా దాపురించాడు. వీడ్ని ఇక్కణ్నించి పంపించకపోతే మన ఉసురు తీసేలా ఉన్నాడు" అన్నాడు సూర్యారావు.

"ఆ పని మీరే చెయ్యాలి" అన్నాడు భుజంగరావు.

లెక్చరర్లందరూ స్టాఫ్ రూంలోంచి బయటకొచ్చి ప్రిన్స్‌పాల్ రూంలోకెళ్ళి అటెండెన్స్ రిజిష్టర్లో సాయంత్రం నాల్గింటికి చెయ్యాల్సిన రెండో సంతకంచేసి ఎవరిళ్లకు వాళ్లు వెళ్లిపోయారు.

ఈ ప్రిన్స్‌పాల్ వచ్చాక రెండుసార్లు సంతకం చెయ్యాలన్న నిబంధన పెట్టాడు. ఉదయం పదింటికొకసారి, సాయంత్రం నాల్గింటికొకసారి లెక్చరర్లందరూ రిజిష్టర్లో సంతకం చెయ్యాలి. ఉదయం ఐదు నిమిషాలు ఆలస్యంగా వస్తే ఆరోజు ఆ లెక్చరర్ కాజువల్ లీవ్ పెట్టేసి ఇంటికి వెళ్లిపోయినా, కాలేజీలోనే ఉన్నా ఆయన డ్యూటీలో లేనట్టుగానే పరిగణిస్తారు. కొత్త ప్రిన్స్‌పాల్ ఈ నిబంధనలన్నీ అమల్లోకి తెచ్చే టప్పటికి కాలేజీలో రెండు మూడు గంటలైనా స్థిమితంగా ఉండిపోలేని కొందరు లెక్చరర్లకు కాలేజంటే జైలులా కనిపించసాగింది.

విద్యార్థులందరూ, లెక్చరర్లందరూ వెళ్లిపోయినా ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు మాత్రం తన గదిలోనే ఆరింటిదాకా కూర్చొని కాలేజీలో ఇంకా ఏమేం చెయ్యాలో ఆలోచించసాగాడు. ఆఫీసులో పనిచేసే నాన్‌టీచింగ్ స్టాఫ్ తప్ప అందరూ వెళ్లిపోవడంతో కాలేజీ చాలా ప్రశాంతంగా మారిపోయింది.

"మే ఐ కమిన్ సర్?" అన్న మాట వినిపించటంతో ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు ఆ మాట అంటున్న వ్యక్తికేసి చూశాడు. అతడు పోలీసు యూనిఫామ్‌లో ఉండటంతో పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరని అర్థం చేసుకున్నాడు.

"ప్లీజ్ కమిన్" అన్నాడు.

అతడొచ్చి ప్రిన్సిపాల్‌కు ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

"నా పేరు వెంకటరమణ, సబ్ ఇన్‌స్పెక్టర్ని" అన్నాడతడు.

"మీరు సబ్ ఇన్‌స్పెక్టరని మిమ్మల్ని చూడగానే అర్థమైపోయింది. మీరొచ్చిన పనేమిటో చెప్పండి"

"మీమీద ఓ కంప్లెయింటొచ్చింది. చాలా సీరియస్ కంప్లెయింట్"

"నా మీద కంప్లెయింటా? ఎవరిచ్చారు? ఏమనిచ్చారు?"

"మీ కాలేజీలో రికార్డు అసిస్టెంటుగా పనిచేసే గోపాల్! మీరతనిమీద చెయ్యి చేసుకున్నారని, కులం పేరుతో దూషించారని కంప్లెయింటిచ్చాడు. ఇది ఎంత సీరియస్ కంప్లెయింటంటే మిమ్మల్ని వెంటనే ఎస్. సి., ఎస్. టి. అట్రాసిటీ కేసు కింద అరెస్ట్ చెయ్యాల్సి ఉంటుంది" అన్నాడు ఎస్. ఐ.

## కొత్తగాలి...

**మహానగర మురికివాడల్లో**
**కిటకిటలాడుతూ నిరుపేదలు**
**పల్లెల్లో 'దాహమో రామచంద్రా'**
**అంటూ కటకటలాడుతూ**
**'నీరు' పేదలు**

– ఎ. సూర్యప్రకాశ్, నిజామాబాద్

"నాన్‌సెన్స్! వాడు బాగా తాగి కాలేజీ కొస్తే మరోసారి ఇలా డ్యూటీకొస్తే సస్పెండ్ చేస్తానని మెమో ఇచ్చానంతే. ఈ మాత్రానికే వాడు మీ దగ్గరకొచ్చి కంప్లెయింటిచ్చాడా? ఈ కంప్లెయింట్ వాడంతటవాడు ఇచ్చి ఉండడు. దీని వెనక మా టీచింగ్‌స్టాఫ్ వాళ్లెవరన్నా ఉండి వుంటారు"

"మీ అనుమానం కరెక్టే అనుకుంటాను. ఎందుకంటే ఆ కంప్లెయింట్ లెటర్లో వాడిన పదజాలం చూస్తే ఎవరో ఇంగ్లీషులో పండితుడైనవాడు రాసినట్టుగా ఉంది. మీరు చాలా స్ట్రిక్టుగా ఉంటూ ఈ కాలేజీని బాగు చేసే ప్రయత్నంలో ఉన్నారని మాకు రిపోర్ట్సు వచ్చాయి. మీరు రాకముందు ఈ కాలేజీ చాలా అధ్వాన్నంగా, ఓ ఫిష్‌మార్కెట్‌లా ఉండేది.. మీరు స్ట్రిక్టుగా ఉండటంతో చాలామంది ఇక్కడ పనిచేస్తున్నవాళ్లకు చాలా ఇబ్బందిగా ఉంది. అలాంటి వాళ్లెవరో మీమీద ఈ కంప్లెయింట్ ఇప్పించి వుంటారు. మీరెలాగైనా మీ గోపాల్‌తో మాట్లాడి అతన్నీ కంప్లెయింటును విత్‌డ్రా చేసుకునేలా చూడండి. లేకపోతే మీరు చాలా ఇబ్బందిలో పడిపోతారు"

"నేనిప్పుడే ఎస్.పి.తో మాట్లాడతాను. ఇది ఫాల్స్ కంప్లెయింటని చెబుతాను.."

"ఎస్.పి.గారు కూడా ఇదే చెబుతారు.. గోపాల్‌చేత కంప్లెయింట్‌ని విత్‌డ్రా చేయించటం తప్ప ఈ సమస్యకు పరిష్కారం లేదు. ఈ పనిని వెంటనే చేయండి. ఈ వార్త మీడియావాళ్లకు తెలిస్తే పెద్ద ఇష్యూ అయిపోతుంది" అంటూనే వెంకటరమణ లేచి నిల్చున్నాడు.

"అలాగే ఇన్‌స్పెక్టర్! గోపాల్‌ను ఇప్పుడే పిలిపించి మాట్లాడ్తాను" అన్నాడు ప్రిన్స్‌పాల్.

వెంకటరమణ వెళ్లిపోయాడు.

ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావుకు వెంటనే సూర్యారావు గుర్తొచ్చాడు. ఇది సూర్యారావు చేసిన పనే. సందేహం లేదు.

అతడు వెంటనే ఆఫీసు సూపర్నెంట్‌ను పిలిచాడు.

"మన గోపాల్ నామీద ఈ ఊరి పోలీసు స్టేషన్లో కంప్లెయింటిచ్చాట్ట"

"వాడంత సాహసం చేసిండా సార్!" అన్నాడు సూపర్నెంట్.

"వాడిని వెంటనే పిలిపించాలి"

"వాడు తాగి ఎక్కడ పడున్నడో సార్. రేపు మార్నింగ్ పిలిపిద్దాం"

"లేదు. వాడితో అర్జెంట్‌గా మాట్లాడాలె. వాడితో ఆ కంప్లెయింట్ విత్‌డ్రా చేయించాలె"

"వాడిని పిలిపించటం కంటే వాడి భార్యను పిలిపిస్తే పనవుతుంది సార్"

"అదెలా?"

"వాడి భార్య చాలా మంచిది సార్. తాగుబోతోనితో వేగలేక చస్తోంది. ఇదివరకటి ప్రిన్స్‌పాల్‌తో చాలాసార్లు మొరపెట్టుకుంది, జీతం వాడి చేతికివ్వొద్దని. జీతం చేతిలో పడగానే మొత్తం తాగుడు మీద తగలేస్తున్నాడని చెప్పింది. జీతం తనే వచ్చి తీసుకుంటానని.. అట్లా అయితేనే తనకు, తన పిల్లలకు పస్తులుండే పరి

## కొత్తగాలి...

**కూ'తుర్'**
**మంది**
**కో'డల్'**
**గా వుంది**

– గుడిమెట్ల గోపాలకృష్ణ,
అరసవిల్లి

స్థితి తప్పుతుందని అంది. కానీ ఆ ప్రిన్స్‌పాల్ -వాడి జీతాన్ని నీకెల్లా ఇస్తాం? రూల్స్ ఒప్పుకోవు- అన్నాడు. ఆమె ఎంత ఏడ్చి మొత్తుకున్నా ఆయన ఒప్పుకోలేదు.. ఇప్పుడు మీరామెను పిలిపించి నీ భర్త జీతాన్ని నీకే ఇస్తామని చెప్పండి. అప్పుడామె మీరు ఏం చెయ్యమన్నా చేస్తుంది" అన్నాడు సూపర్నెంట్.

"తర్వాత ఆమె వాడిచేత ఎక్విటెన్స్ ఫామ్సులో సంతకం చేయిస్తుందా? " అన్నాడు ప్రిన్స్‌పాల్.

"చేయిస్తుంది సార్. ఆ విషయం నాకొదిలేయండి. వాడితో నేను సంతకం చేయిస్తాను" అన్నాడు సూపర్నెంట్.

"అయితే ఆమెను పిలిపించండి" అన్నాడు ప్రిన్స్‌పాల్.

అరగంటలో ఓ పాతికేళ్ల స్త్రీ వచ్చి ప్రిన్స్‌పాల్ ముందు నిల్చుంది.

"ఈమే సార్ గోపాల్ భార్య.. ఈమె పేరు రాధ.. వీళ్లు మన కాలేజికి దగ్గర్లోనే ఉంటారు" అన్నాడు సూపర్నెంట్.

రాధ ప్రిన్స్‌పాల్‌కు చేతులు జోడించి నమస్కారం చేసింది.

ప్రిన్స్‌పాల్ కాస్సేపు రాధకేసి చూస్తూ ఉండిపోయాడు.

కాయకష్టం చేసుకొని బతికే స్త్రీలు ఎలా ఉంటారో రాధ కూడా అలాగే ఉన్నా కాస్త వేరుగా కనిపించింది. ఆమె కట్టుబొట్టు చూస్తే ఆమె మీద గౌరవం కల్గించేలా ఉన్నాయి.

"నీ భర్త గోపాల్ ఇప్పుడెక్కడున్నాడు? "

"ఇంట్లోనే చచ్చిండు సారూ! ఇయ్యాళ ఏమొచ్చిందో, లేచినప్పట్నించి తాగుతూనే ఉన్నాడు. తాగి డ్యూటీకి పోవద్దని ఎంత చెప్పినా వినకుంటొచ్చిండు. కొత్త ప్రిన్స్‌పాల్ నన్ను సస్పెండ్ చేసిండని ఇంటి కొచ్చి ఒక్కటే ఏడ్చిండు. మంచిపని చేసిండ్రు సారూ. వానికి అట్లనే గావాలె.. ముదనష్టపోడు.. పైసలు చేతులబడ్తె చాలు.. గుడుంబా షాపునకు బోతడు.." అంది రాధ.

"వానితో తాగుడు మానిపించలేవా? "

"చానా ప్రయత్నం చేసిన సారూ? వాడు తాగుడు మానాలంటే ఒక్కటే పని చెయ్యాలె. వాని చేతులకు పైసలు రావొద్దు. మీకంటె ముందున్న ప్రిన్స్‌పాల్ తోటి చెప్పిన సారూ. నెలనెలా వచ్చి ఆ జీతం నేను తీసుకుంటానని, వాని జీతం నాకివ్వండ్రి అని బతిమాలిన సారూ.. ఆయన ఒప్పుకోలే. వాడు జీతం చేతలబడగానే గుడుంబా షాపుకు పరిగెత్తుడే నాయె. గుడుంబా షాపోడు వీనికి ఖాతా మీద కూడా గుడుంబా పోస్తడు. వీనికసలు జీతమే వస్తలేదని తెలిస్తే గుడుంబా షాపోడు ఖాతా బెట్టడు" అంది రాధ.

"ఈ నెలనుండి వాని జీతం నీకే ఇచ్చే ఏర్పాటు నేను చేస్తా"

"అట్ల చేస్తే నేను చచ్చి మీ కడుపున బుడ్త సారూ! నా ఇద్దరు పిల్లల్ని, నన్ను కాపాడిన దేవుడు మీరు అనుకుంట. అట్ల నిజంగ చేస్తరా సారూ? "

"ఈరోజు గోపాల్ బాగా తాగి కాలేజి కొచ్చి స్టూడెంట్స్‌నూ, లెక్చరర్లనూ డబ్బుల డుక్కుంటూ కనిపించాడు. మరోసారి తాగి కాలేజికొస్తే సస్పెండ్ చేస్తనని చెప్పాను. నా దగ్గరకొచ్చి కాళ్లు పట్టుకోబోతే గుడుంబా కంపు భరించలేక వాడిని నా దగ్గరకు రావొద్దని నెట్టేసిన. తాగిన మత్తులో కింద పడిపోయాడు. ఇదీ జరిగింది. ఈ మాత్రానికే వాడు పోలీసుస్టేషన్‌కు వెళ్లి నేను వాడిని కొట్టానని, కులం పేరుతో దూషించానని కంప్లెయింటిచ్చాడట"

"అంతపని చేసిండా? ఇది వాడు చేసిన పనికాదు సార్. వాడు తాగుబోతేగని చెడ్డోడు కాదు. మీమీద కంప్లెయింటిచ్చేంత ధైర్యం వాడు చెయ్యడు. వాడిచేత ఇంకె



వరో ఈ పని చేయించిండ్రు"

"ఎవరు చేయించారో నేను తెలుసుకుంటాను గానీ నువ్వు వెంటనే వాడిచేత వాడిచ్చిన కంప్లెయింటును వాపసు తీసుకునేటట్టు చెయ్యాలి"

"ఇప్పుడే చేపిస్త సారూ! ఇప్పుడే వాన్ని పోలీసు స్టేషన్‌కు గుంజుకపోత. మీ మీదిచ్చిన షికాయత్‌ను వాపసు తీసుకునేటట్టు చేస్త. వాడు నేను చెప్తే వింటడు సారూ! తాగకుంట మంచిగున్నప్పుడు ఎంత బుద్ధిగుంటడనుకున్నరు! ఇగ తాగనని, జీతం తెచ్చి నీ చేతికే ఇస్తనని, మన పిల్లల్ని మంచిగ చదివించుకుందామని చెప్తడు. తాగంగనే అన్ని మరచిపోతడు.

మా కాలేజికి చాలా మంచి ప్రిన్సిపా లొచ్చిండని మీ గురించి గొప్పగా చెప్పిండు సారూ! నేనిప్పుడే బోయి వాన్ని పోలీసుస్టే షన్‌కు తీసుకపోత. నెలనెలా వాని జీతం నాకే ఇప్పిస్తరుగదా సారూ? "

"నీకే ఇప్పిస్త. వాన్ని సస్పెండ్ కూడా చెయ్యను. అలాగైనా వానితో తాగుడు మానిపించు"

"జీతం నా చేతుల పడనీయుండ్రి సారూ! వాడు తాగుడెట్ల మానడో నేను జూస్త" అంటూనే రాధ ప్రిన్స్‌పాల్‌కు నమ స్కారం చేసి వెళ్ళిపోయింది.

'మిస్టర్ సూర్యారావు! నువ్వే తెలి వైనవాడిననుకుంటున్నావు కదూ! నీకంటే తెలివైనవాళ్ళు వుంటారని నువ్వూహించలేక పోయావు కదూ! చాలా ఏళ్ళుగా ఈ ఊర్లో పాతుకుపోయావు. నువ్వే ఈ కాలేజికి ప్రిన్స్‌పాల్‌ను అనుకుంటున్నావు. నిన్నీ ఊర్నించి పంపించకపోతే నా పేరు వెంక టేశ్వరరావే కాదు' అని అనుకున్నాడు ప్రి న్స్‌పాల్ తనలోతనే.

ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు వెంటనే ఆఫీసు సూపర్నెంట్‌ను పిలిపించాడు.

"ఆ సూర్యారావుక్కూడా ఒక మెమో ఇష్యూ చేయండి. ఈ రోజు ప్రిన్స్‌పాల్‌తో చాలా అమర్యాదగా ప్రవర్తించాడని, కాలేజి వ్యవహారాల్లో జోక్యం చేసుకుంటూ విద్యా ర్థుల్ని, బోధనేతర సిబ్బందిని ప్రిన్స్‌పాల్ మీదకు ఉసిగొల్పుతున్నాడని, అతని కారణంగా కాలేజిలో అకడమిక్ వాతావ రణం డిస్టర్బ్ అవుతున్నదని, అతని మీద క్రమశిక్షణా చర్య ఎందుకు తీసుకోకూడదో, వారం రోజుల్లోగా సమాధానం ఇవ్వాలని, ఆ సమాధానం సంతృప్తికరంగా లేనిప క్షంలో పై అధికారులకు రాసి అతని మీద సరైన చర్య తీసుకుంటామని రాయండి. ఈ లెటర్ని వెంటనే డీటీపీ చేయించి తీసు కురండి" అన్నాడు.

"టైపిస్టు సుజాత ఇంతకుముందే వెళ్ళిపో యింది సార్!" అన్నాడు సూపర్నెంట్.

"అలా ఎలా వెళ్ళిపోయింది? నేను కాలేజిలో ఉన్నంతసేపూ ఆఫీసు స్టాఫంతా ఆఫీసులోనే ఉండాలని, నేను వెళ్ళిపోయాకే వెళ్లాలన్న ఇంగితజ్ఞానం లేదా ఆమెకు. ఆమె మీద కూడా నేను యాక్షన్ తీసుకుం టాను. దిసీజ్ టూమచ్!"

"పాపం.. ఆడవాళ్ళు కదా సార్. సుజాతకో పాప ఉందట. ఆ పాప స్కూలు నుండి వచ్చే టైమ్‌కు ఈమె ఇంట్లో ఉండాలి. సుజాత చాలా మంచ మ్మాయి సార్. చాలా సిన్సియర్‌గా పనిచే స్తుంది. వెళ్ళమని నేనే ఆమెకు పర్మిషని చ్చాను సార్" అన్నాడు సూపర్నెంట్.

"పర్మిషనివ్వటానికి నువ్వెవరు? నా పర్మిషన్ లేకుండా ఈ కాలేజిలో ఏమీ జర గకూడదు. సుజాత చాలా మంచమ్మా యని సర్టిఫికెటిచ్చేశారన్నమాట? నన్నడిగితే అసలీ ఆడవాళ్ళకు ఉద్యోగాలివ్వకూడదు. వాళ్ళకు పనిమీద ఉండాల్సినంత శ్రద్ధ ఉండదు. ఎంతసేపూ ఏ చీర కట్టుకుందా మా.. ఎలా అలంకరించుకుందామా అన్న దాని మీదనే వాళ్ల దృష్టి ఉంటుంది. పిల్ల లంటరు, పెళ్ళిళ్ళంటారు, పేరంటాలం టారు. ఎప్పుడు వెళ్ళి ఇంట్లో పడిపోదామా అని ఎదురు చూస్తుంటారు. ఇప్పుడు

## కొత్తగాలి...

**మనసంతా మురికి**
**బట్టలనిండా సెంటు**
**తనదాకా వస్తే సెంటిమెంటు**
**కాకపోతే సెటిల్‌మెంటు**

– జి.వి.ఎస్. ప్రియంవద,
శ్రీకాకుళం

చూడండి.. అర్జెంట్‌గా ఈ మెమో టైప్ చెయ్యాలి. రేపతడు కాలేజికి రాగానే దీన్ని అతనికి సర్వ్ చేద్దామనుకున్నాను.."

"రేపు సుజాతను ఓ అరగంట ముందే రమ్మంటాను సార్. సూర్యారావుగారు వచ్చేటప్పటికి మెమో టైపయిపోతుంది సార్" అన్నాడు సూపర్నెంట్.

"అలా చెయ్యండి. మీరు పర్మిషన్ ఇచ్చా నన్నారు కాబట్టి ఈసారికి ఆమెను క్షమిస్తు న్నాను. మరోసారి ఆఫీసర్ ఆఫీసులో ఉండగా ఎవరూ వెళ్లొద్దని చెప్పండి. అంత ఎమర్జెన్సీ ఏదన్నా వస్తే నా పర్మిషన్ తీసుకుని వెళ్ళాలని చెప్పండి"

"అలాగే సార్" అన్నాడు సూపర్నెంట్.

సాయంత్రం ఏడు గంటలవుతుండగా ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు తన కార్లో ఇంటికి బయల్దేరాడు.




**వెం**కటేశ్వరరావు కారు దిగి ఇంట్లో అడుగు పెట్టగానే అతనికి వాళ్ళ బావమ రిది కమలాకరరావు, వాళ్ళక్కయ్య లక్ష్మితో చాలా హుషారుగా మాట్లాడుతూ కనిపించాడు. వెంకటేశ్వరరావును చూడ గానే వాళ్ళు నిశ్శబ్దంగా మారిపోయారు.

"నన్ను చూడగానే మాట్లాడుకోవడం మానేశారేమిటి? నేను వినకూడని రహ స్యాలా? " అన్నాడు వెంకటేశ్వరరావు.

"మీరు వినకూడని రహస్యాలంటూ మాకేమీ లేవు. కాఫీ తెమ్మంటారా? ఎక్క డైనా తాగే వచ్చారా? " అంది లక్ష్మి.

"తాగొస్తే మాత్రం ఇంటికొచ్చిన భర్తకు కాఫీ ఇవ్వవా? "

"ఒకసారి ఇంటికి రాగానే కాఫీ తెచ్చిస్తే 'అక్కర్లేదు. నేను కాఫీ తాగే వచ్చా'నని కసురుకున్నారు.. అందుకే అలా అడి గాను" అంది లక్ష్మి.

"ఈ రోజు కసురుకోనులే. తమ్ముడొచ్చి న సంతోషంలో ఉన్నావు. కసురుకుంటే నొచ్చుకుంటావుగానీ కాఫీ తెచ్చిస్తే సంతోషి స్తాను" అన్నాడు వెంకటేశ్వరరావు.

"అలాగే" అంటూ వంటగదిలోకెళ్ళింది.

"ఏరా కమలాకర్! హైదరాబాద్ నుండి ఎప్పుడొచ్చావు? " అన్నాడు వెంకటేశ్వరరావు.

"ఇంతకుముందే వచ్చాను బావా? " అన్నాడు కమలాకర్.

"అమెరికాకు వెళ్ళే ప్రయత్నంలో ఉన్నా వని తెలిసింది.. వీసా వచ్చిందా? "

"వచ్చింది బావా"

"ఎప్పుడెళ్తున్నావు? "

"ఈనెల 28న ప్రయాణం.. టికెట్స్ కూడా తీసుకున్నాను"

"అమెరికాకు వెళ్లే ఖర్చంతా మీ మామ గారే భరిస్తున్నారట కదా! అమ్మాయినె ప్పుడు తీసికెళ్తావు? "

"నేను కాస్త సెటిల్ కావాలె కదా! మూడునెలల తర్వాత వచ్చి తీసుకెళ్తాను"

"అది సరేగాని నిన్నో మాట అడుగు తాను.. నిజం చెబుతావా? "

"అడగండి బావా? "

"మా పవన్‌గాడెక్కడున్నాడో నీకూ, మీ అక్కకూ తెలుసు. నాకు తెలియకూడదని చెప్పడంలేదు.. అవునా? " అన్నాడు

"లేదు బావా, పవన్ గురించి నాకేమీ తెలీదు. అక్కక్కూడా ఏమీ తెలీదు"

కమలాకర్ కొంచెం తడబడ్తూ చెప్ప డాన్ని వెంకటేశ్వరరావు గమనించాడు.

"ఎందుకురా అలా తడబడ్తున్నావు? "

"తడబడటంలేదు బావా! నిజంగా నాకు తెలీదు" అన్నాడు కమలాకర్ భయం భయంగా.

ఇంతలో అక్కడికి కాఫీ కప్పుతో లక్ష్మి వచ్చింది.

"వాడినేమడుగుతున్నారు? వాడలా భయపడిపోతున్నాడెందుకు? " అంది లక్ష్మి అతడి చేతికి కాఫీ అందిస్తూ.

"ఎందుకు భయపడిపోతున్నాడో వాడినే అడుగు"

"మిమ్మల్ని చూస్తే ఎవరైనా భయపడ్తారు. అందర్నీ భయపెట్టడం మీ స్వభావం కదా!" అంది లక్ష్మి.

"నన్ను చూసి ఎందుకు భయపడ్తారు? నువ్వైతే భయపడవు కదా! ఒకటంటే రెండనడం నీకలవాటైపోయింది"

"ఇక మొదలెట్టండి మీ సాధింపు. నన్ను చూస్తే చాలు మీకేదో ఒకటి అనబుద్ధవుతుంది. ఇంతకూ వాడినేమడిగారు? "

"ఏమీ అడగలేదు.. అమెరికాకు ఎప్పుడు వెళ్తున్నావని అడిగాను"

"అంతమాత్రానికే వాడెందుకలా అయిపోతాడులెండి. ఏరా కమలాకర్! ఆయన నిన్నేమడుగుతున్నాడు? "

"పవన్ ఎక్కడున్నాడో నీకూ, మీ అక్కకూ తెలుసుకదా? అని బావగారు అడుగుతున్నాడక్కా? " అన్నాడు.

"అనుకున్నాను. నెలరోజుల్నుంచి కన్నకొడుకు కనబడకుండా ఎక్కడికో వెళ్ళిపోతే మీకు చీమకుట్టినట్టయినా లేదు. పైగా వాడిని నేను ఎక్కడికో పంపించానని మీ అనుమానం. మీరసలు తండ్రేనా? ఏ తండ్రయినా కన్నకొడుకుపట్ల ఇంత క్రూరంగా ప్రవర్తిస్తాడా? ఎంతో పేద వాళ్ళు కూడా తమ పిల్లల్ని వాళ్ళు కోరుకున్న చదువులు చదివిస్తున్నారు. అన్నీ ఉండి కూడా మీరు వాడిని వాడు కోరుకున్న చదువును చదివించనని భీష్మించుకొని కూర్చున్నారు. వాడు బాధతో ఇల్లు విడిచి వెళ్ళిపోయినా మీరు చలించడం లేదు. ఓ బండరాయికైనా దయా, జాలి ఉంటాయేమోకానీ మీకు మాత్రం అవి లేవు. మీరు చేస్తున్న ఉద్యోగం తప్ప మీకు మరో ప్రపంచమంటూ లేదు" అంటూ లక్ష్మి కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

కాస్సేపాగి, "వాడెక్కడున్నాడో? ఏమైపోయాడో? ఎన్ని కష్టాలు పడుతున్నాడో? అని నేను రాత్రింబవళ్ళు వాడిని గురించే ఆలోచిస్తూ.." అంటూ భోరుమని ఏడ్వటం మొదలెట్టింది.

"ఊరుకో అక్కయ్యా! ఊరుకో! నెలరోజుల నుండి నీకు తిండీ లేదు, నిద్రా లేదు. పవన్ మీద బెంగపెట్టుకొని నీ ఆరోగ్యాన్ని పాడు చేసుకుంటున్నావు" అన్నాడు కమలాకర్.

"నేను ఈ హాల్లో కాలుపెట్టేంతవరకు అక్కాతమ్ముళ్ళిద్దరూ హాయిగా కబుర్లు చెప్పుకుంటూ నవ్వుతూ కనిపించారు. నన్ను చూడగానే ఇద్దరి మొఖాలూ మారిపోయాయి. దీని అర్థం ఏమనుకోవాలి? " అన్నాడు వెంకటేశ్వరరావు.

"ఏమన్నా అనుకోండి. మీ ఇష్టమొచ్చినట్టు అనుకోండి.. నా కొడుకును మాత్రం తెచ్చివ్వండి. ఇంకో వారంరోజులు టైమిస్తున్నాను. ఆలోగా నా కొడుకు రాకపోతే నేను ఉరేసుకొని చచ్చిపోతాను" అంది ఏడుస్తూ లక్ష్మి.

"మీరిప్పటికైనా ఓ పేపర్ ప్రకటన ఇవ్వండి బావగారూ! 'నీ ఇష్టప్రకారమే నిన్ను మెడిసిన్ చదివిస్తాను. నువ్వు వెంటనే ఇంటికొచ్చెయ్యరా పవన్' అని వాడి ఫొటోతో అన్ని పేపర్లలోనూ, టీవీ ఛానెల్స్‌లోనూ ప్రకటించండి. పవన్ ఎక్కడున్నా ఆ ప్రకటన చూసి వెంటనే ఇంటికి తిరిగొస్తాడు" అన్నాడు కమలాకర్.

"అలాంటి ప్రకటన నేనిస్తానని ఎలా అనుకుంటున్నావురా మైడియర్ బ్రదరిన్ లా? ఈ కార్పొరేట్ కాలేజీలకు, ఈ డొనేషన్లకు నేను బద్ధవ్యతిరేకినని నీకు తెలుసు కదరా..? " అన్నాడు వెంకటేశ్వరరావు.

"తెలుసు బావా! కానీ ఒక్కగానొక్క కొడుకు కోసం మీరీమాత్రం కాంప్రమైజ్ కాకపోతే ఎలా? మీ ప్రిన్స్‌పుల్స్ కోసం కన్నకొడుకును పోగొట్టుకుంటారా? పవన్ ఇంటికి రాకపోతే మా అక్కయ్య ఏమైపోతుందో ఊహించారా? ప్లీజ్ బావగారూ! ఈ ఒక్క విషయంలో మీరు కాంప్రమైజ్ అవ్వాలి. పవన్ కోసం, మా అక్కకోసం.. ప్లీజ్" అన్నాడు కమలాకర్.

"చూద్దాంరా కమలాకర్! మీ అక్కయ్య వారంరోజుల టైమిచ్చింది కదా! ఈ వారం రోజుల్లో ఏం జరుగుతుందో చూద్దాం.."

"వారంరోజుల్లో మీరు నా శవాన్ని చూస్తారు. నాకు తలకొరివి పెట్టడానికైనా వాడొస్తాడేమో చూడండి" అంది లక్ష్మి హాల్లోంచి లోపలి గదిలోకెళ్తూ.

"ఒరేయ్ కమలాకర్! నేను మీ అక్కయ్యకు చెప్పనుగానీ, పవన్‌గాడెక్కడున్నాడో చెప్పరా? వాడి ఆచూకీ నీకు తెలుసునని నాకు తెలుసురా! నువ్వూ, మీ అక్కయ్యా కలిసి ఏదో నాటకమాడుతున్నారని నాకు నా అంతరాత్మ చెబుతోంది.."

"గాడ్‌ప్రామిస్ బావా! పవన్ గురించి నాకేమీ తెలీదు.."

"నీకు గాడ్‌మీద, ప్రామిస్సుల మీద నమ్మకం లేదని నాకు తెలుసులేరా! నువ్వు మర్యాదగా చెప్పకపోతే నేను మరో విధంగా తెలుసుకుంటాలేరా!"

"మరోవిధంగా అంటే..? "

"నీ సెల్‌ఫోన్ ఒకసారి చూస్తే తెలిసిపోతుందిరా! నువ్వు పవన్‌కు ఈ నెలరోజుల్లో ఎన్నిసార్లు ఫోన్లు చేశావో? చూస్తాను. నీ సెల్‌ఫోన్ ఒకసారి ఇవ్వరా! డయల్డ్ నెంబర్స్ ఒకసారి చూస్తాను"

"నా సెల్‌ఫోన్ ఇవ్వాలా? లేదు బావా.. నా దగ్గరసలు సెల్‌ఫోనే లేదు. ఈ మధ్య సెల్‌ఫోన్ వాడటమే లేదు"

కమలాకర్ ఈ మాట అంటుండగానే అతడి జేబులో ఉన్న సెల్‌ఫోన్ మోగింది.

వెంకటేశ్వరరావు "ఏమిట్రా అది.. సెల్‌ఫోన్ కాదా? " అన్నాడు.

"సారీబావా! సెల్‌ఫోన్ లేదని అబద్ధం చెప్పాను. కానీ నేను పవన్‌కు ఫోన్లు చెయ్యడంలేదు. లావణ్య ఫోన్ చేసినట్టుంది" అన్నాడు కమలాకర్, 'హల్లో లావణ్యా!' అంటూ హాల్లోంచి బయటకు వెళ్ళబోతూ.

## కొత్తగాలి... 

నేడు
టీవీ గలగల..
పుస్తకం
వెలవెల

– జి. శ్రీశైలం,
పెద్దవెల్మెడ, మెదక్‌జిల్లా

అతని వెంటే వెంకటేశ్వరరావు వెళ్ళాడు.

కమలాకర్ పరిగెత్తుతున్నట్టుగా బయటకు, ఇంటి మెయిన్‌గేటు దాటి రోడ్డుమీదకు వెళ్ళి సెల్‌ఫోన్లో మాట్లాడసాగాడు.

పదిహేను నిమిషాల తర్వాత కమలాకర్ మళ్ళీ ఇంట్లోకొచ్చాడు.

అంతసేపు వెంకటేశ్వరరావు అతన్నే చూస్తూ హాల్ బయటే నిల్చున్నాడు.

"ఇక్కడ నిల్చున్నారేం బావా? కాలేజిలో బాగా అలసిపోయి వచ్చారు, వెళ్ళి రెస్ట్ తీసుకోకూడదు? " అన్నాడు కమలాకర్.

"రెస్ట్ తీసుకుంటారా! ఈ టైమ్‌లో మీ అక్క చాలా హైసౌండ్‌తో టీవీ పెట్టుకొని

సీరియల్సన్నీ చూస్తుంటుంది. ఆ హైసౌండ్లో రెస్ట్ ఎలా సాధ్యమౌతుందిరా? అది సరేగాని నీ సెల్‌ఫోన్ ఒకసారివ్వరా.."

"ఎందుకు బావా?"

"ఇప్పుడు నీకు ఫోన్ చేసిందెవరో చూడాలి"

"చెప్పానుగా బావా.. లావణ్య.. నా బెటర్‌హాఫ్. లావణ్య ఫోన్ చేసింది బావా!"

"వాళ్ళు మన బెటర్‌హాఫ్‌లు కార్రా.. బ్యాడ్‌హాఫ్‌లు. కొత్త మురిపెం కాబట్టి నీకిప్పుడు నీ భార్య బెటర్‌హాఫ్‌లాగే కనిపిస్తుంది. నాల్గురోజులు పోతే బ్యాడ్‌హాఫ్‌గా మారుతుంది. పెళ్ళెందుకు చేసుకున్నానని కన్నీరు పెట్టుకునే రోజులొస్తాయి. అది సరే, ఇప్పుడు ఫోన్ చేసింది నీ బెటర్ హాఫో.. బ్యాడ్‌హాఫో చూస్తాను. నీ సెల్ ఫోన్ ఇటివ్వు"

"వద్దు బావా.. భార్యాభర్తలన్నాక ఏవో స్వీట్ నథింగ్స్ మాట్లాడుకుంటాం. వాటిని మీరు వింటే బావుండదు"

"మీరేం మాట్లాడుకున్నారో వింటానన డం లేదురా. ఎవరు మాట్లాడారో చూస్తాను. నీ కిప్పుడు ఫోన్ చేసింది మా పవన్‌గాడేనని నా అనుమానం. నా అనుమానాన్ని నివృత్తి చేసుకోనీయ్. కమాన్.. గివ్ ఇట్ టు మీ"

"వద్దు బావా! అక్కయ్య నన్ను చంపేస్తుంది" అంటూ కమలాకర్ అక్కడ్నించి కదలబోయాడు.

"అక్కయ్య కాదు.. ఇప్పుడు నాకాఫోన్ ఇవ్వకపోతే నేను నిన్ను చంపేస్తాను. పెద్దవాడిగా నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను, ఆ ఫోన్ ఇటివ్వు. లేకపోతే ఇప్పుడే మీ డాడీకి ఫోన్‌చేసి నువ్వు నామాట విన్లేదని, నువ్వు నాతో మిస్‌బిహేవ్ చేశావని చెబుతాను. రేపు నిన్నాయన అమెరికాకు ఎలా పంపిస్తాడో చూస్తాను!"

"మీతో మిస్‌బిహేవ్ చేశానని తెలిస్తే మా డాడీ నన్ను క్షమించడు. మీ మాటంటే డాడీకి వేదం. ఇంతదాకా వచ్చింది కాబట్టి మీకు నిజం చెప్పేస్తాను బావా. కానీ నేనే మీకిదంతా చెప్పినట్టు మీరు అక్కకు చెప్పొద్దు. అక్కకు నా పేరు చెప్పనని ప్రామిస్ చెయ్యండి బావా!"

"ప్రామిస్‌రా! మీ అక్కకు చెప్పను. విషయమేమిటో చెప్పు త్వరగా"

"ఈ నిజం చెబితే మీరు షాకవుతారేమో బావా!"

"షాకవ్వను.. చెప్పు"

"అక్క నన్నెంత తిడ్తుందో బావా"

"అక్కేకదా.. తిడితే పడుదువుగానిలే. ఇంకా తాత్సారం చెయ్యకుండా చెప్పేస్తావా? ఇలాగే నాన్చుతావా?"

"చెప్పేస్తాను బావా! పవన్ హైదరాబాద్‌లో ఈ మధ్యనే ఓపెన్ అయిన ఓ కార్పొరేట్ మెడికల్ కాలేజిలో చేరిపోయాడు బావా!"

"ఈజిట్? ఎలా చేరాడు? వాడికంత డబ్బు ఎవరిచ్చారు?"

కమలాకర్ చెప్పిన వార్త వినగానే ప్రిన్స్‌పాల్ నిజంగానే షాకయ్యాడు. పవన్ కనిపించకుండా పోయినప్పట్నించి వాళ్ళమ్మే వాడినెక్కడికో పంపించిందని ఊహించాడు. తనతో వాడిని రమ్మంటూ, మెడి

## కొత్తగాలి...

**తలుపులు అద్దాలైనప్పుడు**
**మూసినా తెరచినా**
**అట్టే.. తేడా ఉండదు**

– బేతంచర్ల శ్యామ్‌సుందర్,
వినుకొండ

కల్ కాలేజిలో చేర్పిస్తానంటూ ప్రకటన ఇప్పించాకే వాడిని ఇంటికి రప్పిస్తుందని అనుకున్నాడు తప్ప వాడు ఈపాటికే ఏ మూడు లక్షలో చెల్లించి మెడికల్ కాలేజిలో జాయినయ్యాడని ఊహించలేదు.

"వాడికంత డబ్బు ఎక్కడ్నించి వచ్చిందో నాకు తెలీదు బావా! అక్కకు తెలుసు. అక్కే ఆ డబ్బు అరేంజ్ చేసి ఉంటుంది" అన్నాడు కమలాకర్.

"దాని దగ్గర మాత్రం అంత డబ్బు ఎక్కడుంది? నాకు చెప్పకుండా, నా పర్మిషన్ లేకుండా అదింత సాహసానికొడిగడ్తుందా? నన్నింత మోసం చేస్తుందా? దాన్నీ జన్మలో క్షమించను" అంటూ అతడు "లక్ష్మీ" అంటూ పెద్దగా అరుస్తూ టీవీ ఉన్న రూంలో కెళ్ళాడు.

"పోనీయండి బావా. లైట్ తీసుకోండి. రేపు మన పవన్ డాక్టరయితే మంచిదే కదా!" అంటూ అతన్ని అనుసరిస్తున్న కమలాకర్ మాటల్ని అతడు వినిపించుకోలేదు.

పెద్దసౌండ్‌తో టీవీలో వస్తున్న సీరియల్ చూస్తున్న లక్ష్మికి భర్త కేకలు, అతడొచ్చి ఆమె పక్కనే నిల్చొని ఆమె చెవిలో "లక్ష్మీ!" అంటూ అరిచేంతవరకు వినిపించనేలేదు. టీవీ ప్రపంచంలో విహరిస్తున్న ఆమె అతడలా అరిచేటప్పటికి తుళ్ళిపడి ఈ ప్రపంచంలో కొచ్చి,

"ఏమైంది? ఎందుకలా అరుస్తున్నారు? కాస్సేపు నన్నీ టీవీ కూడా చూడనివ్వరా? " అందామె బోల్డు చిరాకుతో.

"టీవీ చూడనివ్వటం కాదు, నువ్వసలు ఈ ఇంట్లోనే ఉండటానికి వీల్లేదు. వెళ్ళిపో! ఈ క్షణమే ఇంట్లోంచి బయటకెళ్ళిపో. ఇంకొక్క క్షణం కూడా నువ్వీ ఇంట్లో ఉండటానికి వీల్లేదు.. గెటౌట్.. గెటౌట్" తన శక్తినంతా కూడదీసుకొని అరిచాడతడు.

"ఈ ఇంట్లోంచి వెళ్ళిపొమ్మనే అధికారం మీకుందనుకుంటున్నారా? ఈ ఇంట్లో ఉండటానికి మీకెంత హక్కుందో నాకూ అంతే ఉంది. మీరు నన్ను ఇంట్లోంచి వెళ్ళగొట్టేంత తప్పు నేనేం చేశాను? " ఆమె కూడా పెద్దగా అరిచింది.

"ఏం చేశావా? నాకు తెలీకుండా, నేను అంగీకరించనని తెలిసికూడా నీ కొడుకును మెడిసిన్‌లో చేర్పిస్తావా? ఎంత సాహసం! ఎంత బరితెగించావు? ఇలాంటిదేదో చేశావని నేననుకుంటూనే ఉన్నాను"

"ఓహో! మా తమ్ముడ్ని బెదిరించి అంతా తెలుసుకున్నారన్నమాట. అవును, వాడిని మెడిసిన్‌లో చేర్పించాను. చేర్పించకపోతే వాడు స్లీపింగ్‌పిల్స్ మింగి ఆత్మహత్య చేసుకుంటానన్నాడు. నాది మీలా రాతిగుండె కాదు. నేను వాడి కన్నతల్లిని. వాడు అన్నంత పని చేస్తాడని నాకనిపించింది. చూస్తూ చూస్తూ ఏ తల్లీ తన కన్న కొడుకును పోగొట్టుకోవడానికి సిద్ధపడదు. ఎంత త్యాగమైనా చేసి కొడుకును కాపాడుకుంటుంది. నేనూ ఆ పనే చేశాను. నేను చేసిన పని మీకు ఆగ్రహం తెప్పిస్తుందని తెలుసు. నా గొంతు పిసికి చంపడానిక్కూడా వెనకాడరని తెలుసు. అయినా నేను నా కొడుకును కాపాడుకోవడానికి ఈ పని చేశాను. మీరు నన్నేం చేసినా ఫరవాలేదు. నన్ను చంపేయండి, పెట్రోలుపోసి

### కొత్తగాలి...

**వద్దు వద్దన్నా**
**వెళ్లిపోయింది**
**అలా 'తను'వంతా**
**ఉండిపోయింది**

– ఎన్.కె. నాగేశ్వర్,
పెనుగొండ, ప.గో.జిల్లా

తగులబెట్టండి. నా కొడుకు కోసం నేను నా ప్రాణాన్ని పణంగా పెట్టడానికి సిద్ధంగా ఉన్నాను"

"సిద్ధంగా ఉన్నావా? అయితే చావు.. ఇప్పుడే నీ గొంతు పిసికి చంపేస్తాను" అంటూనే అతడొచ్చి రెండు చేతులతో ఆమె గొంతు పట్టుకున్నాడు.

"బావా! బావా! వద్దుబావా. అక్కను ఏమీ చెయ్యొద్దు బావా. కావాలంటే నన్ను చంపండి. అక్కకు ఈ ఐడియా ఇచ్చింది నేనే. ఫలానా కాలేజిలో ఇంకా సీట్లు మిగిలే ఉన్నాయని, ఆ మేనేజిమెంటువాళ్ళు నాకు తెలుసునని, మూడు లక్షలతో పవన్‌కు ఆ కాలేజిలో సీటిప్పిస్తానని నేనే అక్కకు చెప్పాను" అన్నాడు కమలాకర్, వెంకటేశ్వరరావు చేతుల్ని వాళ్ళక్క గొంతు మీదినుండి విడదీస్తూ.

"దొంగ రాస్కెల్! నువ్వా ఈ పనిచేసింది? అంత డబ్బు ఎక్కడ్నించి తెచ్చార్రా? " అన్నాడు వెంకటేశ్వరరావు.

"అక్క నగల్ని బ్యాంకులో పెట్టి రెండు లక్షలు లోన్ తీసుకున్నాం. మరో లక్ష నేను మా మామగార్నడిగి తెచ్చాను" అన్నాడు కమలాకర్.

"నాకు తెలీకుండా ఇంత పెద్ద మొత్తం అప్పు చేస్తారా? నీకా నగల్ని కొనిపెట్టిందెవరే? నీ అబ్బ కొనిపెట్టడా? నీ అమ్మ కొనిపెట్టిందా? నన్ను ఎన్నోసార్లు 'నాకిది కొనివ్వండి.. అది కొనివ్వండి' అని ప్రాణం తీస్తే.. నేనెంతో జాగ్రత్తగా పొదుపు చేసుకున్న డబ్బు పెట్టి కొనిచ్చాను. వాటిని కుదవబెడ్తావా? ఛీఛీ! నీ మొఖం చూస్తేనే అసహ్యం పుడ్తోంది. ఒరేయ్ కమలాకర్! నువ్వు నీ మామ దగ్గర అప్పుచేసి లక్ష ఇచ్చానంటున్నావు. నేనొక్క పైసా కూడా తిరిగి ఇవ్వను. ఆ విషయం ఇప్పుడే మీ మామగార్కి చెప్పేస్తా"

"వద్దుబావా! ఆ డబ్బు నాకే అవసరం ఉందని తెచ్చాను. అప్పుగా తేలేదు. ఆ డబ్బు మీరివ్వాల్సిన అవసరం లేదు. నేనా డబ్బు పవన్‌కోసం తీసుకున్నానని మా మామగార్కి చెప్పొద్దు. ప్లీజ్ బావా.. ప్లీజ్" అన్నాడు కమలాకర్.

"మీరు వాడి మామగార్కి ఈ విషయం చెబితే నేనిప్పుడే చచ్చిపోతాను. నా చావుకు నా భర్తే కారణమని సూసైడ్ నోట్ రాసి చస్తాను." అంది లక్ష్మి.

"చావవే.. చావు. నువ్వూ, నీ తమ్ముడూ కట్టగట్టుకొని చావండి. ఆ చావడం నా ఇంట్లో కాదు, బయటకెళ్ళి చావండి! మీరిద్దరూ ఒక్క క్షణం కూడా నా ఇంట్లో ఉండకూడదు. వెళ్ళండి.. మీకు దిక్కున్న చోటుకు వెళ్ళి చావండి. ఇంకొక్క క్షణంలో మీరీ ఇంట్లోంచి వెళ్ళకపోతే నేనేం చేస్తానో నాకు తెలీదు. వెళ్తారా? లేదా? " పెద్దగా అరిచాడతడు.

"అరేయ్ కమలాకర్! మనం వెళ్దాం పదరా. ఈయనగారొక్కరే ఇంట్లో ఉండనీయ్. పద.. వెళ్ళిపోదాం పద" అందామె బయటకు వెళ్ళటానికి సిద్ధమౌతూ.

"పదక్కా వెళ్దాం. ఈయన కోపం తగ్గాకే వద్దువుగానీ" అన్నాడు కమలాకర్.

"ఈ కోపం తగ్గదు. మీ అక్క చేసిన ఈ ద్రోహాన్ని నేను క్షమించను. మళ్ళీ రావటం అంటూ ఉండదు. ఇక నుండి దాని దారి దానిది, నా దారి నాది" అన్నాడతడు ఆవేశంతో ఊగిపోతూ.

అతడలా అరుస్తూ మాట్లాడుతోంటే విపరీతమైన ఆయాసం వచ్చింది. తల గిర్రున తిరుగుతున్నట్టనిపించింది. మూర్ఛ వచ్చి కింద పడిపోతానేమో అనుకున్నాడు.

"ఇంత కోపం, ఇంత ఆవేశం వద్దు బావా! మీ బీపీ పెరిగిపోతుంది. హై బీపీలో మీకు స్ట్రోకు కూడా రావొచ్చు. ప్లీజ్.. కామ్‌డౌన్.. అక్క చేసిన తప్పేముంది? కొడుకు మెడిసిన్ తప్ప మరేది చదవనని

మొండికేస్తే ఏ తల్లయినా ఏం చేస్తుంది?" అన్నాడు కమలాకర్.

"వద్దు, మాట్లాడొద్దు. దాన్ని సమర్థించొద్దు" అరిచాడతడు, ఛాతీమీద చెయ్యి వేసుకొని ఆయాసపడిపోతూ.

"దయచేసి ఓ బీపీ టాబ్లెట్ వేసుకోండి" అందామె అతనికి దగ్గరగా వచ్చి.

"అక్కర్లేదు. మీరీ ఇంట్లోంచి వెళ్ళిపోతేనే నా బీపీ నార్మల్ అవుతుంది. వెళ్ళండి" అన్నాడతడు.

ఆ అక్కాతమ్ముళ్ళిద్దరూ ఆ రూంలోంచి బయటకొచ్చారు.

"ఆయన బీపీ పేషెంట్. పిచ్చి ఆవేశంతో రగిలిపోతున్నాడు. ఏమైపోతాడో? ఏం చేద్దాంరా కమలాకర్? అతనికీ విషయం ఎందుకు తెలియనిచ్చావు? ఎట్టి పరిస్థితుల్లోనూ అతనికీ విషయం చెప్పొద్దనుకున్నాం కదా?" అంది లక్ష్మి, హాల్లోకి వచ్చాక.

"వాడు.. ఆ పవన్‌గాడు అనవసరంగా నా సెల్‌కు ఫోన్ చేశాడు. ఫోన్ చేసింది వాడేనని ఆయనెక్కడ కనిపెట్టాడోనని ఫోన్ మోగగానే నేను బయటకు పరిగెత్తాను. ఆయన నన్ను ఫాలో అవుతున్నాడని గమనించలేదు. ఆయన మొదట్నించీ అనుమానిస్తూనే ఉన్నాడు కదా! నాకు ఫోన్ చేసింది పవనే అని కనిపెట్టేశాడు. వాడు ఫోన్ చెయ్యకపోతే బావుండేది" అన్నాడు కమలాకర్.

"నువ్విక్కడకొచ్చి వాళ్ళడాడీ పక్కనే ఉన్నావని వాడికి తెలియదు కదా! అంతా కర్మ.. ఈ మొండి మనిషితో ఎలా వేగుతున్నానో, నీకిప్పటికైనా అర్థమయ్యే ఉంటుంది"

"ఇప్పడేం చేద్దామక్కా? అతన్నిలా వది లేసి వెళ్ళిపోదామా? "

"ఓ గంటసేపు అతనికి కనిపించకుండా ఉంటే చాలు, నార్మల్ అవుతాడు. అప్పుడు కనిపిస్తాలే. నువ్వెళ్ళిపోరా. నేనెలాగో అతన్ని మేనేజ్ చేస్తాలే. అతడేమన్నా నోరు మెదపకుండా ఉండాలి. ఐదారురో జుల వరకు మాట్లాడడు. నేనూ మాట్లా డను. తర్వాత అతని అవసరం కోసమైనా అతనికి నాతో మాట్లాడక తప్పదు" అంది లక్ష్మి.

"సరే అక్కా, నేను వెళ్తాను" అంటూ కమలాకర్ బయటకొచ్చాడు.

## 8



**అం**దరికంటే ముందే ఆ మర్నాడు ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు కాలేజికొ చ్చాడు. రాత్రి జరిగిన సంఘటన అతన్ని తీవ్రంగా కలచివేసింది. ఇంట్లోనే తన కెంతో అవమానం జరిగినట్టుగా ఫీల య్యాడు. కట్టుకున్న భార్యే తనకింత ద్రోహం చేస్తుందనుకోలేదు. తనసలు పెళ్ళే చేసుకోకుండా ఉంటే ఎంత బావుం డేది? ఆ లక్ష్మి.. మొదట్నించి ఇంతే. ఏ విషయంలోనూ తనతో సహకరించలేదు.. ఎడ్డెం అంటే తెడ్డెం అనే రకం.. తనేదన్నా ఆమె వ్యతిరేకించేది. కాలికేస్తే మెడకు.. మెడకేస్తే కాలికి.. వెరీ వెరీ ప్రాబ్లమేటిక్ ఉమన్. చాలా కఠినంగా ఉంటే తప్ప ఆ మె తను కోరుకుంటున్నట్టుగా బతకనీయ దని నిర్ణయించుకొని, ఆమెతో చాలా కఠి నంగా ఉంటున్నాడు. అసలీ ఆడవాళ్ళం దరూ ఇంతే. భర్తల్ని గుప్పిట్లో పెట్టుకొని తమకిష్టమొచ్చినట్టుగా ఆడించాలని చూస్తారు. ఇంట గెలిచి రచ్చ గెలువమ న్నారు. తమ ఇంట్లోనే గెలువలేకపోతు న్నాడు. ఇక బయటేం గెలుస్తాడు? ఈ ఆలోచన రాగానే అతని హృదయం ఉడికి పోయింది. తను ఓడిపోతానన్న ఆలోచ నను అతడు భరించలేకపోయాడు. బయ ట్నించి అటెండర్ హుస్సేన్ వచ్చి "గోపాల్ భార్యొచ్చింది సార్. మిమ్మల్ని కలువాలట" అన్నాడు.

"రమ్మను" అన్నాడు.

గోపాల్ భార్య రాధ లోపలకొచ్చింది.

"నమస్కారం సారూ" అంది.

"చెప్పు రాధా!" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"రాత్రంతా ఆ ముదనష్టపోనితోటి పోట్లాడి ఒప్పించిన సారూ. ఇయ్యాల వాడు లేస్తూనే 'ఇప్పుడే వస్త'నని బయటకు బోయి గంట తర్వాతొచ్చిండు. మల్ల పుల్లుగ తాగొచ్చిండు. సూర్యారావు సార్ వద్దంటాండు.. నేను కంప్లెయింట్ విత్‌డ్రా చేసుకోను అంటున్నడు సారూ" అంది రాధ.

'సూర్యారావు వద్దంటాండు' అన్న మాట వినగానే ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావుకు విపరీతమైన కోపమొచ్చేసింది.

"సరే, నువ్వెళ్ళు రాధా. ఆ సూర్యారావు సంగతి నేను చూస్తాలే. నీ మొగుడిక ఇంట్లోనే కూర్చోవాలె. ఈరోజే వాన్ని ఉద్యో గంలోంచి డిస్మిస్ చేస్తా" అన్నాడు.

"అంత పనిచెయ్యకండయ్యా. మీ కాళ్ళు పట్టుకుంటా. ఎట్లనయినజేసి నేను వాన్ని పోలీసుస్టేషన్‌కు తీస్కపోయి నీమీదిచ్చిన కంప్లెయింటును వాపస్ తీసుకునేటట్లు జేస్త. నాకు ఇంకొక్కరోజు టైమియ్యండ్రి

సారూ" అంది రాధ ప్రిన్స్‌పాల్ దగ్గరకొచ్చి అతని కాళ్ళు పట్టుకోబోతూ.

"వద్దు. నువ్వు నా దగ్గరకు రావొద్దు. నీకింకోరోజు టైమిస్తున్నాను, వెళ్ళు" అన్నాడు.

"మంచిదయ్యా. గొర్రెను గుంజుకపోయి నట్టు వాన్ని గుంజుకపోత. ఇయ్యాళ పొద్దుగూకే లోపల వాన్ని మీ దగ్గరకు గుంజుకొస్త" అంటూ రాధ ప్రిన్స్‌పాల్ రూంలోంచి బయటకు వెళ్ళింది.

ప్రిన్స్‌పాల్ రూం ముందునుండి కెమిస్ట్రీ ల్యాబ్ వైపు వెళ్తున్న ఓ విద్యార్థుల గుంపు ప్రిన్స్‌పాల్ రూంలోంచి బయటకొస్తున్న రాధను చూశారు. మంచి యౌవనంలో ఉన్న రాధను చూడగానే ఆ గుంపులో ఉన్న ఓ విద్యార్థి "మన ప్రిన్స్‌పాల్ చాలా బుద్ధిమంతుడనుకున్నాను. రసికుడే! ఓ బ్యూటీని తన రూముకే రప్పించుకుంటు న్నాడు. ఇంట్లో రామయ్య వీధిలో కృష్ణ య్యాలా ఉన్నాడు" అన్నాడు.

అదో పెద్ద జోకన్నట్టుగా మిగతా విద్యా ర్థులంతా గొల్లున నవ్వారు. ఓ విద్యార్థి రాధను చూస్తూ విజిలేశాడు. ఈ గోలంతా లోపలున్న ప్రిన్స్‌పాల్‌కు వినిపించింది. అతడు వెంటనే బయటకొచ్చాడు.

"ఎందుకలా అరుస్తున్నారు? ఇదేమన్నా కాలేజనుకున్నారా? లేక క్రికెట్ గ్రౌండను కున్నారా? వరండాల్లో తిరుగుతూ గోల చెయ్యొద్దని మీకెన్నిసార్లు చెప్పాను. అయినా మీకు బుద్ధిరాలేదు. డర్టీఫెలోస్.. యూజ్‌లెస్ ఫెలోస్.. ఎమ్మెస్సీ చదువుతు న్నారు.. అయినా మీకు కనీస సంస్కారం కూడా లేదు. మీకన్నా వీధుల్లో అడుక్కొని బతికే బిచ్చగాళ్ళు నయం. చదువే కాదు, సంస్కారం కూడా నేర్చుకోవాలి" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"బుద్ధిలేదు.. డర్టీఫెలోస్.. యూజ్‌లెస్ ఫెలోస్.. బిచ్చగాళ్ళు అంటూ ఇష్టమొచ్చిన ట్టుగా మాట్లాడుతున్నారు మీరు. ప్రిన్స్‌పాల్ అయినంత మాత్రాన ఇలా నోరుపా రేసుకుంటే ఊరుకునేవాళ్ళెవరూ లేరిక్కడ. పదిమంది స్టూడెంట్స్ ఒకచోట చేరిన ప్పుడు ఈమాత్రం గోల ఉంటుంది.. అంత మాత్రానికే మమ్మల్ని ఇన్ని మాట లంటారా? " అన్నారు విద్యార్థులు.

"అంటాను. ఈ కాలేజిని ప్రశాంతంగా నడిపించాల్సిన బాధ్యత నామీదుంది. కాలే జంటే ఏమిటనుకున్నారు? ఇదొక పవిత్ర మైన దేవాలయం.."

ప్రిన్స్‌పాల్ ఇంకా ముగించక ముందే

---

## ఆగస్టు - 2011
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **పప్పు శ్రీదేవి**
   - భూపయ్య అగ్రహారం, తూ.గో.జిల్లా
2. **డి. వసుంధరాదేవి**
   - జ్యోతినగర్, కరీంనగర్
3. **ఎన్.వి. రమణి**
   - బంజారాహిల్స్, హైదరాబాద్
4. **వాణి నేమాని**
   - ఎం.వి.పి.కాలనీ, విశాఖపట్నం
5. **కె. రామలింగమూర్తి**
   - ఎపిహెచ్‌బి కాలనీ, తణుకు

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. రాయుడు | 6. దేవరాజు మహారాజు |
| 2. వరాలమ్మ | 7. సీతాకాంత్ మహాపాత్ర |
| 3. పద్మావతి | 8. మార్టిన్ ఆండర్సన్ నెక్సో |
| 4. సుందర్రావు | 9. కాటూరి వేంకటేశ్వరరావు |
| 5. అనుష్క | 10. గోపి |

"ఇదో దేవాలయం, దీంట్లో మీరో దేవుడు!" అన్నాడో స్టూడెంట్. ఆ మాటతో అందరూ గొల్లున నవ్వారు.

"ఏ దేవుడనుకున్నారు.. శ్రీకృష్ణపరమాత్ముడు!" అన్నాడు మరో స్టూడెంట్.

"ఈయన శ్రీకృష్ణుడు.. అలా వెళ్తున్నామె రాధ.. రాధాకృష్ణులు" అన్నాడు మరో విద్యార్థి.

వాళ్ళ నవ్వులతో, ఈలలతో కాలేజంతా మార్మోగిపోయింది.

"షటప్. షటప్ యువర్ డర్టీ మౌత్స్..

కొత్తగాలి...



మరో జన్మ
ఉందో లేదో!
ఆత్మహత్య చేసుకొని
అమ్మ ప్రేమను
కాలరాసుకుంటావా?

– సోమిశెట్టి, కరీంనగర్

డర్టీ ఫెలోస్.. డర్టీ రాస్కెల్స్.. డర్టీ బ్రూట్స్.. మిమ్మల్నందర్నీ ఇప్పుడే ఈ కాలేజి నుండి సస్పెండ్ చేస్తున్నా.." అంటూ ప్రిన్స్‌పాల్ తన రూంలోకెళ్ళిపోయాడు.

అతడలా వెళ్ళిపోగానే విద్యార్థులంతా "ప్రిన్స్‌పాల్.. డౌన్‌డౌన్. ప్రిన్స్‌పాల్.. డౌన్‌డౌన్" అంటూ పెద్దపెట్టున అరిచారు. వాళ్ళ అరుపులు విన్న వేరే క్లాసుల్లో ఉన్న విద్యార్థులంతా బయటకు పరిగెత్తుకొని వచ్చారు. వాళ్ళు కూడా ఏం జరిగిందో తెలుసుకోకుండానే "ప్రిన్స్‌పాల్ డౌన్‌డౌన్.. ప్రిన్స్‌పాల్ డౌన్‌డౌన్" అంటూ అరవటం మొదలెట్టారు.

స్టాఫ్‌రూంలో ఉన్న లెక్చరర్లంతా అక్కడికొచ్చి "ఏం జరిగింది?" అని విద్యార్థుల్ని అడిగారు.

"మేం ల్యాబ్‌కెళ్తూ వరండాలో ఎవరో జోక్‌చేస్తే నవ్వినందుకు ఆయనగారొచ్చి మమ్మల్ని నోటికొచ్చినట్టు తిట్టాడు. మమ్మల్నందర్నీ సస్పెండ్ చేస్తాట్ట. ప్రిన్స్‌పాలయినంత మాత్రాన ఈయనేమనుకుంటున్నాడు? ఏ హిట్లర్‌నో, స్టాలిన్నో అనుకుంటున్నాడా? ఇదివరకున్న ప్రిన్స్‌పాల్ ఎంత మంచివాడు! అప్పుడీ కాలేజి ఎంత బాగా నడిచిందో!" అన్నాడో విద్యార్థి.

"ఈయనగారు మన అటెండెన్స్‌కూ, మన స్కాలర్‌షిప్స్‌కూ లంకెపెడ్తాడట" అన్నాడు మరో విద్యార్థి.

"ఈయనకు మన విద్యార్థుల సత్తా ఏమిటో చూపించకపోతే మనల్ని నాశనం చేసి వదుల్తాడు" మరో విద్యార్థి అనగానే..

"ప్రిన్స్‌పాల్ డౌన్ డౌన్...
ప్రిన్స్‌పాల్ డౌన్ డౌన్.." అంటూ అక్కడికి చేరిన విద్యార్థులంతా పెద్దపెట్టున అరిచారు.

ఇంతలో అక్కడికి సూర్యారావు, భుజంగరావు మొదలైన లెక్చరర్లు కూడా చేరారు. ఏం జరిగిందో తెలుసుకున్నారు. సూర్యారావు కొందరు విద్యార్థులతో దూరంగా వెళ్ళి ఓ మీటింగ్ పెట్టాడు.

"మిమ్మల్ని తిట్టినందుకు అందరిముందు అతడు మీకు క్షమాపణ చెప్పాలి. అటెండెన్స్‌కు, స్కాలర్‌షిప్స్‌కు, ఎగ్జామ్స్‌కు ఎలాంటి సంబంధం ఉండొద్దని అతడు ఒప్పుకోవాలి. వరండాల్లో తిరిగే విద్యార్థుల జోలికి రానని, వాళ్ళమీద నోరు పారేసుకోనని ఒప్పుకోవాలి. ఇవి మా డిమాండ్స్ అని చెప్పండి. వీటికి ఒప్పుకోకపోతే స్ట్రైక్ చేస్తామని చెప్పండి. రాస్తారోకోలు చేస్తామని చెప్పండి. ఆర్టీసీ బస్సుల్ని నడవనీయమని చెప్పండి. రెండ్రోజుల్లో ఈ డిమాండ్స్‌కి ఒప్పుకోకపోతే ప్రిన్స్‌పాల్‌ను వెంటనే ఈ కాలేజి నుండి ట్రాన్స్‌ఫర్ చెయ్యాలన్న

డిమాండ్ పెట్టండి. లోకల్ ఎమ్మెల్యేను, ఎంపీని కలవండి. కలెక్టర్‌ను, ఎస్పీని కూడా కలవండి. పొండి.. వాడి రోగం కుదర్చకపోతే ఈ కాలేజి బాగుపడదు. వెళ్ళండి.. అంతిమ విజయం మీదే..” చాలా ఆవేశంగా అన్నాడు సూర్యారావు.

అతని మాటలు విన్న విద్యార్థులంతా ఒకేసారి పెద్దపెట్టున “ప్రిన్స్‌పాల్ డౌన్ డౌన్.. ప్రిన్స్‌పాల్ డౌన్‌డౌన్..” అని అరిచారు.

అన్ని గదుల్లో ఉన్న విద్యార్థులంతా క్లాసుల్లోంచి బయటకొచ్చారు.

‘ప్రిన్స్‌పాల్.. డౌన్ డౌన్’ అన్న అరుపులు మిన్నుముట్టాయి.

‘ప్రిన్స్‌పాల్ బయటకు రావాలి..

స్టూడెంట్స్‌కు... క్షమాపణ చెప్పాలి..’ అని కొందరు విద్యార్థులు అరవటం మొదలెట్టారు.

విద్యార్థి నాయకులు శ్యామ్‌సుందర్, కొండారెడ్డి ప్రిన్స్‌పాల్ రూంలోకెళ్ళి “మీరొచ్చి మా విద్యార్థులను నోటికొచ్చినట్టు తిట్టినందుకు క్షమాపణలు చెప్పాలె. అటెండెన్స్‌కూ, ఎగ్జామ్స్‌కూ, స్కాలర్‌షిప్స్‌కూ లింక్ పెట్టనని ఒప్పుకోవాలె.. లేకపోతే మేం క్లాసులు బాయ్‌కాట్ చేసి రోడ్ల మీదికెళ్తాం. ఆ తర్వాత జరిగే పరిణామాలన్నింటికీ మీరే బాధ్యత వహించాల్సి ఉంటుంది” అన్నాడు శ్యామ్‌సుందర్.

“గోటు హెల్. నేను క్షమాపణ చెప్పను.. మీరే నాకు క్షమాపణ చెప్పాలి. అటెండెన్స్ షార్టేజి ఉన్నవాళ్ళకు స్కాలర్‌షిప్స్ ఇచ్చేది లేదన్న నా స్టాండ్‌లో మార్పుండదు. మీరేం చేసుకుంటారో చేసుకోండి” అన్నాడు ప్రిన్స్‌పాల్.

శ్యామ్‌సుందర్, కొండారెడ్డి బయటకొచ్చి ప్రిన్స్‌పాల్ ఏమన్నాడో చెప్పారు.

‘ప్రిన్స్‌పాల్.. డౌన్‌డౌన్’ అన్న కేకలు మరోసారి మిన్నుముట్టాయి. అలా అరుస్తూ విద్యార్థులంతా కాలేజి బయటకొచ్చారు. బయట పోర్టికో కింద పార్క్‌చేసి ఉన్న ప్రిన్స్‌పాల్ కారు మీదకు రాళ్ళు విసిరారు. కన్నుమూసి తెరిచేంతలో కారు అద్దాలన్నీ ముక్కలు చెక్కలై పోయాయి. పెద్దకేకలు పెడ్తూ ఏడెనిమదిమంది కలిసి తమ శక్తినంతా ఉపయోగించి కారు విండోలను, బోనెట్‌ను లాగేసి బయటకు విసిరేశారు.

‘ప్రిన్స్‌పాల్ డౌన్‌డౌన్’ అంటూ విద్యార్థులంతా ఇద్దరిద్దరి చొప్పున లైన్ కట్టి ఆ కాలేజికి అరఫర్లాంగ్ దూరంలో ఉన్న మెయిన్ రోడ్డు మీదకు చేరుకున్నారు.

“అందరూ రోడ్డుమీద కూర్చోండి. రాస్తారోకో చేద్దాం” అన్నారు విద్యార్థి నాయకులు శ్యామ్‌సుందర్, కొండారెడ్డి.

విద్యార్థులంతా రోడ్డుమీద బైఠాయించారు. ఓ ఆర్టీసి బస్సు డ్రైవర్ వీళ్ళు రాస్తారోకో చేస్తున్నారని గమనించి త్వరగా వెళ్ళిపోవాలన్న ప్రయత్నంలో కొందరు విద్యార్థులకు తగిలిస్తూ, బస్సును ముందుకు తీసికెళ్ళబోయాడు. దాంతో రెచ్చిపోయిన విద్యార్థులు ఆ బస్సు మీదకు రాళ్ళు రువ్వారు. ఐదారుగురు ప్రయాణికుల ముక్కులకు, మొఖాలకు గాయాలయ్యాయి.

విద్యార్థులు రాస్తారోకో చెయ్యటంతో

## కొత్తగాలి...

**మహారుచి**
**పొరుగింటి**
**‘పిల్ల’కూర**

– బిక్కునూరి రాజేశ్వర్,
ఈద్‌గాం, ఆదిలాబాద్ జిల్లా

ఎక్కడి వాహనాలక్కడే ఆగిపోయాయి. అరగంటలో రోడ్డుకు రెండువైపులా వంద లకొద్దీ వాహనాలు ఆగిపోయాయి. విద్యార్థులు అకస్మాత్తుగా రాస్తారోకో ఎందుకు చేస్తున్నారో ఎవరికీ అర్థం కాలేదు.

గంట సేపట్లో రెండుమూడు కిలోమీటర్ల మేర వాహనాలు ఆగిపోయాయి.

ఈలోగా అక్కడికి పోలీసులు చేరుకున్నారు. సబ్ ఇన్‌స్పెక్టర్ వెంకటరమణ కొందరు కానిస్టేబుల్స్‌ని తీసుకొని ఓ జీపులో అక్కడకొచ్చి విద్యార్థి నాయకులతో మాట్లాడాడు.

"ఈ ప్రిన్స్‌పాల్ మా విద్యార్థులను బూతులు తిట్టి అవమానించాడు. మాకు స్కాలర్‌షిప్పులు రాకుండా చేస్తున్నాడు. అతడొచ్చి క్షమాపణ చెప్పాలి. అతన్ని వెంటనే ఇక్కడ్నించి ట్రాన్స్‌ఫర్ చెయ్యాలి. అప్పటివరకు మేం రాస్తారోకో చేస్తూనే ఉంటాం" అన్నాడు శ్యామ్‌సుందర్.

"నేను మీ ప్రిన్స్‌పాల్‌తో మాట్లాడతాను. మీరు వెంటనే రోడ్డుమీంచి లేచి వెళ్ళిపోవాలి. ఎక్కడో మీ కాలేజీలో జరిగిన సంఘటన కారణంగా కొన్ని వందల మంది వాహనదారుల్ని ఇబ్బంది పెట్టడం బాగాలేదు. మీరు వెంటనే లేవాలి" అన్నాడు వెంకటరమణ.

"మీరు ప్రిన్స్‌పాల్‌తో క్షమాపణ చెప్పిస్తారా? అతన్ని ట్రాన్స్‌ఫర్ చేపిస్తారా?" అన్నారు విద్యార్థులంతా ఒకేసారి.

"క్షమాపణ చెప్పించటానికి ప్రయత్నిస్తాను. ట్రాన్స్‌ఫర్ అన్నది మా చేతుల్లో ఉండదు. దయచేసి మీరు వెంటనే ఈ రాస్తారోకో ముగించాలి. మర్యాదగా చెప్పినప్పుడు వినాలి. మీ కాలేజీలో జరిగిన సంఘటనతో ఎలాంటి సంబంధం లేని ఇన్ని వందలమందిని, ఎక్కడెక్కడికో ఎన్నో అర్జెంట్ పనులతో వెళ్ళాల్సిన వీళ్ళను బలిచెయ్యడం అన్యాయం. మీ సమస్యను నేను పరిష్కరించే ప్రయత్నం

## ఓటే వేస్తారో.. ఉరే తీస్తారో!



వరంగల్ జిల్లా తాటికాయల గ్రామవాసి పొట్లపల్లి రామారావు కవితల్ని పి.వి.గారు చాలా అభిమానించేవారు.

అలాగే పీవీజీ సమయస్ఫూర్తితో తన సాహిత్య పరిజ్ఞానాన్ని చక్కగా ఉపయోగించుకునేవారు. ఓసారి ఎన్నికల ప్రచారంలో అలాంటి కవితను ప్రయోగించి ప్రత్యర్థుల్ని చిత్తు చేస్తూ విశేషంగా ప్రజల ఆదరాభిమానాలు పొందారు. అలాంటి ఓ ఎన్నికల ప్రచారంలో ఆయన రామారావు కవితని వినిపించారిలా.

'పూలు చల్లినను మీరే
ధూళి చల్లినను మీరే
కరి ఎక్కించిన మీరే
ఉరి ఎక్కించిన మీరే'

దాంతో ప్రజలు హర్షధ్వానాలు చేశారు.

చేస్తాను. మీరు లేవండి" ఈసారి కాస్త గట్టిగా అన్నాడు ఎస్.ఐ.

"ఈ ఎస్.ఐ మన ప్రిన్స్‌పాల్‌తో క్షమాపణ చెప్పిస్తాడట.. లేవండిరా" అన్నాడు శ్యామ్‌సుందర్.

"లేవండి.. లేవండి.. మన పోరాటానికి ఇది ఆరంభం మాత్రమే. అతన్నిక్కడ్నించి పంపించేవరకు మన పోరాటం ఆగదు" అన్నాడు కొండారెడ్డి.

బిలబిలమంటూ విద్యార్థులంతా రోడ్డు మీంచి లేవడంతో ఆగిపోయిన వాహనాల్లో కదలిక ప్రారంభమైంది.

"మీరు ఇప్పుడే వెళ్ళి మా ప్రిన్స్‌పాల్‌తో మాట్లాడి మాకు క్షమాపణ చెప్పించాలె

సార్!" అన్నాడు శ్యామ్‌సుందర్ ఎస్.ఐ. వెంకటరమణ దగ్గరకు వెళ్ళి.

"అలాగే మాట్లాడ్తాను. వెంటనే మీరందరూ మీమీ ఇండ్లకు వెళ్ళిపోవాలి. కావాలంటే మీ లీడర్లు ఒకరో ఇద్దరో నాతో రావొచ్చు" అన్నాడు ఎస్.ఐ.

"లేదు సార్. అందరూ వస్తారు. అతడు అందరిముందూ క్షమాపణ చెప్పాలి. ఒకరికో ఇద్దరికో కాదు.. ముఖ్యంగా మా ఎమ్మెస్సీ స్టూడెంట్స్‌కి. మమ్మల్నే సార్, ఈ రోజు మార్నింగ్ అతడు బూతులు తిట్టింది" అన్నాడో ఎమ్మెస్సీ విద్యార్థి.

"వస్తే రండి.. కామ్‌గా ఉండాలి. కేకలు, నినాదాలు చెయ్యొద్దు" అన్నాడు ఎస్.ఐ.

## కొత్తగాలి...

**నీళ్లలోకి తొంగిచూశాను**
**నా ప్రతిబింబం**
**వెదికినా దొరకలేదు**
**నీటిలో అద్దాలు**

– పి. సునీల్,
పెద్దకొట్టాల, నంద్యాల

అలా అంటూనే ఎస్.ఐ. తన జీపెక్కి కాలేజి వైపు వెళ్ళాడు. జీపు వెంటే విద్యార్థులంతా 'ప్రిన్స్‌పాల్.. డౌన్‌డౌన్' అంటూ పరిగెత్తారు.

ఎస్.ఐ. వెంకటరమణ ప్రిన్స్‌పాల్ రూంలో ప్రవేశించినప్పుడు వెంకటేశ్వరరావు సూర్యారావుకివ్వాల్సిన డి.టి.పి. చెయ్యబడిన మెమోలో కొన్ని కరెక్షన్స్ చేస్తున్నాడు. ప్రిన్స్‌పాల్ పక్కనే సూపర్నెంట్ నిల్చొని ఉన్నాడు.

"ఏమిటి సార్? మీ విద్యార్థుల్ని రోడ్డుమీదికి పంపించి మాకో పెద్ద సమస్యను సృష్టించారు?" అన్నాడు వెంకటరమణ కొంచెం విసుగ్గా.

"నేను విద్యార్థుల్ని రోడ్డుమీదకు పంపించానా? ఏం మాట్లాడుతున్నారు ఎస్.ఐ.గారూ?" అన్నాడు ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు.

"కరెక్ట్‌గానే మాట్లాడుతున్నాను. మీ విద్యార్థుల్ని మీరు కంట్రోల్ చేసుకోవాలి. ఏదన్న సమస్యుంటే దాన్ని మీ కాలేజిలోనే పరిష్కరించుకోవాలి. అంతేగాని వాళ్ళను రోడ్లమీదకు పంపించి మాకు న్యూసెన్స్ క్రియేట్ చెయ్యకూడదు. ఆల్‌రెడీ మేం బోల్డు సమస్యలతో సతమతమవుతున్నాం. విద్యార్థులన్నప్పుడు అల్లరి చేస్తూనే ఉంటారు. వాళ్ళను నెమ్మదిగా మంచి మాటలతో శాంతపరచాలి తప్ప నోటికొచ్చినట్టల్లా తిడితే వాళ్ళు ఇలాగే రియాక్టవుతారు. పోనీయ్ తిట్టారే అనుకోండి.. వాళ్ళడిగినప్పుడు 'సారీ' అంటే వాళ్ళు శాంతించేవాళ్ళు కదా! గోటితో పోయేదాన్ని గొడ్డళ్ళదాకా తెచ్చుకుంటే ఎలా?" అన్నాడు ఎస్.ఐ.

"మిస్టర్ ఎస్.ఐ.. మీరు చాలా ఎక్కువగా మాట్లాడుతున్నారు. సారీ అంటే సరిపోతుందని ఎంత సులభంగా అనేశారు. నేను తప్పు చెయ్యనప్పుడు నేను సారీ ఎందుకనాలి? అయినా నేను ఆఫ్టరాల్ ఓ ఎస్.ఐ.తో ఇంతసేపు మాట్లాడటమేమిటి? నేను మీ ఎస్పీతో మాట్లాడతాను" అంటూ అతని పక్కనే నిల్చున్న సూపర్నెంట్‌తో, "ఎస్పీకి ఫోన్ కలపండి" అన్నాడు.

"మాట్లాడండి.. ఎస్పీతోటే మాట్లాడండి" అన్నాడు ఎస్.ఐ.

అటువైపు నుండి "హల్లో" అన్న మాట వినగానే "ఎస్పీగారితో మా ప్రిన్స్‌పాల్ మాట్లాడ్తారు" అన్నాడు సూపర్నెంట్, ఫోను ప్రిన్స్‌పాల్ చేతికిస్తూ.

"హల్లో ఎస్పీగారు.. అయామ్ ప్రిన్స్‌పాల్ స్పీకింగ్. మా కాలేజిలో చిన్న గొడవ జరిగింది. స్టూడెంట్స్ వరండాలో

అరచుకుంటూ వెళ్తోంటే నేను వాళ్ళను కోప్పడ్డాను. అంతమాత్రానికే వాళ్ళు నన్ను అపాలజీ చెప్పాలని అడిగారు. చెప్పన న్నాను. వాళ్ళు కాలేజిలో భీభత్సాన్ని సృష్టించారు. నా కారును- ఈ మధ్యనే బ్యాంకు నుండి అప్పు తీసుకొని కొన్నాను- డామేజ్ చేశారు. రోడ్డు మీదికెళ్ళి రాస్తా రోకో చేశారు. దీనికంతటికీ నేను కారణమ న్నట్టుగా మీ ఎస్.ఐ. వచ్చి నన్ను మా స్టూడెంట్స్‌కు అపాలజీ చెప్పమంటు న్నాడు. యువర్ ఎస్.ఐ ఈజ్ క్రాసింగ్ హిజ్ లిమిట్స్" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"అవర్ ఎస్.ఐ. ఈజ్ నాట్ క్రాసింగ్ హిజ్ లిమిట్స్. మీరే మీ లిమిట్స్‌ని మర చిపోతున్నారు. మీ విద్యార్థుల్ని కంట్రోల్ చేసుకోవలసిన బాధ్యత మీది. విద్యార్థులు అల్లరి చేస్తే వాళ్ళను మంచి మాటలతో శాంతింపజేసుకోవాలి. ఈ రోజుల్లో వాళ్ళను నోటికొచ్చినట్టుగా తిడ్తే పరిస్థితి విషమిస్తుంది. మాకు లా అండ్ ఆర్డర్ ప్రాబ్లెమ్స్‌ని సృష్టించిన వాళ్ళవుతారు. అక్కడేం జరిగిందో నాకిప్పుడే తెలిసింది. మీ ఇన్‌డిస్క్రిమినేషన్ వల్లనే ప్రాబ్లెమ్ రోడ్డుమీదకు వెళ్ళింది. ఇప్పటికైనా వాళ్లకో 'సారీ' చెప్పి శాంతింపజేసి వాళ్ళను ఇంటికి పంపించండి. ఆల్‌రెడీ టౌన్‌లో పరిస్థితి చాలా వోలటైల్‌గా ఉంది. దానికి ఈ సమస్యను కూడా జతచేయకండి. మీ కాలే జిలో జరిగినదాన్ని మొత్తం టౌన్‌మీద రుద్దకండి" అంటూ ఎస్పీ ఫోన్ పెట్టేశాడు.

ప్రిన్స్‌పాల్ చేతిలో ఫోన్ పట్టుకొని నోరు తెరచుకొని ఓ నిమిషంసేపు అలాగే ఉండిపోయాడు.

"ప్రిన్స్‌పాల్‌గారూ! ఫాల్స్ ప్రిస్టేజికి పోకుండా బయటకొచ్చి స్టూడెంట్స్‌కు 'సారీ ..డియర్ స్టూడెంట్స్' అని ఓ మాట చెప్పండి. పెద్దమనసుతో సారీ చెప్పటం వల్ల మీ ప్రిస్టేజి పెరుగుతుందేగానీ తగ్గదు" అన్నాడు ఎస్.ఐ.

## చాణక్యుడు మీవాడే!

పీవీజీ ఢిల్లీ పీఠమెక్కినప్పుడు లోక్‌సభలో తన మైనారిటీ ప్రభుత్వాన్ని అవిశ్వాస తీర్మానం బారినుంచి చాకచక్యంగా గట్టెక్కించారు. దీంతో అందరూ ఆయనను 'అపర చాణక్యుడు' అని పిలిచేవారు. ఓసారి



ఒక ఉత్తరాది నాయకుడు పీవీతో, 'ఎంతైనా దక్షిణ భారతదేశపు బ్రాహ్మణులది పన్నా గాలు పన్నడంలో అందెవేసిన చేయి' అన్నాడు.

దానికి పీవీ నవ్వుతూ వెంటనే, 'రాజనీతి మీవాళ్లకే బాగా తెలుసు. చాణక్యుడు కూడా మీ ఉత్తరాదిలోనే పుట్టాడు కదా? దక్షిణదేశంలో శంకరుడు, రామానుజుడువం టివాళ్లే పుట్టారు' అని జవాబు ఇచ్చారు. దాంతో ఆ రాజకీయ నాయకుడు కంగు తిన్నాడు.

ఈలోగా అక్కడికి సీనియర్ లెక్చరర్ సాంబశివరావొచ్చాడు.

"వాళ్ళు మన విద్యార్థులే కదా.. మన పిల్లలేకదా.. నా మాటలు మిమ్మల్ని బా ధించవచ్చు. సారీ అనండి. పరిస్థితి చక్క బడ్తుంది. ఇలా చెప్పడాన్ని కండిషనల్ అపాలజీ అంటారని మీకూ తెలుసు" అన్నాడు సాంబశివరావు.

"చెప్పను. నేనేతప్పు చెయ్యలేదు కాబట్టి సారీ చెప్పే ప్రశ్నేలేదు" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"మీ మీద ఆల్‌రెడీ ఎస్సీ, ఎస్టీ అట్రా సిటీ కేసుకు సంబంధించిన కంప్లెయిం టుంది. దానికి ఈ సమస్య కూడా

తోడైతే.." ఎస్.ఐ పూర్తి చెయ్యకుండానే,
"నన్ను అరెస్ట్ చెయ్యండి ఎస్.ఐ.గారూ!" అన్నాడు ప్రిన్స్‌పాల్.
"ఎంక్వైరీ చేశాక, సాక్ష్యాలు లభించాక అదే చెయ్యాల్సి వస్తుంది" అన్నాడు ఎస్.ఐ.
"ఏం చేస్తారో చెయ్యండి. లెట్ ది లా టేక్ ఇట్స్ వోన్ కోర్స్.." అన్నాడు ప్రిన్స్‌పాల్.
"చివరిసారి అడుగుతున్నాను.. మీరు వాళ్ళకు, మీ లెక్చరర్ సాంబశివరావుగారు సూచించినట్టు కండిషనల్ అపాలజీ అన్నా చెబుతారా? లేదా? " అన్నాడు ఎస్.ఐ.
"చెప్పను.. నేను తప్పు చెయ్యలేదని నా అంతరాత్మ ఘోషిస్తున్నంతసేపు నేను ఎవరికీ సారీ చెప్పను" అన్నాడు ప్రిన్స్‌పాల్.
సాంబశివరావు ప్రిన్స్‌పాల్‌వైపు జాలిగా చూశాడు.
'ఈయనకు ఈయనే శత్రువు. వేరే శత్రువులు అక్కర్లేదు' అనుకున్నాడు.
ఎస్.ఐ. ప్రిన్స్‌పాల్‌తో జరిపిన చర్చలు విఫలమయ్యాయని ఆ రూం బయటనే ఉన్న విద్యార్థులకు అర్థమైపోయింది.
ఎస్.ఐ. బయటకొచ్చి "ఆయన అపాలజీ చెప్పనంటున్నాడు. మీరూ, ఆయనా కలిసి గంగలో కలవండి. ఏదన్నా ఉంటే మీరాయనతో తేల్చుకోండి తప్ప.. దీంతో ఎలాంటి సంబంధంలేని ఈ టౌనులోని ప్రజలకు ఇబ్బందులు కల్గించకండి. రాస్తారోకోలు చెయ్యడం, ఆర్టీసీ బస్సుల్ని డామేజి చెయ్యడం, పబ్లిక్ అండ్ ప్రైవేట్ ప్రాపర్టీలకు నష్టం కల్గచేయటం- ఇలాంటి పనులు చేస్తే మేం మీతో కఠినంగా వ్యవహరించవలసి వస్తుంది" అన్నాడు ఎస్.ఐ.
"మేం పోరాటాన్ని శాంతియుతంగా జరుపుతాం సార్" అన్నాడు శ్యామ్‌సుందర్.
"అలా అయితే మంచిదే" అంటూ ఎస్.ఐ. కొందరు కానిస్టేబుల్స్‌ని కాలేజి దగ్గరుంచి, "విద్యార్థుల్ని గమనించండి" అని చెప్పి, జీపెక్కి వెళ్ళిపోయాడు.
విద్యార్థులు మరోసారి "ప్రిన్స్‌పాల్.. డౌన్ డౌన్" అని అరిచారు.
"మనం మన నిరసనను తెలియజేస్తూ టౌన్లోకి ప్రొసెషన్ తీద్దాం" అన్నాడు శ్యామ్‌సుందర్.
వెంటనే ఐదారువందల మంది విద్యార్థులు ఇద్దరిద్దరు లైన్‌గా ఏర్పడ్డారు.
"ప్రిన్స్‌పాల్.. డౌన్‌డౌన్" అంటూ, "కోపగొండి ప్రిన్స్‌పాల్‌ను.. తొలగించాలి" అంటూ నినాదాలతో టౌన్లోకి ప్రవేశించారు.
వాళ్ళు అలా అరచుకుంటూ ఊరేగింపుగా వెళ్తోంటే ప్రజలంతా ఇళ్ళళ్ళోంచి బయటకొచ్చి వాళ్ళను ఆసక్తిగా.. ఏదో వినోదంలా చూడసాగారు.
ఈలోగా కాలేజిలో ప్రిన్స్‌పాల్ సూర్యారావుకు ఇచ్చిరమ్మని అటెండర్ హుస్సేన్‌తో మెమోను పంపించాడు.
"ఇప్పుడే ఎందుకు పంపిస్తారు సార్? ఈ విద్యార్థుల గొడవ సద్దుమణగనీయండి" అన్న సాంబశివరావు మాటను వెంకటేశ్వరరావు పట్టించుకోలేదు.
స్టాఫ్‌రూంలో కూర్చొని "త్వరలోనే వీడికి తగిన శాస్తి జరుగుతుంది. వీడ్ని ఇక్కడ్నించి పంపించేస్తారు" అంటున్న సూర్యారావుకు అటెండర్ హుస్సేన్ ద్వారా ప్రిన్స్‌పాల్ పంపించిన మెమో అందింది. దాన్ని సూర్యారావు చకచకా చదివేశాడు.
"నాకే మెమోను పంపిస్తాడా? వీడికెంత పొగరు? ఇంత దురుసుగా, ఇంత అవమానకరంగా రాసిన మెమోను ఈ సూర్యారావుకు పంపించటానికి వీడికెంత సాహసం? ఈ చెత్త మెమోకు నేను వారం రోజుల్లో రిప్లై ఇవ్వాలా? వారం రోజులెందుకు? ఇప్పుడే వీడికి రిప్లై ఇస్తాను" అంటూ సూర్యారావు తన సీట్లోంచి లేచి నిల్చున్నాడు.
"ఎక్కడికి సూర్యారావు? " అంటున్న

# ఎలక్ట్రానిక్ జేబుదొంగలు




కూటికోసం కోటి విద్యలని మనవాళ్లు ఏనాడో చెప్పేశారు. ఇప్పుడు కొత్తరకం ఎలక్ట్రానిక్ జేబు దొంగలు విస్తరించారు.

జేబులోనో, హేండ్ బ్యాగ్‌లోనో పెట్టుకున్న క్రెడిట్ కార్డులను మనం అసలు బయటికి తీయకపోయినా, వాటిలోని సమాచారాన్ని ఈ



దొంగలు తెలుసుకుంటున్నారు. క్రెడిట్ కార్డుల్లో ఎలక్ట్రానిక్‌గా నమోదైన సమాచారాన్ని రేడియో ఫ్రీక్వెన్సీ ఐడెంటిఫికేషన్ టెక్నాలజీతో పనిచేసే స్కానర్ యంత్రాలను ఉపయోగించి తెలుసుకుంటున్నారు. పెట్రోల్ బంకులు, సూపర్ బజార్లు, రెస్టారెంట్స్‌లోనే కాక, పాదచారుల వద్ద ఉన్న క్రెడిట్ కార్డుల సమాచారాన్ని కూడా దొంగలిస్తున్నారు. మొదట్లో క్రెడిట్ కార్డులు పోగొట్టుకోకున్నా డబ్బులు చోరీ అయ్యేవి. వినియోగదారుడి నిర్లక్ష్యంవల్లే అతని బంధుమిత్రులు క్రెడిట్ కార్డుల్ని ఉపయోగించుకోవడమే దీనికి కారణమని అంతా భావించారు. అయితే ఈ కార్డులను ఒకదేశంలో దొంగలించి, వేర్వేరే దేశాల్లో సైతం దొంగలు ఉపయోగించుకోవటంతో క్రెడిట్ కార్డు కంపెనీల నిఘా విభాగం కళ్ళు తెరచింది.

ఆర్.ఎఫ్.ఐడి పరికరాన్ని జేబులో ఉంచుకొని, క్రెడిట్ కార్డులు జేబులో పెట్టుకున్నవారి వద్ద దొంగలు నిలబడతారు. అలా రహస్యంగా సమాచారాన్ని సేకరిస్తారు. అమెరికాలో పద్నాలుగు కోట్ల క్రెడిట్ కార్డులు ఉన్నాయి. దీన్నిబట్టి దొంగతనానికి ఎంత పుష్కలమైన అవకాశాలున్నాయో తెలుస్తుంది. ఇలాంటి హైటెక్ దొంగతనాలు ఇంకా అభివృద్ధి చెందుతున్న మనలాంటి దేశాలకు రాలేదు. కాని ఇలాంటి ఎలక్ట్రానిక్ నేరాలు ఇక్కడ కూడా జరిగే రోజు ఎంతోదూరంలో లేదు. క్రెడిట్ కార్డులను దొంగల స్కానర్ల బారినుంచి రక్షించుకునేందుకు సెక్యూరిటీ స్లీవ్స్ అనే ప్రత్యేక రక్షణగల పర్సులను రూపొందించారు. వాటిలో దాచుకున్న కార్డుల సమాచారాన్ని స్కేనర్స్ చదవలేవు. అమెరికా ప్రభుత్వానికి ఈ విషయం చాలా కాలంగా తెలుసు. వారి ఉద్యోగస్థుల ఐడీ కార్డుల్లోని సమాచారం దొంగలించకుండా ఉండేందుకు, ప్రత్యేక చొక్కా జేబులను రూపొందించారు. ఇప్పుడు అదే టెక్నిక్‌తోనే సెక్యూరిటీ పర్సులను వినియోగంలోకి తెచ్చి ఇలాంటి నేరాలకు అడ్డుకట్ట వేస్తున్నారు.

ఇతర లెక్చరర్ల మాటను వినిపించుకోకుండానే సూర్యారావు ప్రిన్స్‌పాల్ రూంవైపు వేగంగా, పరిగెత్తుతున్నట్టుగా నడిచాడు.

ప్రిన్స్‌పాల్ రూంలో ప్రవేశిస్తూనే,

"నాకే మెమో ఇస్తావా మిస్టర్ వెంకటేశ్వరరావు? నేనంటే ఎవరనుకున్నావు? ఈ కాలేజికి పేరుకు ప్రిన్స్‌పాల్‌వు నువ్వు కావచ్చు. కానీ అసలు ప్రిన్స్‌పాల్‌ని నేనే నని తెలుసుకోలేకపోయిన నీ అమాయకత్వానికి జాలిపడ్తున్నాను. ఈ కాలేజిలో చదువుతున్న వెయ్యిమంది స్టూడెంట్స్ నా చేతిలో ఉన్నారు. నేనేం చెయ్యమంటే అది చేస్తారు. ఈ కాలేజిలో పనిచేస్తున్న లెక్చరర్లంతా నా చేతిలో ఉన్నారు. ఈ కాలేజి ఆఫీసులో పనిచేస్తున్న నాన్‌టీచింగ్

స్టాఫంతా నా చేతిలో ఉన్నారు. అయామ్ ది రియల్ కింగ్ ఆఫ్ దిస్ కాలేజ్.. నాట్ యూ.. అలాంటి నాకు షోకాజ్ నోటీసిస్తావా? నీ గోతిని నువ్వే తవ్వుకున్నావు. నువ్వు పంపించిన ఈ కాగితం నాకు లెట్రిన్‌లో ముడ్డి తుడుచుకోవడానికి వాడే టిష్యూపేపర్‌తో సమానం" అంటూ సూర్యారావు తన చేతిలో ఉన్న మెమొను ముక్కలు ముక్కలుగా చించేసి ప్రిన్స్‌పాల్ ముఖం మీదకు విసిరికొట్టాడు.

"వారం రోజుల్లో రిప్లై ఇవ్వమన్నావుగా.. దిసీజ్ మై రిప్లై. ఏం చేసుకుంటావో చేసుకో!" అంటూ సూర్యారావు వెంటనే వెనుదిరిగి ఆ రూంలోంచి బయటకు వెళ్ళిపోయాడు.

ప్రిన్స్‌పాల్ అలాగే ఫ్రీజయిపోయి ఓ నిర్జీవమైన విగ్రహంగా మారిపోయాడు.




విద్యార్థులు ఆ మర్నాడు కూడా సమ్మెను కొనసాగించారు. ఊరేగింపుగా వెళ్ళి కలెక్టర్‌ను కలిసి ప్రిన్స్‌పాల్‌ను వెంటనే ఆ కాలేజి నుండి ట్రాన్స్‌ఫర్ చెయ్యాలని కోరుతూ వినతిపత్రాన్ని సమర్పించారు. ఆ వినతిపత్రాన్ని సూర్యారావే రాసిచ్చాడు. ప్రిన్స్‌పాల్ ఎన్నెన్ని అక్రమాలకు పాల్పడ్డాడో అందులో కవిత్వం అనిపించే శైలిలో వివరంగా రాశారు. అదే వినతిపత్రాన్ని ఎస్పీకి, స్థానిక ఎమ్మెల్యేకు, ఎంపీకి కూడా సమర్పించారు.

ఇంత జరుగుతున్నా ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు ఏమీ జరగనట్టే కాలేజికి మామూలుగా వెళ్ళొస్తూనే ఉన్నాడు. ధ్వంసమైపోయిన తన కారును ఇన్సూరెన్స్ వాళ్ళొచ్చి ఫోటోలవీ తీసుకున్నాక వర్క్‌షాపుకు పంపించాడు.

తన ఆఫీసులో కూర్చున్న ప్రిన్స్‌పాల్‌కు కలెక్టర్ ఫోన్‌చేసి 'మీకు మీ విద్యార్థుల్ని ఎలా కంట్రోల్ చేసుకోవాలో తెలీదు. ఇప్పటికైనా వాళ్ళతో ఎలాగోలా కాంప్రమైజ్ చేసుకొని కాలేజిని నడిపించండి' అని చెప్పాడు. అదే ధోరణిలో ఎస్పీ, ఎమ్మెల్యే, ఎంపీ కూడా చెప్పారు.

అందరూ తనేదో తప్పు చేశానన్నట్టుగా మాట్లాడటం వెంకటేశ్వరరావును ఆశ్చర్యపరచింది. ఈ కాలేజిని బాగుచెయ్యాలనే తను ప్రయత్నించాడు. ఈ కాలేజినొక పవిత్రమైన విజ్ఞాన దేవాలయంగా తీర్చిదిద్దాలనుకున్నాడు. అందుకోసం తీవ్రంగా ప్రయత్నించాడు. కుళ్ళి కంపుకొడ్తున్న ఉన్నత విద్యావ్యవస్థను ఆరోగ్యకరంగా మార్చాలనుకున్నాడు. కఠినంగా ఉండి ప్రతి ఒక్కరితో పనిచేయిస్తే తప్ప ఈ వ్యవస్థ బాగుపడదనుకున్నాడు. కానీ అంతా వ్యర్థమైపోయింది. ఈ వ్యవస్థలో ప్రతి ఒక్కడూ నేరస్థుడే. ప్రతి ఒక్కడూ దోషే. వీళ్ళను సంస్కరించాలని ప్రయత్నించిన తను వీళ్ళందరి ముందు దొంగగా, నేరస్థుడిగా, దోషిగా నిల్చోవలసిన దుస్థితి ఏర్పడింది. తన ప్రయత్నమంతా సూర్యారావు, భుజంగరావులాంటి పనిదొంగలవల్ల, గోపాల్‌లాంటి లంచగొండుల వల్ల వ్యర్థమైపోయింది. ఇప్పటికైనా వీళ్ళకు తగిన బుద్ధి చెప్పాలని అనుకున్నాడు.

అతనికి వెంటనే మిత్రుడు పూర్ణచంద్రరావు గుర్తొచ్చాడు. పూర్ణచంద్రరావు, తనూ

కాలేజిలో క్లాస్‌మేట్స్. ఇద్దరూ ఎంఏ ఇంగ్లీషు ఫస్ట్‌క్లాసులో ప్యాసయ్యారు. తర్వాత పూర్ణచంద్రరావు ఐ.ఏ.ఎస్. పరీక్షకు ప్రిపేరయ్యాడు. తను ప్రభుత్వ కాలేజీలో లెక్చరర్‌గా చేరాడు. పూర్ణచంద్రరావు ఐ.ఏ.ఎస్. ప్యాసయి కలెక్టరయ్యాడు. తర్వాత సెక్రటేరియట్‌లో జాయింట్ సెక్రటరీగా చేరాడు. ఇప్పుడు కమిషనర్ ఆఫ్ హైయర్ ఎడ్యుకేషన్‌గా పనిచేస్తున్నాడు. అంటే విద్యాశాఖలో పనిచేస్తున్న లెక్చరర్లకు, ప్రిన్స్‌పాళ్ళకు పూర్ణచంద్రరావే బాస్. తనకు ప్రిన్స్‌పాల్‌గా ప్రమోషన్ రాగానే ఒకసారి హైదరాబాద్‌కు వెళ్ళి పూర్ణచంద్రరావును కలిశాడు. తనను ప్రిన్స్‌పాల్‌గా ప్రమోట్ చేసినందుకు ఆయనకు థాంక్స్ చెప్పి, తను వెళ్తున్న కాలేజి చాలా చెడిపోయిందని, దాన్ని తన శక్తినంతా వెచ్చించి బాగు చెయ్యదల్చుకున్నానని, దానికి మీ సంపూర్ణ సహకారం కావాలని అడిగాడు.

పూర్ణచందర్‌రావు "గో ఎహెడ్.. నా నుండి నీకెలాంటి సహాయం కావాలన్నా లభిస్తుంది" అన్నాడు.

పైన పూర్ణచంద్రరావు ఉన్నాడన్న ధైర్యంతోటే తను పూర్తిగా చెడిపోయిన ఈ కాలేజీని ఓ దార్లో పెట్టాలని గట్టిగానే ప్రయత్నించాడు.

ఇప్పుడు వెంటనే తను పూర్ణచంద్రరావు దగ్గరకు వెళ్ళాలి. అతన్ని కలిసి ఇక్కడేం జరిగిందో చెప్పాలి. సూర్యారావును, భుజంగరావును వెంటనే ఈ కాలేజి నుండి ట్రాన్స్‌ఫర్ చెయ్యాలనీ, గోపాల్‌ను ఉద్యోగంలోంచి తొలగించాలని చెప్పాలి. వాళ్ళిద్దరికి తానిచ్చిన షోకాజ్ నోటీసుల్ని తీసికెళ్ళి పూర్ణచంద్రరావుకు చూపించాలి. తన నోటీసులకు సమాధానం ఇవ్వకుండా చిత్తు కాగితాల కింద వాళ్ళెలా జమకట్టారో

చెబుతూ వాళ్ళిద్దర్ని గూర్చి ఓ రిపోర్టు రాసుకొని వెళ్ళాలి. ఇలా ఆలోచిస్తూ వెంకటేశ్వరరావే ఓ రెండు గంటలు కూర్చొని స్వయంగా ఓ రిపోర్టు రాశాడు. సూపర్నెంట్‌ను పిలిచి ఆ రిపోర్టును డీటీపీ చేయించమన్నాడు. అన్నీ రెడీ చేసుకొని ఆ మర్నాడే వెళ్ళి పూర్ణచంద్రరావును కలిసి రావాలని నిర్ణయించుకున్నాడు.

కాలేజిలో విద్యార్థులెవరూ లేకపోవడం వల్ల ప్రశాంతంగా ఉంది. అయినా ప్రిన్స్‌పాల్ ఆరింటిదాకా తన ఆఫీసులోనే కూర్చున్నాడు. లెక్చరర్లందరూ క్లాసులు తీసుకునే పని తప్పినందుకు చాలా సంతోషిస్తూ నాల్గింటికి తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

## కొత్తగాలి...

**నిజం**
**నిప్పులాంటిది**
**అందుకే అబద్ధంనీళ్లు చల్లితే**
**ఆవిరైపోతుంది**

– ఆకుల వెంకట జ్యోత్స్న,
తెనాలి

ఆరింటికి ప్రిన్స్‌పాల్ ఇంటికి వెళ్ళటానికి సిద్ధమవుతుండగా అటెండర్ హుస్సేన్ వచ్చి "మిమ్మల్ని దళిత సంఘాల నాయకులు కలవడానికొచ్చారు సార్!" అన్నాడు.

"రమ్మను" అన్నాడు వెంకటేశ్వరరావు.

ఐదారుమంది స్థానిక దళిత నాయకులొచ్చి ప్రిన్స్‌పాల్‌కు ఎదురుగా ఉన్న కుర్చీల్లో కూర్చున్నారు.

"చెప్పండి" అన్నాడు.

"మీరు మీ కాలేజిలో పనిచేస్తున్న గోపాల్‌ను కులం పేరుతో దూషించి చాలా అవమానించారు. ప్రిన్స్‌పాల్‌గా ఎంతో ఉన్నత స్థానంలో ఉన్న మీరిలా ప్రవర్తించటం మమ్మల్ని ఆశ్చర్యపరచింది. మీరు వెంటనే గోపాల్‌కు క్షమాపణ చెప్పి నష్టపరిహారంగా అతనికో ఇరవైఐదు వేలు చెల్లిస్తే మీ మీద ఇచ్చిన కంప్లెయింటును అతడు విత్‌డ్రా చేసుకుంటాడు. ఇందుకు మీరు అంగీకరిస్తే మీకూ మంచిది, అతనికీ మంచిది" అన్నాడు జిల్లా దళిత సంఘం అధ్యక్షుడు బాలరాజు.

"నేనతన్ని కులం పేరుతో దూషించలేదు. అతని క్షేమం కోసమే సరిఅయిన దార్లో పెట్టడానికి ప్రయత్నించాను. అతన్ని మార్చాలన్న ఉద్దేశ్యం తప్ప నాకు మరో ఉద్దేశ్యం లేదు" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"మార్పు ఒక్కరోజులో రమ్మంటే రాదు ప్రిన్స్‌పాల్‌గారూ, నెమ్మదిగా వస్తుంది. మార్పు ఎవరో చెబితే రాదు. వాళ్ళంత వాళ్ళే తెలుసుకొని మారాలి. ఏమైనా మీ మీది గౌరవంతోనే మేమీ ప్రతిపాదనను మీ ముందుంచాం. తర్వాత మీ ఇష్టం" అన్నాడు దళితనాయకుడు.

"నా ఇష్టమేమిటో ఇదివరకే చెప్పాను. నేనేం తప్పు చేయలేదు. నేనెవరికీ క్షమాపణ చెప్పను. మీరన్న నష్టపరిహారం కూడా చెల్లించే ప్రసక్తే లేదు" అన్నాడు ప్రిన్స్‌పాల్.

"ఇది అగ్రకుల అహంకారం" అన్నాడు వాళ్ళల్లోని ఒక యువకుడు.

"మీరెలాగైనా అనుకోండి. నా అంతరాత్మ స్వచ్ఛంగా ఉంది" అన్నాడు ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు.

"మీలాంటి పెద్దమనిషిని జైలుకు పంపించడం మాకిష్టం లేదు" అన్నాడు జిల్లా అధ్యక్షుడు.

ప్రిన్స్‌పాల్ నిశ్శబ్దంగా ఉండిపోయాడు.

"మీది ఇదే చివరిమాటనుకోవాలా? "

"నేనింక చెప్పేదేమీలేదు" అన్నాడు ప్రిన్స్‌పాల్.

వాళ్ళు కుర్చీల్లోంచి లేచి బయటకు వెళ్ళి పోయారు.

"వీన్ని జైలుకు పంపించాలె"

"అట్టతప్ప వీనికి బుద్ధిరాదు"

"అగ్రకుల అహంకారం ఎక్కడికి పోతుంది? చింత చచ్చినా పులుపు చావదు" అని వాళ్ళంటున్న మాటలు ప్రిన్స్‌పాల్‌కు వినిపించాయి.

ఆ మర్నాడు అన్ని పత్రికల్లోనూ, టీవీ ఛానెల్స్‌లోనూ ఇదే గొడవ. 'ఉద్యోగిని కులం పేరుతో దూషించిన ప్రిన్స్‌పాల్', 'విద్యార్థుల ఆగ్రహానికి బలయిన సామాన్య ప్రజలు' అన్న పతాక శీర్షికలతో పత్రికల్లో, ఎలక్ట్రానిక్ మీడియాలో పెద్దఎత్తున వార్తలు ప్రసారమయ్యాయి. ప్రిన్స్‌పాల్ ప్రదర్శించిన మొండితనం వల్లనే ఈ సమస్యలు ఉత్పన్నమయ్యాయని అందరూ అభిప్రాయపడ్డారు.

ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావుకు ఇంటికి వెళ్లాలనిపించలేదు. కాలేజీలోనూ ఉండాలనిపించలేదు. ఏ హిమాలయాలకో వెళ్ళి ఏదైనా ప్రశాంతంగా ఉండే ఆశ్రమంలో చేరిపోవాలనిపించింది.

ఒక్కసారి తన ఒకప్పటి మిత్రుడు పూర్ణ చంద్రరావును కలిసి తన కాలేజీలో ఏం జరిగిందో అతనికి వినిపించాలనిపించింది. అతడే తననీ విషవలయం నుండి కాపాడ గల్గుతాడు. 'హీ ఈజ్ మై లాస్ట్ హోప్' అనుకున్నాడు.

ఆ మర్నాడు అతడు హైదరాబాద్‌కు బయల్దేరాడు. బయల్దేరేముందు పూర్ణచంద్రరావుకు ఫోన్‌చేసి తనొస్తున్నట్టు చెప్పాడు.

"నేను ఆఫీసులోనే ఉంటాను. వచ్చేయి" అన్నాడు పూర్ణచంద్రరావు.

నాంపల్లి స్టేషన్‌లో ట్రెయిన్ దిగిన వెంకటేశ్వరరావు ఆటో మాట్లాడుకొని చక్కగా ఉన్నత విద్యా కార్యాలయానికి వెళ్ళాడు. ఆయనకు త్వరగానే కమిషనర్ పూర్ణచంద్రరావు దర్శనం లభించింది.

"హాయ్ వెంకటేశ్వర్! హౌ ఆర్యూ?" అన్నాడు పూర్ణచంద్రరావు.

"ఫరవాలేదు. బాగానే ఉన్నాను"

కుశల ప్రశ్నలూ, విద్యార్థులుగా ఉన్నప్పటి జ్ఞాపకాలు అయిపోయాక "మీ కాలేజిలో ఏవో గొడవలౌతున్నాయని నిన్ననే విన్నాను"

"ఇప్పుడు నీతో ఆ విషయం మాట్లాడాలనే వచ్చాను. పెద్ద క్రైసిస్‌లో ఉన్నాను. నువ్వే నన్ను రక్షించాలి"

"విషయమేమిటో చెప్పు"

ఆ కాలేజికి తను వెళ్ళినప్పట్నించి తనా కాలేజిని బాగుచెయ్యాలని చేసిన ప్రయత్నాలను గూర్చి, తన ప్రయత్నాలకు ఎవరెవరు అడ్డుతగిలారో అన్న విషయాన్ని గూర్చి వెంకటేశ్వరరావు ఓ అరగంటసేపు పూర్ణచంద్రరావుకు వివరించాడు. అతడు తెచ్చిన కాగితాలన్నీ ఇచ్చాడు.

అతడు చెప్పిందంతా కమిషనర్ ప్రశాంతంగా విన్నాడు. అతడిచ్చిన రిపోర్ట్సు అన్నీ చదివాడు.

రెండుమూడు నిమిషాలసేపు ఆయన వెంకటేశ్వరరావునే చూస్తూ నిశ్శబ్దంగా ఉండిపోయాడు.

"వెంటనే సూర్యారావును, భుజంగరా

## కొత్తగాలి...

**మంచి మాట**
**మంత్రంతో సమానం**
**మంచి మనిషి**
**దైవంతో సమానం**

– శ్రీకాళహస్తి వెంకటశేషగిరిరావు,
నెల్లూరు

వును ఎక్కడికైనా దూరంగా ట్రాన్స్‌ఫర్ చేయండి. ఆ గోపాల్‌గాడిని ఉద్యోగం లోంచి తొలగించండి. అలా అయితేనే నేనా కాలేజిలో పనిచెయ్యగలను. యూ ఆర్ మై లాస్ట్ హోప్ పూర్ణచంద్రరావు" అన్నాడు వెంకటేశ్వరరావు.

'యూ ఆర్ మై లాస్ట్ హోప్' అన్న మాట విని పూర్ణచంద్రరావు నవ్వాడు.

"సారీ వెంకటేశ్వర్! నీ లాస్ట్ హోప్ కూడా ఫలించకపోవచ్చు. ఒక్కమాటలో చెప్పాలంటే నువ్వు ఒక అవాస్తవిక ప్రపంచంలో జీవిస్తున్నావు. యూఆర్ వెరీ అన్ రియలిస్టిక్ ఇన్ యువర్ అప్రోచ్ టు ప్రెజెంట్ ప్రాబ్లెమ్స్. ఇప్పటి పరిస్థితుల్ని

## కొత్తగాలి...



ఫ్రిజ్‌లో
ఐస్‌క్రీమ్‌లా
భద్రంగా
తెలుగుభాష

– మంత్రి లక్ష్మీనారాయణ,
సిరిసిల్ల, కరీంనగర్ జిల్లా

నువ్వు సరిగ్గా అంచనా వేయలేకపోయావు. ప్రస్తుతం మనకున్నదొక వ్యవస్థ కాదు, అవ్యవస్థ. మీ కాలేజిని ప్రస్తుత మన భారతదేశానికి సింబల్‌గా తీసుకోవచ్చు. ఎవరూ ఎవర్నీ కంట్రోల్ చేసే పరిస్థితి లేదు. క్రమశిక్షణారాహిత్యం, బాధ్యతారాహిత్యం, నైతికపతనం, విలువల పతనం మొదలైనవన్నీ చాలా మామూలైపోయాయి. ప్రజలు పైకి వీటిని తిడ్తున్నట్టు కనిపిస్తున్నారేగానీ వాళ్ళూ ఈ అవ్యవస్థ నుండి ఎన్ని లాభాలు పొందాలో అన్ని లాభాలూ పొందుతున్నారు. ఈ అవ్యవస్థను మార్చాలని ఈ దేశంలో అటు రాజకీయ నాయకులకు గానీ, సామాన్య ప్రజలకు గానీ, ప్రభుత్వ అధికారులకు గానీ, యువతరానికి గానీ లేదు. ఎందుకంటే అందరూ ఈ అవ్యవస్థ కారణంగా ఏదో ఒక ప్రయోజనాన్ని పొందుతున్నారు. నీలాంటివాడో, నాలాంటివాడో ఈ అవ్యవస్థను మార్చాలని ప్రయత్నిస్తే ఘోరంగా విఫలమవుతాం. అందుకని దీన్ని చూసీ చూడనట్టు ఉండటమే బెటర్. ఈ వ్యవస్థ కుళ్ళిపోయింది. దీన్ని నేను బాగుచేస్తానని అనుకోవడంలో మన అహం కొంత ఉంది. 'నేను మిగతావాళ్ళలాంటి వాడిని కాను. దీన్ని బాగుచేసే శక్తి నాకుంది' అనుకోవడం ద్వారా మన ఇగోను తృప్తిపరచుకోవచ్చు. కానీ పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. మనం చదువుకునే రోజుల్లో ప్రిన్స్‌పాల్ అంటే ఇటు విద్యార్థులు, అటు లెక్చరర్స్ ఎంతో భయపడేవారు. ఎంతో గౌరవించేవారు. ప్రిన్స్‌పాల్ దరిదాపులకు రావటానికి కూడా జంకేవారు. నువ్వే చెప్పు.. ఇప్పుడా పరిస్థితి ఉందా? లేదు.. ఎవరూ ఎవరికీ భయపడరు. ఎవరూ ఎవర్నీ గౌరవించరు. క్రమశిక్షణ లేదు. పనిపట్ల అంకిత భావం లేదు. ఎవడిష్టమొచ్చినట్టుగా వాడు నడుచుకోవడమే డెమొక్రసీ అనుకుంటున్నారు. ప్రతివాడికి హక్కులు కావాలి. బాధ్యతలక్కర్లేదు. హక్కులు, బాధ్యతలు ఆల్వేస్ గో టుగెదర్ అన్న వాస్తవాన్ని ఈ దేశంలో ఎవరూ గుర్తించరు.

అవినీతితో, బాధ్యతారాహిత్యంతో పీకలలోతుకు కూరుకుపోయిన ఈ దేశాన్ని నువ్వూ నేనూ బాగుచెయ్యగలమని అనుకోవడం హాస్యాస్పదం.. అవివేకం.. అవాస్తవికం. నువ్వు వాళ్ళిద్దర్ని ట్రాన్స్‌ఫర్ చెయ్యమంటున్నావు.. అదంత సులభమనుకున్నావా? ట్రాన్స్‌ఫర్ చేశానే అనుకో.. ఏ రాజకీయనాయకుణ్ణో పట్టుకొని, ఎంత



యినా ఖర్చుపెట్టి ఆ ట్రాన్స్‌ఫర్‌ని కాన్సిల్ చేయించుకొని వాళ్ళు మళ్ళీ నీ దగ్గరికే విజయగర్వంతో వచ్చి నిన్ను ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగిస్తారు.

సో మైడియర్ వెంకటేశ్వర్! ఈ వ్యవస్థని సమూలంగా మార్చాలని ప్రయత్నించకు.

దీన్నంతా క్షణాల్లో మార్చి ఓ అద్భుతాన్ని సృష్టించి నీ ఇగోను తృప్తిపరచుకోవాలన్న నీ మనస్తత్వాన్ని మార్చుకో. బీ రియలిస్టిక్. నీ చుట్టూ ఉన్న పరిస్థితుల్ని ఓసారి స్టడీ చెయ్యి. వీటిని మార్చడం నీ చేతుల్లో లేదని తెలుసుకో! ఉన్న పరిస్థితులతో సర్దుబాటు చేసుకోవడం తప్ప నువ్వు చెయ్యగల్గింది ఏమీలేదు. పరిస్థితులు ఆల్రెడీ దిగజారిపోయాయి. నువ్వు చెయ్యగల్గింది వాటినింకా దిగజారిపోకుండా చూడటమే. పరిస్థితులకు అనుగుణంగా నడుచుకోవడం నేర్చుకో! అంతకుమించి నేను చెప్పగల్గిందేమీ లేదు.. సో గుడ్‌బై మిస్టర్ వెంకటేశ్వరరావు! నీలా ప్రపంచాన్ని మరమ్మతు చేయబోయి చేతులు కాల్చుకున్నవాళ్ళు ఈ దేశంలో గొప్ప గొప్పవాళ్ళే ఉన్నారు. ప్రపంచాన్ని మరమ్మతు చెయ్యబోతే ప్రపంచమే మనల్ని మరమ్మతు చేస్తుంది. మరమ్మతు చెయ్యబోయి నీకు నువ్వు సమస్యలు సృష్టించుకోకు. మాకూ సమస్యలు సృష్టించకు" అన్నాడు పూర్ణచంద్రరావు.

తను చెప్పదల్చుకున్నది చెప్పడం పూర్తి చేసి 'ఇక నువ్వు వెళ్ళొచ్చు' అన్నట్టుగా చూశాడు పూర్ణచంద్రరావు.

రెండు మూడు నిమిషాలసేపు వెంకటేశ్వరరావు నిశ్శబ్దంగా తన సీట్లో కూర్చుండిపోయాడు. పూర్ణచంద్రరావు చెప్పిన మాటలు అతని చెవుల్లో పదే పదే వినిపించ సాగాయి.

పూర్ణచంద్రరావు తన ముందున్న ఫైల్స్‌ను చూస్తూ సంతకాలు చెయ్యసాగాడు.

"నాకో వైట్ పేపరిస్తావా పూర్ణచంద్రరావు?" అన్నాడు వెంకటేశ్వరరావు.

"తీసుకో" అంటూ తన ముందున్న ఓ తెల్లకాగితం తీసి అతనికిచ్చాడు.

వెంకటేశ్వరరావు చకచకా ఆ కాగితం మీద ఏదో చాలా సీరియస్‌గా రాసేసి దాన్ని పూర్ణచంద్రరావుకిస్తూ..

"దిసీజ్ మై రిజిగ్నేషన్" అన్నాడు.

పూర్ణచంద్రరావు అతడిచ్చిన కాగితాన్ని చదివేసి "నీకింకా నాలుగేళ్ళ సర్వీసుంది. ఇంతమంచి ఉద్యోగం వదులుకోవడానికి.. ఆర్యూ ఎ ఫూల్?" అన్నాడు.

"నో.. ఇప్పుడే వైజ్‌మ్యాన్ను అయ్యాను" అంటూ వెంకటేశ్వరరావు తన సీట్లోంచి లేచాడు.

"నువ్వు మారవు.. నీ చుట్టూ ఉన్న సమాజాన్ని మార్చలేవు. కాబట్టి రిజైన్ చెయ్యటం తప్ప నీకు వేరే మార్గం లేదు. మీ దగ్గరున్న సీనియర్ మోస్ట్ లెక్చరర్‌కు ఛార్జి ఇచ్చేసి నువ్వు వెళ్ళిపోవచ్చు. అలా మేం ఆర్డర్స్ పంపిస్తాం" అన్నాడు పూర్ణచంద్రరావు.

ఆ మర్నాడు వెంకటేశ్వరరావు ప్రిన్స్‌పాల్‌షిప్‌కు రాజీనామా చేశాడన్న వార్త అతడు పనిచేస్తున్న కాలేజిలో, ఊరిలో తెలిసిపోయింది.

ఐదారు రోజుల తర్వాత, వెంకటేశ్వరరావు కాలేజికొచ్చి సీనియర్ లెక్చరర్ సాంబశివరావుకు ఛార్జి ఇచ్చేశాడు.

అతడు రాజీనామా చేసి వెళ్ళిపోతున్నాడనగానే ఆ కాలేజీలో పనిచేస్తున్న అందరికీ అతనిమీద జాలి కల్గింది.

గోపాల్, రాధ అతని దగ్గరకొచ్చి భోరు

## కొత్తగాలి...

**అమ్మ ప్రేమను**
**మించింది లేదు లోకాన**
**ఆ ప్రేమకు సరిరాదు**
**ఏదీ.. తూకాన**

*– పట్ల యాదగిరి,*
*గుండాల, నల్గొండ జిల్లా*

మని ఏడ్చారు.

"మీ మంచితనాన్ని అర్థం చేసుకోలేకపోయాను సార్! మీ మీదిచ్చిన కంప్లెయింటును వాపస్ తీసుకున్న సార్" అన్నాడు గోపాల్.

"చెప్పుడు మాటలు విని చెడిపోయిండు సార్! మీరు రాజీనామా చెయ్యకుండ్రి సార్! మీలాంటోళ్ళుంటేనే ఈ కాలేజి బాగుపడ్తది సార్!" అంది రాధ.

"థాంక్స్" అన్నాడు వెంకటేశ్వరరావు.

విద్యార్థుల్లో కొంతమంది, ముఖ్యంగా పీజీ విద్యార్థులు వెంకటేశ్వరరావు దగ్గర కొచ్చి "సారీ సార్! కేవలం మాలో కొందరివల్లే ఇంత ఘోరం జరిగిపోయింది సార్! మెజారిటీ ఆఫ్ స్టూడెంట్స్ మీవైపే ఉన్నారు సార్! కానీ వాళ్ళు మమ్మల్ని మాట్లాడకుండా చేశారు సార్! మీలాంటి వాళ్ళు ప్రిన్స్‌పాల్స్‌గా ఉంటేనే ఈ కాలేజి ఇంకెంతో బాగుపడ్తుంది సార్! మీరిలా అర్థాంతరంగా వెళ్ళిపోవడం మా దురదృష్టం సార్!" అన్నారు.

కొందరు విద్యార్థుల కళ్ళల్లోకి కన్నీళ్ళు ఉబికివచ్చాయి.

వెంకటేశ్వరరావు నవ్వి ఊరుకున్నాడు.

సాంబశివరావుకు చార్జి ఇవ్వడం పూర్తికావడంతో వెళ్ళిపోవటానికి వెంకటేశ్వరరావు లేచి నిల్చున్నాడు.

"మీకు మన స్టాఫ్‌క్లబ్ తరపున వీడ్కోలు పార్టీ అరేంజ్ చేశాం సార్" అంటూ వచ్చాడు దుర్గారెడ్డి.

"అక్కర్లేదు.. నేను వెళ్లిపోతున్నాను" అన్నాడు వెంకటేశ్వరరావు ప్రిన్స్‌పాల్ రూంలోంచి బయటకు నడుస్తూ.

"ఇట్స్ ఎ ట్రాజడీ.. ఇంత మంచి ప్రిన్స్‌పాల్ ఇలా వెళ్ళిపోవడం" అన్నాడు దుర్గారెడ్డి స్టాఫ్‌రూంలోకొచ్చి.

"ట్రాజడీ ఏం కాదు.. ఏం జరగాలో అదే జరిగింది" అన్నాడు సూర్యారావు.

★ ★ ★

"సారీ సార్! ఇంత త్వరగా ఇలా జరుగుతుందనుకోలేదు" అన్నాడు సాంబశివరావు.

"ఇట్స్ ఆల్‌రైట్. కర్మ సిద్ధాంతాన్ని నమ్మేవాళ్ళు అన్నట్టు ఎప్పుడు ఏది ఎలా జరగాలో అలా జరుగుతుందేమో! ఎవరైనా నిర్ణయిస్తారో? లేక దానంతట అదే జరుగుతుందో? నాకు తెలీదు. నాకు 'విధి' అనే దానిమీద నమ్మకం లేదు. మనిషి మీదనే నమ్మకం. ఒక మనిషి తల్చుకుంటే ఎంతైనా సాధించగలడని అనుకునేవాణ్ణి.

నాలోని ఆ నమ్మకం ఇప్పుడు సడలింది. ఎంత సిన్సియర్‌గా ప్రయత్నించినా మనుషుల మైండ్‌సెట్స్‌ని.. ముఖ్యంగా మన భారతీయుల్లోని క్రమశిక్షణా రాహిత్యాన్ని, అలసత్వాన్ని, ఉదాసీనతని మార్చలేం.

ఎనీవే.. నో రిగ్రెట్స్ సాంబశివరావు గారూ! నా అంతరాత్మ చాలా స్వచ్ఛంగా ఉంది. ఏటికి ఎదురీదే ప్రయత్నం చేశాను.. సక్సెస్ కాలేకపోయాను.

ఎవరో ఒక వ్యక్తి చేతిలో అన్ని అధికారాలు ఉంటే తప్ప ఈ సిస్టమ్‌లో ఎవరూ విజయాన్ని సాధించలేరేమో? మన దేశానికి ఈ డెమొక్రసీ పనికిరాదు. డెమొక్రసీలోని మంచిని మనం స్వీకరించటం లేదు. చెడును మాత్రమే తీసుకుంటున్నాం. ఎప్పుడో ప్లేటో చెప్పినట్టుగా ఫిలాసఫర్స్ పాలకులుగా వస్తే తప్ప ఈ దేశం బాగుపడ్తుందనే ఆశలేదు. గుడ్‌బై!" అంటూ వెంకటేశ్వరరావు ఆ కాలేజిలోంచి బయటకు వెళ్లిపోయాడు.

అందరూ అతనివేపు జాలిగా చూస్తూ ఉండిపోయారు.

కొన్నిరోజుల తర్వాత వెంకటేశ్వరరావు తన ఇంటిని కూడా వదిలేసి చాలాదూరం వెళ్లిపోయి ఏదో ఆశ్రమంలో చేరిపోయాడని ఆ ఊర్లో అందరూ చెప్పుకున్నారు. Ⓒ

కాలాతీతం





థియోడర్ డ్రీజర్

# సిస్టర్ కారీ

పద్దెనిమిదేళ్ల కారొలైన్ మీబర్ షికాగోలోని విలాసవంతమైన జీవితం గురించి కలలుగనని రోజు లేదు. ఊళ్లో రైలెక్కి, ఆ మహానగరానికి ప్రయాణం చేసినంత సేపూ అందమైన ఊహల మత్తులో జోగింది. సుఖసంతోషాలకు నిలయం నగర జీవితం. విశాలమైన రోడ్లు, పెద్ద పెద్ద భవనాలు, ఖరీదైన హోటళ్లు, లగ్జరీ వస్తువుల షాపులు ఉంటాయి. భూతల స్వర్గమంటే అదే గద! రైల్లో పరిచయమైన తోటి ప్రయాణికుడు చార్ల్స్ డ్రూట్ ఆమెకు నగరం చూపిస్తానంటాడు.

నగరంలో పెళ్లైన ఆవిడ సోదరి ఓ చిన్న అపార్ట్‌మెంటులో ఉంటోంది. అది మురికి బస్తీ. పేదలకోసం ప్రత్యేకంగా కట్టించిన కాలనీ. ఇలాంటి చోటికి డ్రూట్‌ను రమ్మని ఎలా చెప్పగలదు? సుఖజీవితానికి ఇన్ని అవకాశాలున్న ఈ నగరంలో అక్క ఇంత దీనస్థితిలో ఎందుకు బతుకుతున్నదో అర్థంకాక తన అదృష్టాన్ని పరీక్షించుకోవాలని అనుకుంటుంది. కారీ తొలి ప్రయత్నాలు ఫలించవు. 1889లో షికాగో జనాభా ఐదు లక్షలు. ఆర్థికవ్యవస్థ పుంజుకుంటున్నది. నిరుద్యోగ సమస్య అంతగా లేదు. కాని ఏ నైపుణ్యమూ అనుభవమూ లేని ఆడపిల్లను ఎవరు పనిలో పెట్టుకుంటారు? అతికష్టంమీద, ఒక బూట్ల కంపెనీలో చిన్న ఉద్యోగం సంపాదిస్తుంది. పనెక్కువ. జీతం తక్కువ. కలలు ఆవిరై, రంగు వెలిసిన కర్కశ వాస్తవికత కళ్ల ముందు సాక్షాత్కరిస్తుంది. ఫ్యాక్టరీలోని అనారోగ్యకరమైన పరిస్థితుల వల్ల జబ్బు పడుతుంది. ఉద్యోగం వూడుతుంది. గడ్డిపోచలాంటి ఆర్థిక స్వావలంబన కూడా పోతుంది.

ఒకనాడు యాదృచ్ఛికంగా డ్రూట్ కనిపిస్తాడు. మళ్లీ ఆశ మొలకెత్తుతుంది. ఫ్యాషనబుల్ దుస్తుల్లో డ్రూట్, కారీకి రాజకుమారుడిలాగా కనిపిస్తాడు. ఆమెను డిన్నర్లకూ నాటకాలకూ తీసికెళతాడు. కొత్త డ్రెస్సులు కొనిస్తాడు. 'నీ భారం

నాదే. నిన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాను' అంటాడు. వెరసి కారీ అతడి ప్రేయసిగా కొత్త జీవితం ప్రారంభిస్తుంది. హై సొసైటీ చేరటానికి ఇలాంటి వాళ్లు అవసరమని ఆమెకు తెలుసు.

క్రమంగా డ్రూట్ గ్లామర్ తగ్గుతుంది. అతడి లోపాలు ఒక్కొక్కటీ తెలిసివస్తాయి.

నిజానికి పరిస్థితి ఇలా దిగజారటానికి డ్రూట్ అమాయకత్వమే కారణం. ఒకనాడతడు, తన మిత్రుడు జార్జిహర్ట్స్‌వుడ్‌ను కారీకి పరిచయం చేస్తాడు. జార్జి ఒక పెద్ద హోటల్లో మేనేజర్. మధ్య వయస్కుడు. వివాహితుడే గాని భార్యా బాధితుడు. ఇద్దరు పిల్లలున్నారుగాని వాళ్లకన్నీ తల్లి పోలికలే. ఇంటికి వెళ్లకుండా ఉండటానికి అతడు చెయ్యని ప్రయత్నం లేదు. మిత్రులతో రాత్రింబగళ్లు హోటల్లోనే గడుపుతాడు. పరిచయం తర్వాత హర్ట్స్‌వుడ్, కారీ, డ్రూట్‌ల ఇంటికి రాకపోకలు ప్రారంభిస్తాడు. అతడు డ్రూట్‌కన్నా సంపన్నుడూ, సంస్కారవంతుడని తొలి సమావేశంలోనే గ్రహిస్తుంది కారీ. ఒకనాడు ఉద్యోగరీత్యా డ్రూట్ మరో ఊరికి వెళ్లినప్పుడు కారీపట్ల తన ప్రేమ ప్రకటిస్తాడు హర్ట్స్‌వుడ్. సుకుమారంగా కారీ 'నో' అంటుంది. అది సందేహమో, భయమో కావచ్చు కాని, అయిష్టత కాదని అర్థం చేసుకుంటాడు హర్ట్స్‌వుడ్.

రోజురోజుకూ ఆమెపట్ల కోరిక పెరుగుతుంది. అతడికి కావలిసింది ఒక ఎఫైర్. తాత్కాలిక సంబంధం. కారీ కోరుకుంటున్నది వైవాహిక జీవితం. హర్ట్స్‌వుడ్‌కు పెళ్లైన విషయం ఆమెకు తెలియదు. ఈలోగా డ్రూట్, హర్ట్స్‌వుడ్‌లిద్దరికీ పరస్పరం ఒకరిపై ఒకరికి అనుమానం




పెరుగుతుంది. మిసెస్ హర్ట్స్‌వుడ్, భర్త మీద కోర్టులో కేసు వేస్తుంది. హర్ట్స్‌వుడ్ వివాహితుడని చెప్పి, కారీని తిరిగి తనవైపు తిప్పుకోవాలనుకుంటాడు డ్రూట్. ఇద్దరి మధ్యా దూరం పెరుగుతుంది. అయినప్పటికీ తన అపార్ట్‌మెంట్‌ను స్వేచ్ఛగా ఉపయోగించుకోవటానికి కారీని అనుమతిస్తాడు. కాని కారీ కృతజ్ఞత కూడా చెప్పదు.




ఆమెపట్ల కోరిక చంపుకోలేని డ్రూట్, తన ప్రేమ నిరూపించుకునే అవకాశం కోసం నిరీక్షిస్తాడు. ఒక సాయంత్రం ఇంటికి చేరేసరికి కారీ కనిపించదు. ఉద్యోగాన్వేషణలో ఆమె మరెక్కడికో వెళ్లివుంటుంది. దిగులుగా హోటల్‌కు వచ్చిన డ్రూట్‌ను చూసి అతడు, కారీ విడిపోయి ఉంటారనుకుంటాడు హర్ట్స్‌వుడ్. అంటే తాను కారీని ప్రసన్నం చేసుకోవటానికి ఇదే అనువైన సమయం. ఆఫీసు అకౌంట్లు చూస్తున్న హర్ట్స్‌వుడ్‌కు తెరిచిన సేఫ్ కనిపిస్తుంది. అందులో పదివేల డాలర్లు పై అరలో తన

కోసమే నన్నట్లు నిరీక్షిస్తున్నాయి, సందేహి స్తాడు. ఈ అవకాశం మళ్లీరాదు. డబ్బు తీసుకుంటాడు. దొంగ అనే ముద్ర తన మీద పడుతుంది. మళ్లీ లోపల పెట్టాలను కుంటాడు. కాని అంతలోనే సేఫ్ తలుపు మూసుకుపోతుంది. ఇక చెయ్యగలిగిం దేమీ లేదు, పారిపోవటం తప్ప.

నేరుగా కారీ వద్దకెళ్లి డ్రూట్ ఒక ప్రమా దంలో గాయపడ్డాడని అబద్ధం చెబుతాడు. అతడి కోసం బయల్దేరమని చెప్పి మాంట్రి యాల్(కెనడా) వెళ్లే రైలెక్కుతాడు. హర్ట్స వుడ్ చేతిలో మోసపోయానని కారీకి తెలి సినా దొంగిలించిన డబ్బుతో న్యూయా ర్క్‌లో విలాసంగా గడుపుతారిద్దరూ. పెళ్లి కూడా చేసుకోవాలనుకుంటారు. చట్టరీత్యా భార్య ఉన్నప్పుడు రెండో వివాహం చెల్ల దని ఇద్దరికీ తెలుసు. హర్ట్స్‌వుడ్ ఆమెను గాఢంగా ప్రేమిస్తాడు. డబ్బువల్ల వచ్చిన సుఖంతో తనూ ప్రేమిస్తున్నాననే అనుకుం టుంది కారీ.

హర్ట్స్‌వుడ్ కోసం పోలీసుల వేట కొన సాగుతుంది. త్వరలోనే అతణ్ణి అరెస్టు చేస్తారు. ఖర్చు పెట్టగా మిగిలిన దొంగ సొమ్ము స్వాధీనం చేసుకుంటారు. ఇప్పుడు హర్ట్స్‌వుడ్ పరువు పోయింది. ఉద్యోగం పోయింది. తొలిసారి షికాగో కోర్టులో అడుగు పెట్టినప్పుడు, కారీ ఉన్నంత నిస్స హాయంగా ఉన్నాడు హర్ట్స్‌వుడ్. ఖరీదైన హోటళ్లలో విందు, మందుపార్టీలు కాదు గదా, రోజు గడవటమే కష్టమైపోయింది. 'సంపన్నులు తమ ఆనందంకోసం విలా సాలు సృష్టిస్తారు. పేదల జీవితాలకే అవి చెరసాలలు' అని రచయిత వ్యాఖ్యాని స్తాడు. నమ్మకద్రోహిని ఎవరూ పనిలో పెట్టుకోరు. ఒక 'బార్' కొని నిర్వహించా లనుకుంటాడు. కాని నష్టాలే మిగిలాయి. నిస్పృహగా ఎలాగైనా సంపాదించాలని జూదమాడతాడు. జేబులో చిల్లిగవ్వ కూడా మిగలదు. నిరుద్యోగం వెక్కిరి స్తుంది. నిరాశ, నిర్వేదంతో వ్యక్తిత్వమే పోయినట్టనిపిస్తుంది. తానిప్పుడు మగాడే కాదు. ఒకప్పటి అందమైన, దృఢమైన శరీరం పట్టుసడలి, చలికి అకాల వార్ధ క్యంతో మృత్యువుకు చేరువైనట్టనిపిస్తుంది. గడ్డం చేసుకోవటం ఎప్పుడో మానేశాడు. జుత్తు పెరిగింది. అతడితో కలిసి ఒకే బెడ్‌మీద పడుకోవటానికి ఇష్టపడదు కారీ. ఓ చిన్నగదిలో ఒంటరిగా వుండటం అల వాటు చేసుకుంటాడు హర్ట్స్‌వుడ్. ఉద్యోగం కోసం ప్రయత్నించాలనే కోరిక కూడా చచ్చిపోయింది. కిటికీ పక్కన కూర్చుని, వీధిలో వచ్చిపోయే జనాన్ని చూడటమే కాలక్షేపం. ఆత్మగౌరవంతో, మనుషులుగా బతకలేని వాళ్లేం చేస్తారు? ఒకసారి ట్రాలీ కార్మికులు సమ్మె చేస్తే, యజమానులకు గూఢచారిగా వ్యవహ రించి సమ్మె విచ్ఛిన్నం కావడానికి కారణ మవుతాడు. వీళ్లని స్కాబ్‌లంటారు.

రంగుల కలలను సాకారం చేసుకొనే దిశగా నేర్పుగా ముందుకు కదిలింది కారీ. పొరుగున ఉన్న కుటుంబం వాన్స్ దంప తులతో పోటీపడి భౌతిక సుఖాలకోసం పరిగెత్తుతుంది. పోషించలేని హర్ట్స్‌వు డ్‌ను ఏవగించుకుంటుంది. తన బతుకు తాను బతకాలని ఒక నాటక కంపెనీలో కోరస్ గర్ల్ (ఎక్స్ట్రా)గా చేరి త్వరలో డైలా గులున్న పాత్రలూ, ప్రధాన పాత్రలు కూడా సంపాదించుకుంటుంది. జీవచ్ఛ వంలా బతుకుతున్న హర్ట్స్‌ను వదిలి, డబ్బున్న తన అభిమానులతో కాలక్షేపం చేస్తుంది.

హర్ట్స్‌వుడ్‌కు తలదాచుకోవటానికి నీడ కూడా లేదు. అపార్టుమెంటుకు ఎదురుగా వున్న స్టువ్‌సాంట్ పార్కులో ముష్టెత్తు కుంటాడు. ఒకసారి తనమీద తనకే అస హ్యంవేసి ఆత్మహత్యకు ప్రయత్నిస్తాడు.

# థియోడర్ డ్రీజర్ (1871 - 1945)

దుర్భర దారిద్ర్యంలో గడిచింది థియోడర్ డ్రీజర్ బాల్యం. ఇండియానా రాష్ట్రంలోని టెర్ హాట్ స్కూల్లో చదువుతున్నప్పుడు, బూట్లు లేనందుకు ఇంటికి పంపించారు ఉపాధ్యాయులు. సమాజ ఆర్థిక మూలాలను అర్థం చేసుకోవటానికి సహాయం చేసింది పేద రికం. కుటుంబ కలహాల కారణంగా, పదహారో ఏట ఉద్యోగాల వేటలో షికాగో చేరుకున్నాడు డ్రీజర్. అయితే మహానగరం తళుకు బెళుకులు ఆకర్షించాయి గాని, రోజుకూలీ తప్ప, మరే స్థిర మైన ఉద్యోగమూ దొరకలేదు.

ఇండియానాకు తిరిగి వచ్చి, ఏడాదిపాటు యూనివర్సిటీలో గడిపి, తిరిగి ప్రయాణమ య్యాడు. ఈసారి జర్నలిస్టుగా తన అదృష్టం పరీక్షించుకోవటానికి. ఆ తర్వాత ఇరవయ్యేళ్లు వివిధ పత్రికల్లో చిన్నా పెద్దా అని తేడా లేక అన్ని పనులూ చేశాడు. ఒకసారి స్ట్రింగర్‌గా, మరోసారి ప్రూఫ్‌రీడర్‌గా, సబ్ ఎడిటర్‌గా చేశాడు. 1898లో తొందరపడి పెళ్లి చేసుకు న్నాడు. నిజానికి డ్రీజర్‌కు ఆవిడంటే ఇష్టంలేదు. తర్వాత నలభై ఏళ్లపాటు ఆమె విడాకులివ్వటానికి నిరాకరించింది. 1942లో భార్య మరణానంతరమే డ్రీజర్ తను ప్రేమిం చిన స్త్రీని వివాహం చేసుకున్నాడు.

1900లో అచ్చయిన ఈయన తొలి నవల పాఠకులకు చేరలేదు. కథలోని అనైతిక జీవితం చూసి షాక్‌కు గురైన ప్రచురణకర్త భార్య దీని పంపిణీని అడ్డుకుంది. ఆ తర్వాత మరో పన్నెండేళ్లదాకా అమెరికన్ పాఠకులు 'సిస్టర్ కారీ'ని చదవలేదు. బట్టరిక్ ఫాషన్ మేగజైన్‌ల సంపాదకుడిగా డ్రీజర్‌కు దేశవ్యాప్త గుర్తింపు వచ్చిన తర్వాత మాత్రమే రచయితగా ఆయన గురించి అందరికీ తెలిసింది.

నిజానికి 1911 నాటికే డ్రీజర్ మరో నాలుగు నవలలు- జెన్నీ గెర్హార్డ్, ది ఫైనాన్షి యర్, ది టైటాన్, ది జీనియస్- రాశాడు. కాని ప్రచురణకర్తలకేవీ నచ్చలేదు. ఆనాటి ప్రముఖ విమర్శకుడు హెచ్. ఎల్. మెంకెన్ రచయిత తరపున వకాల్తా పుచ్చుకుని, వ్యాసాలు రాసి, ఆ నవలలకు ప్రాచుర్యం కల్పించాడు. అమెరికన్ ప్రచురణకర్తల మూర్ఖత్వంతో విసిగిపోయిన డ్రీజర్ ఆ తర్వాత ముప్పై ఏళ్లలో ఒకే ఒక నవల రాశాడు. అదే అతని మాస్టర్‌పీస్ 'ఎన్ అమెరికన్ ట్రాజెడీ'(1925). డ్రీజర్ మరణానం తరం మరో రెండు నవలలు వెలుగు చూశాయి.

సోషలిస్టు భావాలు లేకపోయినా, 1930లో డ్రీజర్ వామపక్ష ఉద్యమాల పట్ల మొగ్గు చూపాడు. అమెరికాలోని పేదల కష్టాలకు పెట్టుబడిదారీ విధానమే ప్రధాన కారణమని నమ్మాడు. చివరి రోజుల్లో కమ్యూనిస్టు పార్టీలో చేరాడు. కాని అప్పటికే అమెరికాలో ఆ పార్టీ పతనావస్థకు చేరుకుంది.

గ్యాస్‌పైప్ నోట్లో పెట్టుకుని చచ్చిపోవాలని అతడి వుద్దేశం. కాని గాస్ కొనటానికి పది హేను సెంట్లు కూడా దొరకలేదు.

ఒకనాడు నాటకశాల నుండి అభిమానుల, అరాధకుల కేరింతల మధ్య కారీ వెలుపలికి వచ్చినప్పుడు, ఆమెను దగ్గరగా వెళ్లి చూడా లనుకుంటాడు. కాని ఆ తొక్కిడిలో ఎవరో అతణ్ణి దూరంగా నెట్టేస్తారు. అది చలి కాలం. లేవటానికి కూడా ఓపికలేని హర్ట్స్ రాత్రంతా మంచులోనే గడుపుతాడు. మొత్తంమీద ఎవరో ముష్టివెయ్యగా పదిహే ను సెంట్లు పదిలంగా దాచుకుంటాడు.

రాంకింగ్ చెయిర్‌లో ఒంటరిగా కూర్చుని, జీవితాన్ని సమీక్షించుకుంటున్న కారీతో నవల ముగుస్తుంది. ఆమె కొత్తప్రి యుడు బాబ్ ఏమ్స్ బాగా సంపన్నుడు. ఇప్పుడు తనకు తీరని కోర్కెలు లేవు. అయినా ఏదో అసంతృప్తి. ప్రపంచాన్ని జయించిన తర్వాత కూడా దహించివేసే అంతర్‌గ్లాని. కారీలోనే కాదు, అందరి లోనూ అసంతృప్తి జ్వాల రగులుతూనే ఉంటుందంటాడు డ్రీజర్.

– ఎం. వసంత



# సౌదామిని ఆంటీ!

ఉదయం 11 గంటలు!

"డాడ్‌కి సీరియస్.. వెంటనే వచ్చెయ్‌వే. బావగార్ని, రాహుల్‌గాడ్ని కూడా తీసుకురా" తమ్ముడి నుంచి ఫోన్! ఒక్కసారిగా నరాల్లోని శక్తంతా ఆవిరైనట్లయింది. కళ్లు చెమ్మగిల్లాయి. ఎవరూ గమనించ లేదనుకున్నప్పటికీ పక్కసీట్లోని జానూ మాత్రం పసిగట్టేసింది.

"ఎనీ థింగ్ సీరియస్? "

"డాడీకి సీరియస్‌గా ఉందట. వెళ్తున్నా. బాస్‌కు ఇంటిమేట్ చెయ్! నేను తనకి కాల్ చేస్తానన్నానని చెప్పు" చకచక హ్యాండ్‌బ్యాగ్ తీసుకుని లిఫ్ట్‌వైపు పరుగెత్తాను.

పార్కింగ్ లాట్‌లోంచే కాంత్‌కి కాల్ చేసి విషయం చెప్పేశాను. ఇంటికి వెళ్లి రాహుల్ని తీసుకు రమ్మనిచెప్పాను. బండి నడిపే శక్తిలేకపోవడంతో దాన్నక్కడే వదిలేసి, ఆటో ఎక్కి నేరుగా అమ్మవాళ్ల కాలనీకి బయల్దేరాను.

ఆటోలో వెళ్తున్నంతసేపు ఆలోచనలన్నీ డాడీ చుట్టూనే! మాకోసం ఆయనెంత తపించిపోయేవారో గుర్తొచ్చేసరికి మళ్లీ కళ్లల్లో నీళ్లు! ఆటోవాడు గమనిస్తాడేమోనని, నలకపడినట్టు కళ్లు నులుముకుంటూ మేనేజ్ చేశాను. చిన్నతనం గుర్తొచ్చింది.. తనకొలీగ్స్ వాళ్లపిల్లల్ని ఎక్కడో దూరదూరాన ఉన్న గొప్పస్కూళ్లల్లో చేర్పిస్తే- 'నా



పిల్లల్ని చూడకుండా నేను ఒక్క క్షణం కూడా ఉండలేను' అంటూ డాడీ ఇంటిపక్కనే ఉన్న చిన్న ప్రవేటు స్కూల్లో మమ్మల్ని చదివించారు. ఇంకా చెప్పా లంటే నన్నూ, తమ్ముడ్ని అరచేతుల్లో పెట్టుకుని ప్రాణంగా పెంచుకున్నారాయన.

మా ఇద్దరికీ జున్ను అంటే తెగఇష్టం. మల్కాజిగిరిలో మంచి రుచికరమైన జున్ను దొరుకుతుందని ఎవరో చెప్పారట. ఇంకేముంది? వీలైనప్పుడల్లా పదికిలోమీటర్ల దూరాన ఉన్న మల్కాజిగిరికి వెళ్లి జున్ను తెచ్చి అప్పటికప్పుడే తినిపించేవారు. స్కూలు పిల్లల దశనుంచి ఉద్యోగాలు చేసే దశకు చేరుకున్నా మాకన్నీ ఆయనే ప్రేమగా చేసేవారు.

ఉద్యోగం వచ్చాక తెల్లవారుజామున నేను ఆఫీసుకు బయల్దేరుతుంటే తనూ లేచి కూర్చునేవారు. 'ఎందుకు డాడీ నువ్వు పడుకోవచ్చుగా' అంటే- స్టౌమీది వేణ్ణీళ్లు బక్కెట్లో పోసుకోలేవు.. మీద పోసుకుంటావని భయం..' అంటూ నవ్వేసేవారు. నిజానికి చిన్నప్పుడే కాదు.. పెద్దయ్యాక కూడా ఆయన అన్నం కలిపి నోట్లో పెడితే తప్ప మా ఇద్దరికీ తిన్నట్టుండేది కాదు. పిల్లల్ని గారం చేస్తున్నారంటూ అమ్మ అరుస్తుండేది. అయినా ఆయన పట్టించుకునేవారు కాదు. ఇక మాకు ఒంట్లో ఏమాత్రం నలతగా ఉన్నా ఆయన తల్లడిల్లిపోయే

వారు. బెడ్ దగ్గరే కూర్చుని సేవలు చేసేవారు. ఇంటికి రావడం ఎప్పుడైనా లేటైతే మాకోసం స్కూటర్ తీసుకుని మెయిన్ రోడ్డుకు వచ్చి కూర్చునేవారు. అమ్మకూ ఎంతో పనిచేసి పెట్టేవారాయన. తెల్లవారు జామున లేచి కూరగాయలు తరిగి ఇవ్వడం, విసుక్కోకుండా ఎప్పుడంటే అప్పుడు వంటలో సాయం నుంచి వడ్డన చేయడం వరకూ అన్నీ చేసేవారు.

ఫ్లాట్‌కి చేరుకున్నాను. మేమంటే అనుక్షణం అల్లాడిపోయిన డాడీ అచేతనంగా బెడ్‌పై అపస్మారకస్థితిలో పడుండడం చూసి దుఃఖం పొంగుకొచ్చింది. అమ్మలేచి వచ్చి నన్ను కౌగిలించుకుని భోరుమంది. మరదలు రమ్య కూడా సన్నగా రోదిస్తోంది. తమ్ముడి కూతురు నాలుగేళ్ల అవని, మేమంతా ఏడుస్తుంటే బిక్కమొగం వేసుకుని చూస్తోంది. తమ్ముడు తనకళ్లలో నీళ్లు కనబడనీకుండా తలొంచుకుని కూర్చున్నాడు. చుట్టుపక్కల ఫ్లాట్స్‌లోని ఆప్తులు, ఆత్మీయులు అంతా చేరిపోయారు. అందరి ముఖాల్లోనూ గడ్డకట్టుకున్న విషాదం!




అంతలోనే రాహుల్‌ని తీసుకుని కాంత్, వాళ్ల తమ్ముడు క్రిష్, అత్తయ్య, మామయ్య అంతా వచ్చారు. వచ్చీరాంగానే రాహుల్ నా ఒళ్లోదూరి "తాతకేమైంది మమ్మీ" అంటూ అడుగుతూనే ఉన్నాడు.

మామయ్యగారు తమ్ముడ్ని దగ్గరకు పిలిచి 'ఏమిటి పరిస్థితి?' అని అడిగారు. వాడేదో మాట్లాడాలనుకున్నా గొంతుపెగల్లేదు. పక్క ఫ్లాట్ పవన్ అంకుల్ కల్పించుకుని- "అంతా అయిపోయింది సార్.. గంటో.. అరగంటో అంతే!" అన్నారు.

అంత దుఃఖంలోనూ నాకు చటుక్కున సౌదామినాంటీ గుర్తొచ్చారు. తమ్ముడ్ని పిల్చి, వాడి చెవిలో చెప్పాను. వాడు సాలోచనగా తలూపి బయటకు నడిచాడు.

సౌదామినాంటీ మా కుటుంబానికి ఆత్మబంధువు. ఆర్థికంగా మమ్మల్ని ఎన్నోసార్లు ఆదుకుంది. ఆవిడంటే డాడీకి మహా ఇష్టమని ఇంట్లో అందరికీ తెలుసు. కానీ తప్పుగా అనుకునేవాళ్లం కాదు. వాళ్లిద్దరూ మంచి ఫ్రెండ్సనేది అమ్మ. అమ్మకూ ఆవిడంటే చాలా ఇష్టం. ఆంటీ మా చిన్నప్పుడు తమ్ముడికి, నాకు బర్త్‌డే గిఫ్టులు ఇచ్చేది. ఆంటీ గిఫ్ట్ కోసం ఇద్దరం ఆశగా ఎదురుచూసేవాళ్లం! కారణం ఖరీదైన గిఫ్టేదో తెచ్చేదావిడ! డాడీ ఆంటీ ఇంచుమించు రోజూ ఫోన్‌లో మాట్లాడుకునేవారు. వాళ్లమధ్య సాహిత్య, రాజకీయ చర్చలే ఎక్కువగా సాగేవి. వారానికోసారైనా ట్యాంక్‌బండ్ మీద కలిసేవాళ్లు! అక్కడా వారి ముచ్చట్లు పుస్తకాలు, పేపర్లు, రాజకీయాలు, సాహిత్యం వీటి చుట్టూనే తిరిగేవి. ఎంత చనువున్నా వాళ్లిద్దరూ ఏకవచనంలో పిలుచుకోవడం మేమెప్పుడూ చూళ్లేదు.. 'మీరు' 'మీరు' అంటూ గౌరవించుకునేవారు. చిన్నప్పుడు పెద్దగా తెలిసేదికాదు కానీ ఆవిడవస్తే చాలు.. డాడీ ముఖం మతాబాలా వెలిగిపోయేది.

తమ్ముడికంటే డాడీతో నాకు చనువెక్కువ. అందుకే పీజీలోకి వచ్చాక అప్పుడప్పుడూ ఆంటీ విషయాలు అడిగేదాన్ని. తను చెప్పినదాన్ని బట్టి ఆవిడ తనకు క్లాస్‌మేట్! పరస్పరం ఇష్టమేకానీ ఎందువల్లో ఒకటి కాలేకపోయారు. వాళ్లచుట్టాల్లో ఎవర్నోచేసుకుని ఆవిడ దుబాయి వెళ్లిపోయాక, అమ్మను చేసుకున్నారు డాడీ ఆ తర్వాత. హైదరాబాద్‌లో ఉద్యోగంలో చేరారు. అటు తర్వాత ఇద్దరి మధ్యా

కమ్యూనికేషన్ కట్ అయిపోయింది.

ఏడేళ్ల తర్వాత కాబోలు హఠాత్తుగా డాడీకి ఆమె ఓ రోజు ట్యాంక్‌బండ్ మీద కన్పించారట. అప్పటికే ఆమెకు భర్తపోయారట. దాంతో హైదరాబాద్ వచ్చి, ఇక్కడే ఏదో ఉద్యోగం చేసుకుంటూ తన అన్నగారింట్లో ఉంటున్నారు. అప్పట్నించీ డాడీకి తన ప్రియనేస్తాన్ని తిరిగి కలిపినందుకు ట్యాంక్‌బండ్ అంటే ప్రేమ పెరిగిపోయింది. దాంతో ఆయన ఏకంగా ట్యాంక్‌బండ్‌పై ఓ పద్యశతకమే రాశారట. ఆ పద్యాలు ఆయన చిన్నప్పుడు విన్పిస్తుంటే మాకు చాలా సరదాగా ఉండేది.

ఒంట్లో ఓపిక ఉన్నన్నాళ్లూ అడపాదడపా డాడీ వాళ్లింటికి వెళ్లి, కాసేపు మాట్లాడి వచ్చేవారు. ఆవిడకు వీలున్నప్పుడు మా ఇంటికి వచ్చి ఆయనను చూసి వెళ్తుండేది. క్రమంగా పెద్దవాళ్లు అవడంతో రాకపోకలు కాస్త తగ్గినట్లున్నాయి. నా పెళ్లయ్యాక ఆంటీ వివరాలు పెద్దగా తెలియవు. రెండువారాల క్రితం జరిగిన యాక్సిడెంటుతో నాన్న అపస్మారకానికి చేరుకున్నారు. ట్రీట్‌మెంటయ్యాక డాక్టర్లు చేతులెత్తేశారు. ఆ పరిస్థితుల్లో ఆస్పత్రికన్నా తన కిష్టమైన ఫ్లాట్‌కే తెస్తే డాడీకి మనశ్శాంతని తీసుకువచ్చాడు తమ్ముడు.

సాయంత్రం నాలుగు గంటలు! ఇంటి ముందు ఎవరిదో కారాగింది. అందులోంచి దిగిన ఒక పెద్దావిడ మెల్లగా అతి కష్టమ్మీద మెట్లెక్కి వచ్చింది. వయసు తెచ్చిన మార్పులవల్ల మనిషి ఒడిలిపోయిందే తప్ప ఒకప్పుడు మంచి అందగత్తె అన్పించేలా ఉందావిడ విగ్రహం. మెల్లగా కళ్లజోడు సవరించుకుంటూ వచ్చి డాడీ బెడ్ పక్కన ఉన్న కుర్చీలో కూర్చుని డాడీని తదేకంగా చూస్తోంది. అప్పుడుగానీ నేనావిడ్ని గుర్తుపట్టలేదు.

ఆవిడే సౌదామిని ఆంటీ! ఎప్పుడో నా పెళ్లికి చూశాను. ఆరేడేళ్ల తర్వాత ఇప్పుడే మళ్లీ ఆవిడ్ని చూడడం!

అమ్మకూడా అప్పుడే గుర్తుపట్టినట్టుంది.. ఇద్దరం కల్సి ఆవిడ దగ్గరకు వెళ్లాం. పలకరింపుగా నవ్వాం అనుకున్నాంగానీ ఎవరి నవ్వుల్లోనూ జీవంలేదు.

ఆంటీ చెప్పిందానికి అమ్మ, తమ్ముడు, నేను, కాంత్ ఒప్పుకున్నాంగానీ మామయ్యగారు ఒప్పుకోలేదు. 'ఆవిడేదో చెప్పడం.. తగుదునమ్మా అని మీరు తలూపడం.. మీకేం పిచ్చి పట్టలేదుగదా?' అన్నారు కొంచెం సీరియస్‌గా.

"సారీ అంకుల్.." అని నేనేదో అనబోతుంటే ఆయనలేచి విసవిసా ఫ్లాట్ బయటకు నడిచారు.

★ ★ ★

ట్యాంక్‌బండ్!

ఒక కారు మెల్లగా పోతోంది.. డ్రైవింగ్ సీట్లో తమ్ముడు, వాడిపక్కన నేనూ! అద్దాలు దించేయడంతో సాగర్‌మీది నుంచి వస్తున్న చల్లని గాలి వచ్చి మా ముఖాల్ని తాకుతోంది.

వెనుక సీట్లో కళ్లుమూసుకుని కూర్చున్నారు డాడ్! పక్కనే కూర్చున్న అమ్మ తడవతడవకీ పవిటకొంగుతో కళ్లు ఒత్తుకుంటోంది. వింటున్నారో లేదో కూడా పట్టనట్టు ఆమె పక్కనే కూర్చున్న ఆంటీ డాడీకేదో చెబుతోంది. తథాగతుడ్ని చూపిస్తోంది.. సాగర్‌లో తిరిగే బోట్లు చూపిస్తోంది. శ్రీశ్రీగారి విగ్రహాన్ని చూపిస్తోంది. అలాగే ట్యాంక్‌బండ్ రోడ్డుమీద రెండు మూడు రౌండ్లు వేశాం.

ఆశ్చర్యం? అపస్మారకంలో ఉన్న డాడీ శరీరంలో చిన్నపాటి కదలిక! ఇంటికి వచ్చేసరికి ఆయన కనురెప్పలు బరువుగా తెరుచుకోవడానికి ప్రయత్నించడం చూసి మా అందరి కళ్లలో ఆనందబాష్పాలు!

– చంద్రప్రతాప్

# ప్రపంచంలో పెసరట్టే నాకిష్టం!



'మైనే దిల్ తుజ్‌కో దియా', 'ముసాఫిర్', 'ప్లాన్', 'నోఎంట్రీ' తదితర హిందీ సినిమాల్లోను, 'నరసింహుడు', 'జై చిరంజీవ', 'అశోక్', 'ఊసరవెల్లి' తదితర తెలుగు సినిమాల్లోను నటించిన ఆ ముద్దుగుమ్మ ఉన్నత విద్యాభ్యాసం ముంబైలో జరిగింది. అనతికాలంలోనే తమిళం, మలయాళం, బెంగాలీ సినిమాల్లోనూ నటించిందామె. ఆమె సమీరా రెడ్డి అని మీకీపాటికే తెలిసివుంటుంది. ఆ ముద్దుగుమ్మ తన ఆరోగ్య, సౌందర్య రహస్యాలను విపులంగా వివరించిందిలా..

★ ఉదయం లేస్తూనే ఇరవై నిమిషాల యోగా తర్వాత మరో నలభై నిమిషాలు జిమ్ చేస్తాను. ఎలాంటి వ్యాయామాలు చేయనిరోజు నిద్రప ట్టదు. సన్నబడేందుకేకాక సంతోషంతో ఆరో గ్యంగా ఉండేందుకూ వ్యాయామాలు తప్పనిసరి.

★ ఈతకొట్టడం వల్ల శరీరానికి పూర్తి వ్యాయామం లభిస్తుంది. పార్క్‌లో జాగ్ చేయ డమో, గంట సేపు ఈత కొట్టడమో చేస్తా. ఫిట్ నెస్‌కోసం కథక్, శరీరాకృతి కోసం ఈత నాకు బాగా తోడ్పడుతున్నాయి.

★ రొటీన్ వర్కవుట్లతో బోర్ కొడుతుందని నా ఫిట్‌నెస్ ట్రైనర్ లీనామోగ్రెకు తెలుసు. అందువల్లే పవర్‌యోగా, వెయిట్, సర్క్యూట్ ట్రైనింగ్‌లను వారానికి మూడుసార్లు చేయిస్తారు. అయితే రోజంతా చురుకుగా ఉండాలంటే శరీ రాన్ని మోతాదుకు మించి శ్రమ పెట్టకూడదు.

★ ఉన్నఫళంగా సన్నబడాలనుకోవద్దు. దానికీ సరైన, శాస్త్రీయ, దీర్ఘకాలిక పద్ధతి ఉంది.

★ స్థూలకాయం ఆరోగ్యానికి, అందానికీ చేటు. పౌష్టికాహారం తీసుకుంటూ, వ్యాయామాలు చేస్తూ, ఫిట్‌నెస్ కోల్పోకుండా సన్నబడాలి.

★ ప్రతిరోజూ ఎనిమిది గంటల నిద్ర నాకు తప్పనిసరి. సమయానికి తినడం, నిద్రపో వడంతోనే దేహం కాంతిమంతం అవుతుంది. షూటింగులు లేనప్పుడు మేకప్ వాడను.

★ పళ్లరసాలు మెంతులతో చేసిన హోమ్ మేడ్ ప్యాక్‌ను శిరోజాలకు వాడతాను. అలాగే వాటికి బాగా నూనెపెడతా. ప్రతి రెండ్రోజులకు తలస్నానం చేస్తా. జుత్తుకు రంగులు హాని చేస్తాయి.

★ మొహం కడుక్కుని ఎప్పుడూ ఫ్రెష్‌గా ఉం టా. తమ గురించి పాజిటివ్‌గా ఆలోచించేవారి

మొహం దీప్తిమంతంగా ఉంటుంది.

★ పెరుగు, తేనెతో మర్దన చేసుకుని స్నానం చేస్తాను. ఏప్రికాట్ స్క్రబ్‌తో ఒళ్లు రుద్దుకుని కస్తూరి క్రీమ్ పూసుకుంటాను.

★ రోజుకు రెండు భారీ భోజనాల కంటే చిన్న ప్రమాణాల్లో అనేకసార్లు తినడం మంచిది.

★ ఉదయం బ్రేక్‌ఫాస్టులో బొప్పాయి, పియర్స్ ఎక్కువగా తింటాను. టీ, కాఫీ, మద్యానికి దూరం. సోయాపాలు, అలోవీరా జ్యూస్ తాగుతా. ఇవి శరీరంలోని వ్యర్థాలను వెలికి పంపించేస్తాయి.

★ నా మధ్యాహ్న భోజనం శాకాహారమే. అయితే అరుదుగా చికెన్, సలాడ్, తాళింపు పెట్టని కూరగాయలు, రెండు రోటీలు తినేస్తాను.

★ సాయంత్రం స్నాక్స్‌లో పళ్లు, గిన్నెడు మొలకెత్తిన విత్తనాలు, ఇతర గింజల్ని తింటా.

★ రాత్రి భోజనం 8-9 గంటల మధ్యలో పూర్తవ్వాల్సిందే. మాంసపు కృత్తులు ఉండే బలవర్ధక ఆహారం తీసుకుంటాను. అందులో చికెన్, కాయగూరలు తప్పనిసరి. కొన్నిసార్లు ఫిష్, సలాడ్, మౌసంబి లేదా కారెట్ జ్యూస్ తీసుకుంటా.

★ రాత్రి తొమ్మిది తర్వాత భోజనం మంచిది కాదు. కారణం శరీరంలో జీవక్రియల వేగం తగ్గడంవల్ల ఆలస్యంగా తిన్నది సరైన రీతిలో శరీరానికి వినియోగపడదు.

★ ప్రపంచంలో అన్నిటికంటే నాన్‌స్టిక్ పెనం మీద వేసిన పెసరట్టు అంటేనే నాకు చాలా ఇష్టం. ఇది ఆరోగ్యానికి ఎంతో మంచిది.

★ మనం ఏం తింటామనేదానిపై ఎలా కన్పిస్తున్నామనేది ఆధారపడుతుంది. నేను ఆహారం విషయంలో చాలా జాగ్రత్తవహిస్తాను.

★ సాధ్యమైనంతవరకూ బయటి ఆహారం తినను. షూటింగులప్పుడు ఇంటినుండే టిఫిన్, భోజనం పట్టుకెళతా.

★ ఆల్కహాలు నా ఒంటికి పడదు. అదంటేనే అలర్జీ. నేనెప్పుడూ తాగను. కనీసం కూల్‌డ్రింక్స్ కూడా తీసుకోను. అలాగే వంటనూనె, బాగా మసాలా దట్టించిన ఆహారాల్ని తినను.

★ భోజనమప్పుడు పాతికభాగం కడుపు



సమీరా రెడ్డి

ఖాళీగా పెట్టుకోవాలనే నియమాన్ని పాటిస్తాను.

★ ఎప్పుడైనా అసిడిటీ సమస్య వస్తే నీళ్లలో నిమ్మరసం కలిపి తాగుతాను. నిజానికిది చాలా మంచిది. చాలామంది ఇది అసిడిటీని ఎగదోస్తుందని అపోహ పడతారు.

★ మనస్సుకూ, దేహానికి మధ్య లంకెవల్ల అవి పరస్పరం ప్రభావితం చేసుకుంటాయి. నా వరకు బాగా ఎక్సర్‌సైజు చేసిన రోజు మామూలుకంటే పాజిటివ్‌గా, మరింత స్ట్రాంగ్‌గా భావిస్తాను.

★ సినీతార కావడంవల్ల నా శరీరాన్ని నిర్లక్ష్యం చేయలేను. రోజూ వ్యాయామం తప్పనిసరి. షూటింగ్‌ల నిమిత్తం దూరాభార ప్రయాణాల వల్ల కూడా నా ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడుకుంటాను.

★ ఎవరూ తమ ఆరోగ్యాన్నీ, అందాన్నీ నిర్లక్ష్యం చేసుకోకూడదనేది నా అభిప్రాయం.

– కేఆర్

# విలక్షణ కన్నడ కస్తూరి



డా. యు.ఆర్. అనంతమూర్తి

**కన్నడ సాహితీరంగంలో నవోదయ ఉద్యమం బలపడుతున్న దశలో డా.యు. ఆర్.అనంతమూర్తి సంప్రదాయ నేపథ్యంలో సృజనాత్మకత కోణం నుంచి ఓ నవ్యరీతిని పరివ్యాప్తం చేశారు. అదే భూమికతో విల క్షణ శోభితమైన రచనలు చేసి, అగ్రపంక్తిని అలంకరించారు. తన రచనల్లో నైతికతకు ప్రత్యేకస్థానం కల్పించారు. పరిస్థితులు చుట్టుముట్టినప్పుడు మనిషిలోని తాత్వికత ఎలా పరిణమిస్తుందో చిత్రించారు. సంస్కార, భారతీపుత్ర, భవ తదితర గొప్ప నవలలు ఆయన కలం నుండి జాలువా రాయి. ప్రశ్న, మౌని వంటి మంచి కథలను అనేకం రాశారు. డా.అనంతమూర్తి సృజనా త్మక కృషిని 1974-93 మధ్య కాలంలో భారతీయభాషల్లో వెలువడిన సర్వోత్తమ సాహిత్యంగా పరిగణించడంతో 1994లో జ్ఞానపీఠ పురస్కారం వరించింది.**

అనంతమూర్తి కర్నాటక రాష్ట్రం షిమోగా జిల్లా తీర్థహళ్లి తాలూకా మిలిగె గ్రామంలో 1932 డిసెంబరు 21న జన్మించారు. జ్ఞానపీఠపుర స్కార గ్రహీత 'కువెంపు' ఆ తాలూ కాకు చెందిన వ్యక్తే కావడం విశేషం. ఆయన పుట్టిందొక అగ్ర హారం. ఆ గ్రామం అడవులు, పర్వతాలతో అందాలు నింపుకున్న మలనాడు ప్రాంతంలో వుంది. వారిల్లు అడవికి దగ్గర్లో వుంది. చుట్టుపక్కల పాఠశాలలు లేవు. అయిదో సంవ త్సరంలో తల్లి అక్షరాలు దిద్దిచ్చింది. తండ్రి, తాత చదువు చెప్పారు. తండ్రి గోమాతపై చది వించిన 'గోవిన హాడు' కవిత అనంతమూర్తిపై ఎంతో ప్రభావం చూపింది. తండ్రిది లౌకిక - వైదిక సంప్రదాయాల మధ్యస్థ వైఖరి. అనంత మూర్తి దూర్వాసపురాలో సంస్కృత వ్యాకరణం, రఘువంశం శ్లోకాలు నేర్చుకున్నారు. చిన్నప్పుడు విన్న సంగతులు మనసులో భద్రపరచుకున్నా రు. ఆ దశలోనే అంటరానితనాన్ని నిరసించారు. తీర్థహళ్లి హైస్కూలు చదువు కన్నడ మాధ్య మంలో సాగింది. మైసూరు మహారాజా కళాశా లలో చేరారు. అక్కడ డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ అధ్యాపకులుగా వుండేవారు. అనంతమూర్తిని జయప్రకాష్ నారాయణ, లోహియా భావజాలం ఆకర్షించింది. క్రియాశీల సోషలిస్టు కార్యకర్తగా మారారు. కగోడు రైతాంగ పోరాటంలో పాల్గొ నడం వల్ల ఇంటర్మీడియెట్‌లో మొదట ఉత్తీర్ణుడు కాలేదు. అయితే సాహిత్యాన్ని రాజకీయాలతో అనుసంధించే నేర్పు అలవడింది. కరపత్రాలన్నీ ఆయనే రాసేవారు. వారి కుటుంబం షిమోగాకు తరలిన తర్వాత ఉన్నత విద్య కొనసాగించారు. 1956లో ఎం.ఎ.పట్టా పొంది షిమోగాలోని మెహ సిప్ కళాశాలలో తాత్కాలిక అధ్యాపకుడిగా చేరారు. తర్వాత మైసూరు వచ్చి ఆనర్స్ చది వారు. కామన్వెల్త్ స్కాలర్‌షిప్ పొంది బర్మింగ్ హామ్ విశ్వవిద్యాలయం నుంచి ఇంగ్లీష్ అండ్ లిటరరీ క్రిటిసిజమ్ సిద్ధాంత గ్రంథానికి పిహెచ్.డి. డిగ్రీ స్వీకరించారు. ఆయన పర్యవే క్షకుడు, ప్రముఖ నవలా రచయిత బ్రాడ్‌బరీ అనంతమూర్తి వయస్సువాడే. ఇరువురూ కలిసి సినిమాలు చూసి చర్చించుకునేవారు. ఇంగ్లండు నుంచి తిరిగి వచ్చి మైసూరు విశ్వవిద్యాల

యంలో ఆంగ్లశాఖలో ఆచార్యపదవి స్వీకరించారు. తదనంతరం ఎన్నో ఉన్నత పదవులు ఆయనను వరించాయి. కేరళలోని కొట్టాయం మహాత్మాగాంధీ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడిగా, నేషనల్ బుక్ ట్రస్ట్ అధ్యక్షుడిగా, కేంద్ర సాహిత్య అకాడమీ అధ్యక్షుడిగా, జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం, శివాజీ విశ్వవిద్యాలయం, టఫ్ట్స్ విశ్వవిద్యాలయం, ఎబర్‌హార్డ్ కార్ల్ విశ్వవిద్యాలయం తదితరాలకు గౌరవాచార్యుడిగా, పూనాలోని ఫిలిం అండ్ టెలివిజన్ సంస్థ అధ్యక్షుడిగా డా. అనంతమూర్తి విశిష్ట సేవలందించారు.

ఆయన విద్యార్థి దశలోనే రచనా వ్యాసంగం ఆరంభమైంది. తాను పరిశీలించిన, తన అనుభవంలోకి వచ్చిన సంఘటనలకు అద్భుత సృజన జోడించి కథలుగా, నవలలుగా మలచడంలో ఆయన ప్రతిభ అసమానం. 'తరంగిణి' పేరుతో లిఖిత పత్రిక నడిపేవారు. అందులో కన్నడ, సంస్కృత, ఆంగ్ల రచనలు ఉండేవి. అనంత




మూర్తి తొలిరచన ఆ పత్రికలో వచ్చింది. హరిజనవాడల్లో ప్లేగు ప్రబలినప్పుడు పారిపోయిన ఒక యువతి కథ అది. గోప్యం కోసం రూపకాత్మంగా రాశారాయన. 'సంస్కార' నవలకిది బీజం. సనాతన హిందూ కుటుంబాలపై రాజకీయ, సామాజిక, ఆర్థిక పరిణామాల ప్రభావాలు ఆయన రచనలకు వస్తువులయ్యాయి. 'సూర్యన కుదురె' కథ గొప్పశిల్పానికి ఉదాహరణ. సూర్యాశ్వమని అర్థం. కానీ కన్నడంలో ఈ పదం మిడతని సూచిస్తుంది. బాల్యంలో డా. అనంతమూర్తి తండ్రి దగ్గరకు జ్యోతిషం నేర్చుకునేందుకు వచ్చిన ఒక అమాయకుని జీవితం ప్రేరణగా రాసిన కథ ఇది. భిన్న ప్రవృత్తులున్న భావికెరెవాసి కుప్పన్నభట్ట, సీబినకెరెవాసి అప్పన్నభట్ట మధ్య నిత్యవైరాన్ని 'మౌని' కథ చిత్రిస్తుంది. అనంతమూర్తి తల్లిగారి ఊళ్లో సాధువులా జీవించే పూజారితో పరిచయం, అతనిచ్చిన పుస్తకం నుంచి పదిరూపాయల నోటు తస్కరించి, అతనిలా మారిపోయే ప్రమాదం నుంచి బయటపడ్డ అనుభవం 'ఘట శ్రాద్ధ' కథకు భూమిక. 'అక్కయ్య' కథలో ప్రధాన పాత్ర శ్రీనివాస. అతనిపై పెద్దక్క తాత్విక గంధం అలముతుంది. అది తొలగిపోయినప్పుడు శ్రీనివాస నిజ వైఖరిని డా. అనంతమూర్తి, ప్రతిభాన్వితంగా ఆవిష్కరించారు. 'ఎందెందూ ముగియద కథె', 'ప్రశ్నె', 'మౌని', 'ఆకాశముట్టబేకు', 'ఎరడుదశకద కథెగళు', 'మూరు దశకద కథెగళు' ఆయన కథా సంపుటాలు. ఆయన నవల 'సంస్కార' అంతర్జాతీయ ఖ్యాతిపొందింది. చిన్నప్పుడు లిఖిత పత్రికలో తాను రాసిన కథను పెంచి బర్మింగ్‌హామ్‌లో వారం రోజుల్లోనే 'సంస్కార' నవల రాశారు. కులవ్యవస్థ, అంటరానితనం, సాంఘికదురాచారాలపై దీనిలో చర్చ వుంది. అగ్రవర్ణానికి చెందిన వివాహితుడు కింది కులానికి చెందిన యువతితో ఒకరాత్రి గడిపిన మీదట తీవ్ర ఘర్షణకు లోనైన వైనం ఇందులో చూపారు. కథ సంవిధానం ఉత్కంఠ భరితంగా, ఉద్విగ్నంగా సాగుతుంది. వాస్తవికత, ప్రతీకాత్మకత మేళవించుకున్న నవల 'సంస్కార'. అగ్రవర్ణానికి చెందిన జగన్నాథ పాశ్చాత్య విద్యాధికుడై హేతువాద దృక్పథం అలవరచుకోవడంతో తన అగ్రహారంలోనే పరాయివాడు కావడం 'భారతపుత్ర' నవల ఇతివృత్తం. 'అవస్థే' నవలను దేశంలో ఆత్యాయిక పరిస్థితి తర్వాత 1978లో ఆయన రాశారు. ఇందులో రాజకీయ దృష్టికోణం చోటుచేసుకుంది. 'భవ', 'దివ్య' నవలలు సైతం విలక్షణ ఇతివృత్తాలతో ప్రత్యేకతను సంతరించుకున్నాయి. డా. అనంతమూర్తి కవితలు నాలుగు సంపుటాల్లో వెలువడ్డాయి. 'ఆవాహిని' నాటకం, ఐదు వ్యాస సంపుటాలు కూడా వెలువరించారు.

డా. అనంతమూర్తి రచనలు పెక్కు దేశ, విదేశీ భాషలలోకి అనువాదమయ్యాయి. ఆయన సోవియట్ యూనియన్, హంగరీ, ఫ్రాన్స్, జర్మన్, చైనా మొదలైన దేశాలు సందర్శించారు. కర్నాటక సాహిత్య అకాడమి, కర్నాటక ప్రభుత్వం పురస్కారాలు, మాస్తి ప్రశస్తి, హిమాచల్ ప్రదేశ్ పురస్కారం, భారతీయ భాషా పరిషత్ పురస్కారం, రవీంద్రభారతి విశ్వవిద్యాలయ గౌరవ డాక్టరేటు మొదలైనవి అందుకున్నారు. కేంద్ర ప్రభుత్వం పద్మభూషణ్ బిరుదం ప్రదానం చేసింది.

డా. యు.ఆర్. అనంతమూర్తి మరెన్నో రచనలతో మున్ముందు కూడా సాహితీరంగాన్ని మరింత సంపన్నం చేయగలరని కన్నడ భాషాభిమానులు విశ్వసిస్తున్నారు.

**– గోవిందరాజు రామకృష్ణారావు**

పెద్ద కథ

# పక్షులు

డిసెంబరు మూడున రుతుపవనాలు రాత్రికి రాత్రే మారి చలికాలం వచ్చేసింది. అంతవరకు శరద్రుతువు ప్రశాంతంగా, హాయిగా గడిచింది. చెట్ల ఆకులు గోధుమ రంగులోనూ, బయళ్లు ఇంకా హరితవర్ణం లోనూ ఉన్నాయి. దుక్కి దున్నిన నేల చక్కగా ఉంది.

నాట్ హాకెన్ యుద్ధంలో క్షతగాత్రుడవడం, పింఛను తీసుకుని ఉండడంతో పొలంలో పూర్తి పనివేళలు పనిచేయనవసరం లేదు. వారానికి మూడు రోజులు పనిచేసేవాడు. తనకిచ్చే పనులు కూడా తేలికవి- కంచెలు కట్టడం, కట్టడాల మరమ్మతు మొదలైనవి.

పెళ్ళై పిల్లలున్నప్పటికీ ఏకాంతాన్ని అభిలషించే మనస్తత్వం అతనిది. తన పనిని ఒంటరిగా చేసుకోవడమే అతనికి ఇష్టం. కాలువకి కట్ట కట్టడం, పొలం చివర సముద్రానికి చేరువగా ఏదో తలుపు బాగుచేయడం వంటి పనులు అతనికి ఎంతో నచ్చేవి. అపరాహ్ణవేళ, తన భార్య చేసి ఇచ్చిన పేస్ట్రీ తింటూ కొండచరియపై కూర్చుని పక్షులను చూస్తూ విశ్రాంతి తీసుకుంటాడు.

ఆంగ్ల మూలం : డాఫ్నె డ్యూమారియర్
అనువాదం : కోపల్లె శ్రీనాథ్

వసంతంకన్నా శరద్రుతువు ఇందుకు అనువుగా ఉంటుంది. వసంతంలో పక్షులు సముద్రతీరం వదలి లోపలికి, ఏదో లక్ష్యంతో, దీక్షతో వస్తాయి. వాటికి తమ గమ్యం తెలుసు. తమ జీవితంలోని క్రమపద్ధతులలో ఆలస్యానికి తావులేదు. శరత్తులో తీరాలు దాటి వలసపోని పక్షులు అదేవిధమైన తొందరలో ఉన్నప్పటికీ తమదైన ఒక పంథాననుసరించేవి.

అయితే ఇప్పుడు అవి పెద్ద పెద్ద బారులుగా ఎగురుతూ అసహనంగా, అనిశ్చితంగా తమ శక్తిని ఎగరటంలో వృథా చేస్తున్నాయి.

నల్లనివి, తెల్లనివి, కొంగలు, జెముడు కాకులు చిత్రమైన రీతిలో కలిసి తిరుగుతూ ఓ స్వేచ్ఛకోసం, అసంతృప్తితో నిలకడ లేనట్లు కనిపిస్తున్నాయి. స్టార్లింగ్స్ గుంపులు అదే అలమటింపుతో కొత్త ప్రదేశాలకు తరలాయి. చిన్న చిన్న పిట్టలు చెట్ల నుండి పచ్చికలపై వాలసాగాయి.

వాటినీ, సముద్ర పక్షులనూ నాట్ గమనించసాగాడు. తీర ప్రాంతంలో అవి సముద్రపు పోటు కోసం వేచి ఉన్నాయి. వాటికి చాలా సహనం ఉంది. ముత్యపు చిప్పలు పట్టేవి. ఎర్రపిట్టలు, సాండర్‌లింగ్స్ నీటికివతల కాచుకున్నాయి. సముద్రపు అలలు మెల్లగా తీరంచేరి తిరోగమిస్తూ కలుపుమొక్కలను పైకి వదిలితే, సముద్ర పక్షులు ఒడ్డున పరుగులు తీశాయి. అప్పుడే గాలిలో ఎగరాలనే కోరిక కలిగి, క్రీంకరిస్తూ, ఈలలు వేస్తూ, అరుస్తూ తీరం వదలి సాగరంపైకి పోయాయి. త్వరపడండి! వేగంగా వెడలిపోండి! కానీ ఎక్కడికి? ఎందుకోసం? శరత్తులోని అనిశ్చలత, అసంతృప్తి, వేదన మంత్రించినట్లుగా వాటిని గింగిరాలు తిప్పి రోదింప



జేస్తున్నాయి. శిశిరం వచ్చేలోగా తమ ఈ వేగ గమనాన్నంతా వదలాలి.

బహుశా శరత్తులో ఈ పక్షులకు ఏదో హెచ్చరిక వస్తుందేమో అని తలపోశాడు నాట్. శిశిరం వస్తోంది. ఈ పక్షులలో ఎన్నో నశిస్తాయి. కనుక అకాల మరణమాసన్నమైన వ్యక్తులలాగే అవి కూడా తమ సత్తువన్నంతా ఖర్చు చేయదలుస్తాయి. రోజులు నిశ్శబ్దంగా ఉండటం చేతనేమో ఈసారి మాత్రం అవి మరింత ఉద్రిక్తంగా కనిపిస్తున్నాయి. పశ్చిమ కనుమల సానువులలో ట్రాక్టరు నడుపుతున్న రైతు క్షణకాలం ఈ పక్షుల బారుల వెనుక మరుగునపడిపోయాడు. ఇంతకు మునుపటికన్నా విహంగాల విహారం ఈసారి ఎక్కువగా ఉన్నదని నాట్ గ్రహించాడు. ఇంత భారీ సంఖ్యలో, ఇంతటి కలకలం ఎప్పుడూ లేదు. ఆ రోజు పని ముగియగానే ఈ

మాటే నాట్ చెప్పాడు.

దానికి రైతు, "అవును. నేనూ గమనించాను. ఎక్కువగానే కాదు, ఈసారి అవి మరింత నిర్భయంగా ట్రాక్టరును సమీపించాయి. ఒకటి రెండు గల్స్ ఎంత దగ్గరగా వచ్చాయంటే నా క్యాప్ తన్నేస్తాయేమోనను కున్నాను. కళ్ళలోపడే సూర్యరశ్మి, తలపైన పక్షుల వల్ల నేనేం చూస్తున్నానో నాకే కనబడటంలేదు. వాతావరణం మారుతోంది. ఈ చలికాలం చాలా గడ్డుగా ఉండబోతోంది. అందుకే పక్షులు ఇలా రొద పెడుతున్నాయి" అన్నాడు.

చేల వెంబడి గృహోన్ముఖుడైన నాట్ పశ్చిమ కనుమల్లో మూగిన పక్షి సమూహాన్ని, అస్తమిస్తున్న సూర్యరశ్మిలో చూశాడు. గాలి లేదు. సముద్రం నిశ్చలంగా, నిండుగా ఉన్నది. కానీ రైతు చెప్పింది నిజమైంది. ఆ రాత్రి వాతావరణం మారిపోయింది. నాట్ పడకగది తూర్పు దిక్కున ఉంది. రెండు గంటలకు మేల్కొన్నప్పుడు చిమ్నీలో గాలిహోరు విన్నాడు. వర్షపాతం తెచ్చే ఈశాన్య పవనాలు కావు. తూర్పు దిక్కునుండి వీచే చలి గాలులు. గాలికి వదులైన పెంకు ఏదో ఇంటిపైన గలగలమంటోంది. దూరంగా సముద్రఘోష. ఆ చిన్నగదిలో గాలికూడా చలిగా మారింది. తలుపు కింద నుండి గాలి వచ్చి పక్కను చెదరగొట్టింది. దుప్పటి మరింత దగ్గరగా కప్పుకుని, మెలకువతో అప్రమత్తంగా, ఏదో అకారణమైన వ్యాకులతతో ఉన్నాడు నాట్.

అప్పుడు వినిపించింది, కిటికీపై టకటకమనే శబ్దం. అదేపనిగా ఆగకుండా సాగుతున్న ఆ శబ్దం చికాకు కలిగించింది. లేచి కిటికీ తలుపు తీయగానే ఏదో తన చేతిని రాసుకుని మునివేళ్ళను గాయపరచింది. అప్పుడు తపతపమనే రెక్కలు గమనించాడు. అంతలోనే అది వెలుపలికి ఎగిరిపోయింది. అదేదో పక్షి అని తెలిసింది కానీ ఏ జాతిదో గ్రహించలేకపోయాడు. బహుశా ఈదురుగాలి నుండి రక్షణ కోసం కిటికీని ఆశ్రయించి ఉంటుంది.

కిటికీ మూసి తిరిగి పక్క చేరాడు. మునివేళ్ళను నోటికి చేర్చాడు. ఆ పక్షి రక్తం వచ్చేలా గాయపరచింది. భయవిహ్వలతతో ఆ చీకటిలో ఆశ్రయం కోరి అలా పొడిచి ఉండవచ్చునని ఊహించాడు. తిరిగి నిద్రకు పక్రమించాడు.

ఇంతలోనే మళ్ళీ టకటకమనే ధ్వని, ఈసారి మరింత ఉద్ధృతంగా నిరంతరాయంగా వినవచ్చింది.

ఆ శబ్దానికి మేల్కొన్న అతని భార్య, "అదేమిటో చూడు. కిటికీ తలుపు, టకటకమంటోంది" అన్నది.

"నేనప్పుడే చూసాను. ఏదో పిట్ట లోనికి రావాలని ప్రయత్నం చేస్తోంది. ఆ హోరు గాలి వినబడటం లేదా? అదే పక్షులను ఆశ్రయంకోసం తరుముతోంది" అన్నాడు.

"ఆ చప్పుడుతో నిద్రపోలేకుండా ఉన్నాను. దాన్ని తరిమెయ్"

రెండోసారి కిటికీవైపు వెళ్ళి రెక్క తీయగానే ఒకటి కాదు, అరడజను పక్షులు ఒక్కసారిగా అతని ముఖంపై దాడి చేశాయి.

అతను గట్టిగా అరిచి, చేతులతో వాటిని ప్రతిఘటించి చెదరగొట్టాడు. అవీ బయటకు ఎగిరిపోయాయి. వెంటనే కిటికీ తలుపులు మూసి గడియ బిగించాడు.

"చూశావా! నా మీదకు వచ్చి కళ్ళు పీకడానికి ప్రయత్నించాయవి!" అంటూ కిటికీ వద్ద నిలబడి చీకట్లోకి దృష్టి సారించినా అతనికేమీ అగుపడటంలేదు.

నిద్రమత్తులో ఉన్న భార్య ఏదో గొణిగింది. ఆమె మాటకు, "నేనేమీ కల్పించటం లేదు. అవన్నీ ఇంకా ఇక్కడే కాచుకున్నాయి" అని కోపంగా అన్నాడు నాట్.

అకస్మాత్తుగా పిల్లల గదినుండి

భయంతో కేకలు వినిపించాయి. "జిల్ అరుస్తోంది! ఏం జరిగిందో వెళ్ళి చూడు" లేచి కూర్చుని అంది భార్య.

కొవ్వొత్తి వెలిగించి తలుపుతీసి లోపలకు అడుగుపెట్టగానే ఈదురుగాలి దాన్నార్పివేసింది. ఇంతలోనే మరొక ఆక్రందన. తమ ఇద్దరు పిల్లలదే వినవచ్చింది. ఆ గదిలోకి అడుగిడగానే తనచుట్టూ కొట్టుకుంటున్న రెక్కలు తగిలాయి. కిటికీ తలుపు పూర్తిగా తెరిచి ఉంది. అందులోంచి వస్తున్నాయి పక్షులు. ముందు పైకప్పును, గోడలను కొట్టుకుని, తమదారిలో అటూ ఇటూ వేగంగా తిరుగుతూ, పిల్లలవైపు వెళ్ళాయి.

"మరేం ఫరవాలేదు. నేనొచ్చాను" అనగానే పిల్లలు భయంగా అరుస్తూ అతన్ని కరుచుకున్నారు. ఆ అంధకారంలో పక్షులు మళ్ళీ అతనిపైకి దూకసాగాయి.

"ఏమైంది నాట్?" అంటూ అతని భార్య అవతలి గదినుండి అంటుండగా అతను పిల్లలను వరండాలోకి తోసి, తలుపు మూసాడు. ఇప్పుడు పక్షులతో తనొక్కడే ఒంటరిగా! దగ్గరలోని పక్కమీంచి దుప్పటి తీసి అదే ఆయుధంగా కుడి ఎడమలకు అటూ ఇటూ గాలిలో విసిరాడు. చుట్టూ పక్షులు కిందపడిన శబ్దాలు, రెక్కల చప్పుడు వినిపించినా, అవి ఇంకా ఓడిపోలేదని, తన చేతులను తమ వాడి ముక్కులతో మళ్ళీ మళ్ళీ పొడుస్తూండడంతో తెలుస్తోంది. దుప్పటి కేవలం ఆత్మపరిరక్షణా పరికరమే అయింది. తన తలపైనుండి దాన్ని కప్పుకుని మరింత చీకటిలో ఒట్టి చేతులతో పోరాడసాగాడు. తలుపు తీసి ఆవలిగదికి వెళ్తే పక్షులు తనను అనుసరిస్తాయనే భయంతో ఆపని చేయలేదు.

ఎంతసేపు వాటితో యుద్ధం చేసాడో తెలీదుకానీ, చివరకు క్రమంగా శబ్దం తగ్గిపోయింది. దుప్పటిలోనుండి చిరువెలుగును అతను గ్రహించాడు. కొంతసేపు చెవులు రిక్కించి వినసాగాడు. అవతలి గదిలో పిల్లల్లో ఒకరి రోదన తప్ప మరోధ్వని లేదు. పక్షుల శబ్దాలు ఆగిపోయాయి.

దుప్పటిని తలపైనుంచి తొలగించి చూసాడు. ఉదయపు నీరెండ గదిలో పరుచుకుని ఉంది. ఉషోదయపు వేళ, తలుపులు తెరచేవుండటంతో జీవించి ఉన్న పక్షులు వెళ్లిపోయాయి. మరణించినవి మాత్రం నేలపై పడి వున్నాయి. ఆ చిన్న చిన్న పక్షులను అసహ్యంతో, ఆశ్చర్యంతో పరికించాడు నాట్. అన్నీ చిన్న చిన్న పక్షులు. రమారమి ఏభైదాక ఉండవచ్చు. రాబిన్స్, పించెస్, పిచ్చుకలు, లార్క్స్, బ్రాంబ్లింగ్స్ అన్నీ ప్రకృతిసిద్ధంగా తమ పరిసరాలకు, స్వజాతి సమూహాలకు కట్టుబడి ఉండేవే. కానీ ఇప్పుడన్నీ ఇతర జాతులతో కలిసి యుద్ధకాంక్షతో గోడలకు కొట్టుకునో, తన చేతి దెబ్బలకో చనిపోయి పడి వున్నాయి. కొన్ని ఈకలను కోల్పోతే, ఇంకొన్ని తన రక్తంతో తడిసిన ముక్కులతో పడి ఉన్నాయి.

జుగుప్సతో తలతిప్పి, నాట్ కిటికీలోంచి తోటలోకి చూసాడు.

దట్టమైన పొగమంచు ఆవరించి, నేలంతా గడ్డకట్టి నల్లగా మారింది. మనసును ఆహ్లాదపరిచే తెల్లని మంచు కాదది. ప్రాగ్వీచికలు తెచ్చే నల్లని మంచు. సముద్రం మరింత భీషణంగా ఉరకలు వేస్తోంది. కానీ ఎక్కడా పక్షుల జాడ లేదు. పిచ్చుకల కిచకిచలు, కోయిలల కూతలు, నల్లపిట్టల ఆహారాన్వేషణ ఏ మాత్రం లేవు. అతని భార్య, పక్కన నిద్రపోతున్న పిల్లతో, తన ఒడిలో ముఖానికి కట్టుకట్టిన చిన్నవాడితో కూర్చుని ఉంది. కిటికీలకు పరదాలు వేసి ఉన్నాయి. కొవ్వొత్తులు వెలిగించి ఉన్నాయి. ఆ పసుపుపచ్చ కాంతిలో ఆమె ముఖం వింతగా ఉంది. నిశ్శబ్దంగా ఉండమని సైగచేసింది.

"ఇప్పుడే నిద్రపోతున్నాడు. ఏదో వీడి కంటికొసల దగ్గర గీసింది. పక్షులే అంటోంది జిల్" నెమ్మదిగా అంది. రూఢీగా తెలుసుకునేందుకు అతనివంక ప్రశ్నార్థకంగా చూసింది. ఆమె ఆందోళన, భయం గ్రహించినా, తాను కూడా అలాంటి స్థితిలోనే ఉన్నట్లు ఆమెకు తెలియడం అతనికి ఇష్టం లేకపోయింది.

"ఆ గదిలో దాదాపు యాభైదాకా పక్షులున్నాయి. ఏదో ఉన్మాదం ఆవహించినట్లుగా వచ్చాయి" అంటూ కూర్చున్నాడు.

ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటూ "ఇది వాతావరణ ప్రభావం. బహుశా ఇవి ఇక్కడి పక్షులు కాకపోవచ్చు" అన్నాడు తనే మళ్ళీ.

"కానీ నాట్! ఈ రాత్రే కదా వాతావరణం మారింది. పక్షులకు ఆకలి వేసినా వాటికి చేలలో తగినంత ఆహారం లభిస్తుంది కదా? " అంది భార్య.

దానికి అతనివద్ద సమాధానం లేదు. అతని ముఖం కూడా పాలిపోయి, నిస్త్రాణగా మారిపోయింది. నిశ్శబ్దంగా ఒకరినొకరు చూస్తూ కూర్చున్నారు.

"నేను కిందకు వెళ్ళి టీ చేస్తాను" అన్నాడు.

పొందికగా అమర్చిన కప్పులు, సాసర్స్, కుర్చీలు, బల్లా వగైరా సరంజామాతో ఉన్న వంటిల్లు కొంత ఊరట కలిగించింది. వంగి ఫైర్‌ప్లేస్‌లో మంట వెలిగించి కెటిల్ పెట్టాడు. ఒక కప్పు తను తాగి భార్యకొకటి తీసుకెళ్ళాడు. తరువాత ముఖం కడుక్కుని, షూస్ వేసుకుని వెనుక తలుపు తెరిచాడు. ఆకాశంలో దట్టమైన మేఘాలు వ్యాపించాయి. కిందటిదినం సూర్యకాంతిలో మెరిసిన పర్వతశిఖరాలు ఈరోజు నల్లగా, బోసిగా కనిపించాయి. పెనుగాలి చెట్లకున్న ఆకులన్నీ రాల్చివేసింది. నాట్ తన కాలితో నేలను తాటించాడు. గట్టిగా బిగుసుకుని ఉంది. ఇంత హఠాత్తుగా అలాంటి మార్పు మునుపెన్నడూ కనీవినీ ఎరగడు.

పిల్లలు నిద్ర లేచారు. జిల్ గలగలా మాట్లాడుతోంది. జానీ మళ్ళీ ఏడుస్తున్నాడు. వాణ్ని నెమ్మదిగా ఓదారుస్తున్న తన భార్య స్వరం వినిపిస్తోంది. కొద్దిసేపటికి వాళ్లు కిందికి వచ్చారు. బ్రేక్‌ఫాస్ట్ తయారుగా ఉంచాడు. దినచర్య ఆరంభమైంది.

"నువ్వు పక్షులను తరిమేశావా? " వంటింటి వెచ్చదనంలో ఉపశమనం పొందిన జిల్ ప్రశ్న.

"ఆఁ! ఇప్పుడవి వెళ్లిపోయాయి. గాలివల్ల, భయంవల్ల ఆశ్రయం కోసం వచ్చాయంతే!" అన్నాడు.

"మళ్ళీ రాకుండా ఉంటే బాగుండును. వాటికి కిటికీలో బ్రెడ్‌ముక్కలు పెడితే రావేమో" ఓ ఆశ వెలిబుచ్చింది జిల్. ఫలహారం చేసి లేచి, తన కోటూ పుస్తకాలూ తీసుకుని బయల్దేరిందామె.

నాట్ ఏం అనలేదు. కానీ అతని భార్యకూ తనకూ మధ్య ఒక నిశ్శబ్ద సందేశం ప్రసారమైంది.

"జిల్‌తో బస్ దాకా వెళ్తాను. ఈ రోజు పనికి వెళ్లనవసరం లేదు. అన్ని తలుపులూ వేసి ఉంచు. చేలోకివెళ్లి రాత్రి ఏమన్నా వార్త విన్నారేమో కనుక్కుని వస్తాను" అన్నాడు.

జిల్ రాత్రి సంఘటనను మరచిపోయి ఉత్సాహంగా గంతులువేస్తూ నడుస్తోంది. "మంచు కురుస్తుందా నాన్నా? " అడిగింది.

"ఊహూ" జవాబిచ్చాడు, ఆకాశంవైపు చూసి.

సాధారణంగా పక్షులు ఎప్పుడూ గుమిగూడే స్థలాలు పరికించినా ఎక్కడా ఓ పిట్టయినా లేదు. బస్‌స్టాపులో కొందరు పిల్లలు మఫ్లర్లు చుట్టుకుని వేచి ఉన్నారు. జిల్ వారివైపు పరిగెత్తింది. బస్సు రాగానే తోసు

కుంటూ, బిలబిలమంటూ అందరు పిల్లలూ ఎక్కి వెళ్లిపోయారు.

నాట్ చేనువైపు దారి తీశాడు. అక్కడ గొల్లవాడు జిమ్ ఏదో పని చేస్తున్నాడు.

"బాస్ ఉన్నాడా?" అడిగాడు నాట్.

"లేడు. మంగళవారం కదా! సంతకెళ్లాడు" అని జవాబిచ్చి, షెడ్ వెనక్కి వెళ్లిపోయాడు జిమ్. నాట్‌తో మాట్లాడటం అతనికి, ఇష్టం ఉండదు. నాట్ పుస్తకాలు చదవటం వంటివి చేస్తాడు కనుక, తెలివైనవాడుగా పరిగణింపబడటం అందుకు ఒక కారణం.

రైతు మిస్టర్ ట్రిగ్గ్ ఇంటి పెరటి తలుపు వైపుకు నాట్ వెళ్లాడు.

మిసెస్ ట్రిగ్గ్ వంటింట్లో పాడుకోవడం, తోడుగా రేడియో సంగీతమూ వినవచ్చాయి. నాట్ పిలుపు విని ఆవిడ బయటకు వచ్చింది.

"హల్లో మిస్టర్ నాట్ హాకెన్, ఈ చలి అంతా ఎక్కడినించి వస్తోందో చెప్పగలరా? రష్యానుంచా? వాతావరణంలో ఇంత మార్పు ఎప్పుడూ చూడలేదు. ఇంకా కొనసాగుతుందట. ఆర్కిటిక్ వలయం వలన కావచ్చునట. రేడియోలో చెప్పారు" అన్నది.

"పొద్దున రేడియో వినలేదు. రాత్రి పెద్ద గొడవైంది"

"పిల్లకేమన్నా సుస్తీనా?"

"లేదు"

ఎలా వివరించాలో నాట్‌కు బోధపడలేదు. ఈ పట్టపగలు వెలుతురులో ఆ వింత యుద్ధం నమ్మదగ్గదిగా తోచదు. అయినా చెప్పగానే అదంతా ఏదో పీడకల అన్నట్లు ఆమె కళ్లలో అపనమ్మకం కనిపించింది.

"అవి నిజమైన పక్షులేనా? రాత్రి అలసటతో ఊహించుకున్నవి కాదు కదా?" నవ్వుతూ అడిగింది మిసెస్ ట్రిగ్గ్.

"దాదాపు యాభై పక్షులు ప్రస్తుతం మా పిల్లల గదిలో చచ్చిపడి వున్నాయి"

మిసెస్ ట్రిగ్గ్ అతని వంక సందేహంగా చూసింది.

"అయితే వాతావరణంవల్ల వచ్చి ఉంటాయి. వలస వచ్చినవి కావచ్చు"

"కాదు, అవన్నీ మనం ప్రతిరోజూ చూసేవే"

"ఆశ్చర్యమే! ఎలా చెప్పగలం? గార్డియన్ పేపరుకి రాసి కనుక్కోండి. వాళ్లేమన్నా మీ సందేహం తీర్చొచ్చు. నాకు పనుంది" తల పంకించి చిరునవ్వుతో లోపలికి వెళ్లిందామె.

నాట్ అసంతృప్తిగా తిరిగి వచ్చాడు. ప్రత్యక్ష సాక్ష్యంగా పక్షి కళేబరాలే లేకపోతే ఇదంతా ఒక భ్రాంతిగా తాను కూడా భావించేవాడేమో! దారిలో జిమ్ కనపడగానే "నిన్న పక్షులతో నీకేమన్నా గొడవ జరిగిందా?" నాట్ ప్రశ్నించాడు.

"పక్షులా? ఏం పక్షులు?"

"మా ఇంట్లోకి వచ్చాయి లెక్కలేనన్ని"

"ఓహో!"

ఏ సంగతైనా అర్థం చేసుకోడానికి జిమ్‌కి కొంత సమయం పడుతుంది.

"అయినా పక్షులు క్రూరంగా ప్రవర్తించడం ఇంతవరకూ వినలేదు. ఎపుడన్నా కొంత ధైర్యంగా చేరువకు వస్తాయేమో" అన్నాడు.

"నిన్నరాత్రి అలా లేవు మరి"

"బహూశా ఆకలిగా ఉన్నాయేమో? బ్రెడ్ ముక్కలు పెట్టండి"

మిసెస్ ట్రిగ్గ్‌లాగే జిమ్ కూడా అంత ఆసక్తి చూపలేదు. 'తమదాకా వస్తే కానీ తెలీదు' అనుకున్నాడు నాట్. ప్లీమత్ ప్రజలు యుద్ధ విమానాల దాడి ఎదుర్కొన్నపుడు కూడా దేశంలో ఈ పక్క ప్రజలు ఇదే నిర్లక్ష్యం ప్రదర్శించారు.

ఇంటికి తిరిగి వచ్చేసాడు.

"ఎవరన్నా కనిపించారా?" భార్య ప్రశ్న.

"మిసెస్ ట్రిగ్, జిమ్.. కానీ వాళ్లు నా

మాట నమ్మలేదు."

"సరే, ముందు గదిలో పక్షుల్ని తీసిపారేయ్. అవి ఉంటే అక్కడికి వెళ్లాలంటేనే నాకు భయం"

"ఇక భయం దేనికి? అన్నీ చచ్చిపోయాయిగా? "

పెద్దగోనె సంచిలో ఆ బిగుసుకుపోయిన పక్షి కళేబరాల్ని వేసాడు. ఇంత చిన్న పిట్టల ముక్కులలో అంత శక్తి నిబిడీకృతమై ఉండటం ఎంత ఆశ్చర్యకరం! సంచీతో బయటికి వచ్చాడు కానీ కొత్త సమస్య ఎదురైంది. వాటిని పాతిపెట్టడానికి భూమి అనువుగా లేక గట్టిగా తవ్వడానికి రాకుండా ఉంది. సముద్రతీరంలో ఖననం చేయటానికి నిశ్చయించాడు. అక్కడ గాలి విపరీతమైన వేగంతో వీస్తోంది. ఆ తాకిడికి నిలబడటమే గగనమైంది అతనికి. మెత్తని ఇసుకలోనికి నడిచి, గాలికి తిరోముఖంగా నిలబడి సంచిని తెరిచాడో లేదో రివ్వున గాలిలోకి, తిరిగి ఎగురుతున్నాయా? అని భ్రమ కలిగించేలా ఎగిరిపోయాయి ఆ మృత కళేబరాలు. ఆ గమనం ఏదో వికారమైన దృశ్యంగా దృగ్గోచరమైంది.

కొంత తడవు తరంగాలతో ఎగసిపడుతున్న సంద్రాన్ని చూసాడు. అప్పుడు కనిపించాయి గల్స్, సముద్రపు అలలపై తూగుతూ.

అలల నురగగా భావించిన తెల్లని భాగమంతా ఆ నీటి పక్షులే. ఆ తరంగాలతో పాటు పైకి, కిందకీ ఊగుతూ, తలలెత్తి బ్రహ్మాండమైన నావికాసేనలాగా వస్తున్నాయి. కనుచూపుమేరలో ఇరుదిక్కుల పర్యంతం అంతటా విస్తరించి వరుసలు వరుసలుగా ఉన్నాయి.

నాట్ వెనుదిరిగి ఊరి ముఖంగా వెళ్ళాడు. వెంటనే ఎవరైనా బాధ్యతాయుతులకు ఈ విషయం తెలియజేయాలి. ఏదో ఊహాతీతమైన పరిణామం సంభవించబోతోంది. దగ్గరలోని బూత్‌నుంచి ఫోన్ చేసి పోలీసులకు తెలియజేయాలా? కానీ వాళ్ళేం చేయగలరు? అసలెవరైనా ఏం చేయగలరు? వేలూ, లక్షల సంఖ్యలో ఆకలిగొన్న నీటి పక్షులు కెరటాలపై ప్రయాణిస్తున్నాయి, అంతే. పోలీసులు తననొక ఉన్మాదిగానో, మధుపానమత్తుడిగానో భావించి, 'అవును. ఈ సంగతి మాకప్పుడే తెలిసింది. వాతావరణ ప్రభావమిది. చెప్పినందుకు కృతజ్ఞతలు' అని శెలవిస్తారు.

నాట్ పరిసరాల్ని మరొకసారి పరిశీలించాడు. ఎక్కడా ఇతర పక్షుల జాడ లేదు. చలివల్ల ఉత్తర దిశను పట్టాయా?

ఇంటికి రాగానే ద్వారం వద్దకు వచ్చిన భార్య "నాట్! రేడియోలో ప్రత్యేక వార్త ప్రసారం చేశారు. నేనది రాసి ఉంచాను" అంది.

"ఏవిటది? "

"అదే పక్షుల గురించి. ఇక్కడే కాదు. దేశమంతా, లండన్‌లోనూ పక్షులన్నింటికీ ఏదో అయింది"

ఇద్దరూ వంటింట్లోకి నడిచారు. టేబిల్‌పై ఉంచిన కాగితం చదివాడు.

ప్రభుత్వ దేశవ్యవహారాల మంత్రిత్వశాఖ నుండి ఉదయం పదకొండు గంటలకు వచ్చిన వార్త. దేశంలో పలుప్రాంతాల నుంచి పల్లెలపై, పట్టణాలపై పెద్ద సంఖ్యలో మూగిన పక్షులు, అవి మనుషులను గాయపరచిన ఉదంతాలు గంటగంటకూ తెలియవస్తున్నాయి. ప్రస్తుతం బ్రిటిష్ దీవులను ఆర్కిటిక్ పవనాలు ఆవరించడం చేత పక్షులు దక్షిణ దిక్కుగా వలసపోతున్నాయి. గృహస్థులు తమ గవాక్షాలు, ద్వారాలు, పొగ గొట్టాలను తగిన విధంగా మూసివుంచి పిల్లల రక్షణకు కావలసిన చర్యలు తీసుకోవలసిందిగా హెచ్చరించడమైనది. తరువాత ప్రసారం కొద్ది కాలానం

తరం.

నాట్‌లో ఏదో తెలీని ఉద్విగ్నత. భార్య వైపు సాభిప్రాయంగా చూశాడు. "చూశావా? ఈ విషయం గ్రామంలో అంతా విని ఉండాలి. నాది కట్టుకథ కాదని ఇప్పుడైనా మిసెస్ ట్రిగ్గ్‌కి తెలుస్తుంది. ఈ ఉదయమే చూశాను. సముద్రంపై వేలకొద్దీ గల్స్, వాటి మధ్య సూదిమొన దూరేంత స్థలం కూడా లేకుండా దట్టంగా ఉన్నాయి"

"దేనికోసమని? "

"ఏమో, అవి ఆకలిగొన్నవని ఈ వార్త సారాంశం"

సుత్తీ, ఇతర పనిముట్లు ఉంచిన సొరుగు దగ్గరికి వెళ్ళాడు.

"ఏం చేస్తున్నావ్, నాట్? "

"వాళ్ళు చెప్పినట్టు, కిటికీలు, తలుపుల సంగతి చూస్తాను"

"కిటికీలు మూసినా రాగలవంటావా ఈ చిన్ని రాబిన్స్, పిచ్చుకలు? "

అతను జవాబు చెప్పలేదు. రాబిన్స్, పిచుకల గురించి అతను ఆలోచించడం లేదు. అతని భయమంతా మరింత శక్తి మంతమైన గల్స్ గురించే.

పై అంతస్తుకు వెళ్ళి కిటికీ తలుపులకు చెక్కలు బిగించి, చిమ్నీని మరింత పటిష్ఠం చేశాడు. గతంలోని యుద్ధారంభ సమయం అతనికి జ్ఞప్తికి వచ్చింది. అప్పటికింకా తను అవివాహితుడే. తన తల్లిఇల్లు వైమానికు లకు కనబడకుండా నల్లని చెక్కలను అమ ర్చాడు. ప్రస్తుతం గ్రామంలో ఇతరులు ఏమైనా జాగ్రత్త చర్యలు తీసుకుంటున్నారో లేదోనని ఆలోచించసాగాడు. అతనికి నమ్మకం కలుగలేదు. హారీ ట్రిగ్గ్, అతని భార్యా జీవితాన్ని చాలా తేలిగ్గా తీసుకుం టారు. బహుశా జరిగేదంతా చాలా హాస్యా స్పదంగా స్వీకరిస్తారు. నృత్య కార్యక్రమా నికో, చతుర్ముఖ పారాయణానికో వెళ్ళి వుండొచ్చు కూడా!

"భోజనం సిద్ధం" వంటింటి నుంచి పిలుపు విన్పించింది.

"సరే. వస్తున్నా" అని గట్టిగా అన్నాడు.

ఇంతవరకూ ముగించిన పని తృప్తి కలి గించింది. కిటికీ రెక్కలపై చెక్కలు చక్కగా అమరాయి. భోజనానంతరం భార్య పాత్రలు శుభ్రపరుస్తుంటే ఒంటిగంట వార్తాప్రసారం వినసాగాడు. మునుపటి విషయాలే ప్రస్తావించి, వివరంగా కొంత పరిస్థితిని తెలిపారు. లండన్‌లో ఉదయం పదిగంటలకు ఆకాశంలో పక్షులు ఎంత దట్టంగా ఉన్నాయంటే పెద్ద కరిమబ్బులు కమ్మినట్లుగా అగుపించిందట.

నల్లపిట్టలు, త్రష్‌లు, ఊరపిచ్చుకలు, మహానగరంలో సహజంగా ఉండే పావు రాళ్ళు, గిజిగాళ్ళు కమ్ముకున్న దృశ్యం చాలా చోట్ల వాహనాలను నిలిపివేసింది. దుకా ణాలు, కార్యాలయాలలో పని స్తంభించి పోయింది. వీధులన్నీ పక్షులను చూసే జనంతో కిక్కిరిసిపోయాయి.

మరికొన్ని సంఘటనల వర్ణనానంతరం గృహస్థులకు హెచ్చరికలు తిరిగి వినిపిం చారు. రేడియోలో అతని కంఠం నిర్ల క్ష్యంగా, అనాసక్తంగా ధ్వనించింది. ఇదంతా పెద్ద ఫార్స్‌గా భావించేవారిలో ఇతనొకడని నాట్ గ్రహించాడు. ఇంకా ఇలాంటి వాళ్ళెం దరో! పక్షులతో తిమిరంలో సమరం ఎలా ఉంటుందో వాళ్ళకింకా అనుభవం కాలేదు. ఎన్నికల సందర్భంలో లాగా ఈ రాత్రి కూడా విందులూ, వినోదాలు జరుగవచ్చు. నవ్వుతూ, తుళ్ళుతూ, తాగుతూ 'అదిగో ఎన్ని పక్షులో! చూడండి!' అనుకుంటారు కాబోలు.

వైర్‌లెస్ ఆపి వంటింటి కిటికీ తలుపు లపై పని ప్రారంభించాడు నాట్.

అది గమనించిన భార్య "ఇక్కడ కూడానా? అయితే వెలుగుకోసం మూడుగం టలకే దీపాలు పెట్టాలి. అయినా అనవసర

మేమో కదూ? "

"తరువాత విచారించడంకన్నా ముందు జాగ్రత్తపడితే మంచిది. నేనెలాంటి లోసుగులూ లేకుండా చూసుకోవాలనుకుంటున్నా"

"అసలు సైన్యాన్ని పిలిచి ఈ పక్షులన్నిటినీ కాల్చిపారేయాలి.. త్వరగా భయపడి వెళ్ళిపోతాయి"

"ప్రయత్నించి చూడనీ.. ఎంతవరకూ సాధించగలరో!"

"నౌకాశ్రయంలో పని ఆగిపోతే సైనికులు వెళ్ళి సామాన్లు నౌకలనుంచి దించడం లేదా? అలాగే!"

"సరే, కానీ లండన్ జనాభా ఎనిమిది మిలియన్ల పైచిలుకు. అన్ని భవనాలు, ఫ్లాట్స్, ఇళ్ళు కప్పులన్నింటి పైనుండి పక్షులను కాల్చడం సాధ్యమేనా? "

"నాకు తెలీదు. కానీ ఏదో ఒకటి చేయాలి"

వాళ్ళు నిస్సందేహంగా ఏదో చెయ్యాలనే పథకాలు రూపొందిస్తూ ఉంటారు. కానీ, అవి లండన్, ఇతర పట్టణాలకే పరిమితం. మూడువందల మైళ్ళ దూరంలో ఇక్కడ ఉన్నవారికి సహాయం లభించడం దుర్లభం. ప్రతీ గృహస్థు తన జాగ్రత్తలు తను తీసుకోవలసిందే.

"ఇంట్లో ఏ మాత్రం ఆహారం నిలువ ఉంది? "

"రేపు అన్నీ కొనవలసినరోజు. ముడి దినుసులను ఎక్కువగా నేను నిలువ ఉంచను. ఎల్లుండి వరకూ బుచర్ రాడు. కానీ రేపేదన్నా తీసుకొస్తాను" అందామె.

నాట్ ఆమెను అనవసరంగా ఆందోళన పరచదలచలేదు. రేపు ఆమె ఊళ్ళోకి వెళ్ళే అవకాశం తక్కువని అనుకున్నాడు.

తనే వెళ్ళి వంటింట్లో పరీక్షించాడు. రెండు రోజులకు సరిపడే నిల్వాలున్నాయి కానీ బ్రెడ్ తక్కువగా ఉంది.

"బేకర్ ఎప్పుడొస్తాడు? "

"రేపే"

బేకర్ రాకపోతే ఒక లోఫ్ తయారుచేసేంత పిండిమాత్రం ఉంది.

"పూర్వమే బాగుండేది. వారానికి రెండుసార్లు ఇంట్లో బేకింగ్, ఊరగాయల తయారీ జరిగేది. అవసరమైతే చాలాకాలం నిర్బంధం విధించినా సరిపడే నిల్వాలు ఉండేవి"

"నేను పిల్లలకు టిన్న్‌డ్ చేపలు పెట్టాను కానీ వాళ్ళకవి నచ్చలేదు" అంది.

వంటింటి కిటికీలకు చెక్కలు బిగిస్తూ ఆలోచిస్తున్నాడు నాట్. కొవ్వొత్తులు కూడా చాలా తక్కువగా ఉన్నాయి.

లేచివెళ్ళి వెనుక తలుపుతీసి పెరట్లోంచి సముద్రంవైపు చూడసాగాడు. రోజంతా వెలుగు లేదు. మూడు గంటలకే చీకటి. ఆకాశంలో దట్టమైన గాఢాంధకారం వ్యాపించింది. అంతలో గమనించాడు. అంతవరకూ సముద్రంపై తూగిన గల్స్ ఇప్పుడు ఆకాశంలో గిరికీలు కొడుతున్నాయి. ఆ విహంగ విహారం నిశ్శబ్దంగా దుశ్శకునాల్ని సూచిస్తూ ఉంది.

నాట్ ఇంట్లోకి వెళ్ళి, "నేను జిల్ కోసం బస్‌స్టాపుకు వెళ్తున్నా. జానీని ఇంట్లోనే ఉంచి దీపాలు వెలిగించి పరదాలు వేసెయ్" అన్నాడు.

"ఇప్పుడు మూడేగా అయింది!"

"అయినా సరే, చెప్పింది చెయ్"

పరికరాలుంచే షెడ్‌లోకి చూశాడు. ఉపయోగకరమైనదేదీ కనపడలేదు. పలుగు మరీ బరువు. ఫోర్క్ పనికిరాదు. తేలికగా ఉండే హోయ్ తీసుకుని బయల్దేరాడు.

నాలుగయ్యేవరకూ బస్సురాదని తెలిసినా వేగంగా నడక సాగించాడు. దారిలో ఎవరూ ఎదురు కాలేదు.

బస్‌స్టాపు చేరి ఎదురుచూస్తున్నాడు. వెనుకనుండి ఏదో నల్లగా పైకి లేచింది. మొదట మసకగా ఉన్నదల్లా పెరిగి కారు



మేఘంగా మారింది. ఆ మేఘం ఐదు భాగాలుగా విడిపోయింది. ఉత్తర, దక్షిణ, తూర్పు దిక్కులుగా సాగింది. అవి మబ్బులు కావు, పక్షులు! అత్యంత వేగంగా పయనిస్తున్న ఆ పక్షులను చూడగానే అవి ఇక్కడ ఆగేవి కావనీ, దేశాంతర్భాగమే వాటి లక్ష్యమనీ గ్రహించాడు. కాకులు, కొంగలు, జాక్‌డాస్, మాగ్‌పైస్, చిన్నచిన్న ప్రాణులను ఆహారం చేసుకునేవే అన్నీనూ. కానీ ఈ మధ్యాహ్నం మరొక సాధనకోసం ఉద్యుక్తమయ్యాయి.

వెంటనే సమీపంలోని ఫోన్ వద్దకు వెళ్ళి "హైవే నుంచి మాట్లాడుతున్నా. పెద్ద పెద్ద పక్షి సమూహాలు దేశంలోకి రావడం చూశాను"

"సరే" అలసట మిళితమైన ఆపరేటర్ స్వరం.

"సంబంధిత అధికారులకు ఈ విషయం తప్పక తెలియజేస్తారు కదూ!"

"అలాగే.. అలాగే" విసుగ్గా జవాబు.

'బాధ్యతలేని మరో మనిషి. బహుశా రోజంతా కాల్స్ తీసుకుని విసిగిపోయి ఉంటుంది. సాయంత్రం సినిమాకి పోయే తొందర్లో ఉంటుంది' అనుకున్నాడు.

ఇంతలో బస్ నెమ్మదిగా వచ్చింది. ముగ్గురు నల్గురు పిల్లలు దిగారు. బస్ వెళ్ళిపోయింది.

"ఆ చేతిలో పట్టుకున్న హోయ్ దేనికి నాన్నా? " అడిగింది జిల్.

"ఊరికే తెచ్చాను" అన్నాడు.

నవ్వుతూ, తుళ్లుతూ అతని చుట్టూ మూగారు పిల్లలు.

"పదండి ఇళ్ళకి. చల్లగా ఉంది. మీరందరూ ఈ పొలందాటి వెళ్ళేదాకా చూస్తాను'

"కానీ మాకిక్కడ కొంతసేపు ఆడుకోవాలని ఉంది"

"వద్దు, వెంటనే వెళ్ళిపోండి"

మిగతా పిల్లలు వెళ్లగానే జిల్, తనూ బయల్దేరారు.

"నాన్న! అదిగో చూడు.. ఎన్ని గల్స్!"

"అవును. నువ్వు పద"

"ఎక్కడికి వెళ్తున్నాయవి? "

"మరింత వెచ్చని ప్రదేశానికి"

ఆమె చెయ్యి పట్టుకుని వేగంగా నడక సాగించాడు.

"మెల్లగా నాన్నా! నేను పరుగెత్తలేను"

ఇతర పక్షులలాగే గల్స్ కూడా రకరకాల మార్గాలలోకి విడిపోయి అన్ని దిక్కులకూ పోసాగాయి.

"జిల్! రా.. నా వీపుమీద ఎక్కు"

ఈ విధంగానైనా త్వరగా పోవచ్చునేమో! కానీ అతని ఊహ తప్పు. జిల్ బరువుగా వుంది. జారిపోతోంది. అతని ఆత్రుత, ఆందోళన గ్రహించిందేమో? సన్నగా ఏడవటం మొదలెట్టింది.

"ఆ గల్స్ వెళ్ళిపోతే బాగుండును. మరీ దగ్గరగా వస్తున్నాయి" అంది.

జిల్‌ను దింపి చెయ్యి పట్టుకుని పరుగు మొదలెట్టాడు. కొంతదూరంలో రైతు తన కారులో బయల్దేరడం చూసి పిలిచి, "మాకు లిఫ్ట్ ఇస్తారా? " అన్నాడు.

"ఈ రోజు భలే సరదాగా ఉంది. ఆ గల్స్ చూశావా? నేనూ, జిమ్ వాటిని కాలుస్తాం. నిన్న రాత్రి మీ ఇంట్లో ఏదో గొడవ జరిగిందటగా? నీకేమైనా ఓ తుపాకీ కావాలా? " అన్నాడాయన.

నాట్ నిరాకరించాడు. ఆ చిన్నకారు నిండిపోయి ఉంది. జిల్‌కి సరిపడా కొంచెం స్థలం మాత్రమే మిగిలివుంది.

"తుపాకీ వద్దుకానీ జిల్‌ని ఇంట్లో దించు. పక్షులకు భయపడుతోంది" అన్నాడు.

"అలాగే షూటింగ్ మ్యాచ్‌లో నువ్వూ పాల్గొనరాదూ? ఈకలెగరగొడదాం"

నాట్ ఏమీ మాట్లాడలేదు.

జిల్ ఎక్కగానే కారు వెళ్లిపోయింది.

పక్షులు, ముఖ్యంగా నల్లవీపు గల్స్ ఆకాశంలో ఎక్కువగా ఉన్నాయి.

అవి చిన్న పిట్టలనే కాక, అప్పుడే జన్మించిన గొర్రెపిల్లలను కూడా కబళించగలవని విన్నాడు. జిల్‌ని ఇంట్లో దింపిన కారు తిరిగి వస్తూ నాట్ పక్కన ఆగింది.

"ఇదంతా రష్యన్ పన్నాగం అంటున్నారు. ఈ పక్షులకు మందు పెట్టారట" అన్నాడు మిస్టర్ ట్రిగ్గ్.

"అదెలా సాధ్యం? "

"ఏమో నన్నడక్కు. కథలెలా ప్రచారం అవుతాయో నీకు తెలుసు కదా? వస్తావా షూటింగ్‌కి? "

"ఊహూ! మా ఆవిడ ఎదురు చూస్తుంటుంది"

"మా ఆవిడేమో, గల్ భోజనయోగ్యమైన పక్షి కాదు.. లేకపోతే గల్ వేపుడు, గల్ కూర, కావాలంటే గల్ పచ్చడి కూడా చేసుకోవచ్చంది"

"సరే కానీ కిటికీలకు చెక్కలు బిగించావా? "

"లేదు. అయినా ఎందుకూ రేడియోవారు అనవసరంగా మనల్ని భయపెడ్తున్నారు.

కిటికీలకు చెక్కలు కొట్టడంకంటే నాకివాళ వేరే పనులు చాలా ఉన్నాయి"

"నేనే నీ పరిస్థితిలో ఉంటే ఆ పని ఇప్పుడే చేసేవాణ్ని"

"భలేవాడివే! చాదస్తమా? సరే, రేపు కలుద్దాం. గల్ ఫలహారం చేద్దాం" అంటూ నవ్వుతూ వెళ్లిపోయాడు కారులో.

గబగబా నడిచి వెళ్తుండగా వినిపించింది పక్షి పక్షవిక్షేప శబ్దం. ఒక గల్ సర్రున అతనిపైకి దూకి, గురితప్పి, పక్కకు తిరిగి పైకి లేచి, తిరిగి దూకడానికి ఉపక్రమించింది. మరోక్షణంలో మరికొన్ని, ఆరు, ఏడు, పన్నెండుదాకా పక్షులు, మొదటి దానితో కలిసి దూసుకొచ్చాయి. నాట్ నిరుపయోగమైపోయిన హోయ్‌ని పారేసి చేతులు తలపై రక్షణగా పెట్టుకుని ఇంటి వైపు పరుగుతీశాడు. రెక్కల ధ్వని మినహా మరే శబ్దం లేకుండా అతడి పైకి మళ్లీ మళ్లీ వస్తున్నాయి పక్షులు. భయానకమైన రెక్కల ధ్వని. మెడపైన, చేతులపైన, పిడికిళ్ళపైనా రక్తం వచ్చింది. పొడుస్తున్న ప్రతీ ముక్కూ లోతుగా గాయపరుస్తోంది. కనీసం కళ్ళను రక్షించుకోగలిగితే చాలు. అవి ఇంకా భుజాలపై పట్టు ఏర్పరుచుకోవటం, బట్టలు చింపటం, ఒకేసారి దండుగా వచ్చి తలపై వాలటం నేర్చుకోలేదు. కానీ ప్రతిసారీ మరింత నిర్భీకంగా విజృంభిస్తున్నాయి. ఆపైన వాటికి తమను గురించిన భయమేదీ ఉన్నట్లు లేదు. దూకి, గురి తప్పినప్పుడు నేలమీద పడి గాయపడ్డున్నాయి. పరుగుతో నాట్ అడుగులు తడబడి, అడ్డుతగిలిన కళేబరాలు తన్నుకుంటూ వెళ్ళాడు. ఇంటి వద్దకి వచ్చి రక్తసిక్తమైన హస్తాలతో తలుపు బాదాడు. మూసి ఉన్న తలుపుల వల్ల వెలుతురు లోపలకు ప్రసరించడం లేదు. అంతా కటిక చీకటి.

"నేను! నాట్‌ని.. తలుపు తీయ్" అరిచాడు.

అంతలో చూశాడు. ఆకాశంలో ఒక పెద్ద పక్షి విన్యాసం!

హఠాత్తుగా రెక్కలు బిగించి శిలాపాతంలా దూకింది.

పెద్ద ఆక్రందన చేశాడు. తలుపు తెరచుకుంది. గుమ్మందాటి ద్వారం గట్టిగా మూసేశాడు. ఆ పక్షి తలుపుకు కొట్టుకుని కిందపడ్డ శబ్దం విన్పించింది.

గాయాలు తుడిచి కట్లు కట్టిందతని భార్య. ముఖ్యంగా మణికట్టు, అరచేతి వెనుక భాగానికి తీవ్రంగా గాయాలయ్యాయి. తలకు టోపీయే లేకపోతే అదీ బాగా గాయపడేది. ఆఖరున వచ్చిన పెద్దపక్షి అయితే ఏకంగా కపాలమోక్షమే కలిగించేది. తండ్రి చేతులపై రక్తాన్ని చూసిన పిల్లలు ఏడవసాగారు.

"మరేం ఫర్లేదు. ఊరుకోండి" అన్నాడు.

"ఎప్పట్నుంచో ఆ పక్షులన్నీ వేచి ఉన్నాయి. జిల్ రాగానే మరింత దగ్గరగా వచ్చాయి. జిల్ లోపలికి రాగానే తలుపు బలంగా వేయడంతో అది బిగుసుకుపోయింది. అందుకే నువ్వు వచ్చిన వెంటనే తీయలేకపోయాను" అంది మిసెస్ నాట్ బాధపడుతూ.

"అవి నా కోసం వేచి ఉండటం మంచిదయింది. జిల్ అయితే వెంటనే కింద పడిపోయేది. దాని ప్రాణానికి ఒక్క పక్షే చాలు"

ఆమె కట్లు కడుతుంటే పిల్లలకు వినిపించకుండా లోగొంతుకలతో సంభాషించుకోసాగారు భార్యాభర్తలు.

"అవన్నీ ఇంకా దేశం లోపలికి వెళ్తున్నాయి"

"కానీ అవి ఏం చేయగలవు?"

"వీధుల్లో తిరిగేవాళ్ళపైకి దాడిచేస్తాయి. ఆ పైన కిటికీలు, చిమ్నీల ద్వారా ఇళ్ళలోకి ప్రవేశిస్తాయి".

"అధికారులు సైనికులను, మెషీన్ గన్స్‌ను

ఎందుకు ఏర్పాటు చేయకూడదు? "

"తగిన సమయం లేదు. ఎవరూ ఈ పరిస్థితికి సిద్ధంగా లేరు. ఆరుగంటల వార్తలలో ఏం చెప్తారో విందాం"

ఇద్దరూ వంటింట్లోకి వెళ్ళారు.

"నాన్నా! అదిగో పక్షుల గోల!" అంది జిల్.

కిటికీపైన, తలుపులపైన గోళ్ళతో రక్కుతున్న అలికిడి.

"మరేం భయంలేదు జిల్. అన్ని తలుపులకూ చెక్కలు బిగించాను"

మళ్ళీ అన్ని తలుపులూ పరిశీలించాడు. చెక్కలను మరింత పటిష్ఠం చేయడానికి చిన్న చిన్న వెదురు బద్దల్ని చెక్కల మూలల్లో సుత్తితో కొట్టడం ఆరంభించాడు. ఆ శబ్దం వెలుపలి నుండి వచ్చే చప్పుడులను కొంత తగ్గించింది. ముఖ్యంగా బయట పగిలిన అద్దాల సవ్వడి తన భార్యాపిల్లలు వినడం అతనికి ఇష్టం లేదు.

"రేడియో పెట్టండి" అన్నాడు, అది కూడా బయటి హోరుని తగ్గిస్తుందనే.

పై అంతస్తులో పడక గదుల కిటికీ తలుపులు కూడా పటిష్ఠం చేశాడు. అక్కడ పైకప్పుమీద పక్షుల అలికిడి మరింతగా వినిపించింది. వంటింట్లో నిద్రించడంవల్లే తమకు ఎక్కువ భద్రత ఉంటుందని భావించాడు నాట్. పడక గదుల చిమ్నీలు దుర్భేద్యమని అతనికి నమ్మకం లేదు. వంటింట్లో అయితే చిమ్నీలో వెలుగుతూ ఉండే మంటలవల్ల రక్షణ లభిస్తుంది. మార్పు కోసమన్నట్లుగా పిల్లలను నమ్మించి వారి పడకలు మార్చాలి.

ఒకవేళ పక్షులు పడక గదుల్లోకి ప్రవేశించినా తలుపులు ఛేదించి, అవి కిందికి రావటానికి కొన్ని గంటలు, లేక రోజులు పట్టవచ్చు. ఆ గదుల్లో అవి బందీలయి ఊపిరందక చస్తాయి. పైనుండి పరుపులు కిందకి తేవడం మొదలెట్టాడు. అది చూసి అతని భార్య పక్షులప్పుడే లోనికి ప్రవేశించాయని భావించి భయపడింది. పిల్లల సహాయంతో మేజాలు, కుర్చీలు అన్నీ పక్కకు జరిపి, ముఖ్యంగా పెద్ద నిలువుటద్దపు బల్లను తలుపుకడ్డంగా, మరింత రక్షణగా ఉంచాడు.

ప్రస్తుతానికిక భద్రమేకానీ ఆహారం, ఇంధనం ఇవి రెండు మూడునాళ్లకంటే ఎక్కువ రావు. మరి ఆలోపు? అంతవరకూ ఆలోచించి ప్రయోజనం లేదు. రేడియో వారు తగిన ఆదేశాలు ఇవ్వవచ్చు. కానీ ఇన్ని సమస్యల మధ్య ఇప్పుడూ నృత్య సంగీతమే వస్తోంది. యథాప్రకారం రావలసిన బాలల కార్యక్రమం లేదు. రేడియో కేంద్రం సరైనదేనా అని పరికించాడు. సందేహమేమీ లేదు. అదే కారణమతనికి అవగతమైంది. మామూలు కార్యక్రమాలు నిలిపివేయబడ్డాయి. ఎన్నికలు, యుద్ధాలు వంటి కొన్ని ప్రత్యేక సమయాల్లోనే ఇలా జరుగుతుంది.

'ఈ వంటింట్లో మేం సురక్షితంగా ఉన్నాం. నగరవాసుల పరిస్థితే దారుణంగా ఉంటుంది. మేం అక్కడ లేనందుకు భగవంతుడికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి' అనుకున్నాడు నాట్.

ఆరుగంటలకు సంగీతం ఆగిపోయి సమయం చెప్పారు. పిల్లలకు భయం కలిగించేవైనా సరే, వార్తలు వినక తప్పదు. కొద్దిక్షణాల అనంతరం ఎనౌన్సర్ కంఠం గంభీరంగా, మధ్యాహ్నంకన్నా చాలా తేడాగా వినిపించింది.

"లండన్‌నుండి ప్రసారం. ఈనాటి మధ్యాహ్నం నాలుగు గంటలనుండి జాతీయ అత్యవసర పరిస్థితి ప్రకటించబడింది. ప్రజల ప్రాణాలు, ఆస్తుల రక్షణకు తగిన చర్యలు తీసుకుంటున్నా, కనీవినీ ఎరుగని ప్రస్తుత పరిస్థితిలో అందరి రక్షణాబాధ్యత సత్వరం నెరవేర్చడం దుస్సాధ్య



మని గ్రహించాల్సివుంది. ప్రతి గృహస్థు తన భవంతి రక్షణ తానే చేసుకోవాలి. ఫ్లాట్స్ వంటి ప్రదేశాలలో వారు సామూహికంగా తమ భవన రక్షణ చర్యలు చేపట్టాలి. ఈ రాత్రి ఏ వ్యక్తీ గృహాల వెలుపల, వీధులలో తిరుగరాదు. ఇప్పటికే వీధులలో తిరిగేవారిని పక్షులు గాయపరుస్తూ, ఇళ్ళపై కూడా దాడిని ప్రారంభించాయి. తగిన జాగ్రత్తలు తీసుకుంటే ఇళ్లు దుర్భేద్యం చేసుకోవడం కష్టమేమీకాదు. ప్రజలు ఆందోళన చెందక ప్రశాంతంగా వ్యవహరించవలసిందని విజ్ఞప్తి. ప్రత్యేకమైన ఈ అత్యవసర పరిస్థితి కారణంగా రేపు ఉదయం ఏడుగంటల వరకు ప్రసారం నిలిపివేయడమైనది"

జాతీయ గీతానంతరం నాట్ రేడియో ఆపేశాడు.

"వార్తలో ఏం చెప్పారు? " జిల్ ప్రశ్న.

"ఈ రాత్రికి ఏమీ కార్యక్రమాలు ఉండవు'
'

"పక్షుల వల్లనేనా? "

"కాదు. అందరికీ ఏవో పనులు. పైగా పక్షులను వదిలించుకునే పని ఒకటి. అంతే"

"మనకొక గ్రామోఫోన్ ఉంటే బాగుండేది" జిల్ అభిప్రాయం

"భోజనం త్వరగా చేద్దాం. ఏం కావాలి మీకు పిల్లలూ? టోస్టెడ్ ఛీజ్? అమ్మనడగండి" అన్నాడు.

భార్యకు సైగ చేశాడు. పిల్లల ముఖాల నుండి భయాందోళనలు పోవాలని అతని ప్రయత్నం. వంటలో సాయంచేస్తూ ఈల వేస్తూ, పాడుతూ, వీలైనంత సందడి సృష్టించ సాగాడు. కొంతవరకూ వెలుపలి ధ్వని కూడా క్షీణించడం గ్రహించాడు. మెట్లపైకి వెళ్ళి జాగ్రత్తగా ఆలకించాడు. పైన స్థలం కోసం పక్షుల పెనుగులాటల సవ్వడి ఏమాత్రం లేదు. 'తెలివి కలవే. ఇక్కడ లోపలికి రావడం కష్టమని గ్రహించి వేరే చోట్లకు పోయాయి' అనుకున్నాడు. చెప్పుకోదగ్గ ఏ సంఘటన జరగకుండానే భోజనాలై పోయాయి. పాత్రలు శుభ్రపరిచే సమయంలో అందరికీ పరిచితమైన ధ్వని వినవచ్చింది.

"విమానాలు! నేనప్పుడే అన్నాను. ఆ పక్షులమీదకి అవే సరైన ఆయుధాలు. అదిగో ఫిరంగుల శబ్దం, కదూ?" అంది మిసెస్ నాట్.

సముద్ర ఉపరితలంపైన నౌకలనుండి ఫిరంగులు ఉపయోగించవచ్చేమో కానీ జనావాసం ఉండే ప్రదేశాలలో ఎలా వీలవుతుంది? అదే సమయంలో దూరంగా బ్రహ్మాండమైన శబ్దాలు వరుసగా మూడు పర్యాయాలు వినిపించాయి.

"ఏమిటది? పక్షులపై బాంబులు వేస్తున్నారా?" భార్య ప్రశ్న.

"కాదనుకుంటా.. నాకు తెలీదు" ఆ శబ్దాలు విమాన పతనాలకి సంబంధించినవని ఆమెకు చెప్పదలచలేదు అతను. రక్షక దళ వినియోగంలో, ప్రభుత్వ ప్రయత్నంలో ఇదొక భాగమని గ్రహించి, ఈ ప్రయత్నం ఆత్మహత్యాసదృశమని తెలుసుకోలేని వారి అమాయకత్వానికి విచారించాడు. విమానపు ప్రొపెల్లర్(పంకా)నే ఢీకొనే పక్షులవల్ల తామూ కూలిపోవడం తప్ప, విమానాలేం చేయగలవు? బహుశా దేశమంతా ఇవే ప్రయత్నాలు జరుగుతుండవచ్చు ఎంత వృథా! పైనున్నవాడెవడో మతి కోల్పోయినట్లున్నాడు.

"విమానాలెక్కడికెళ్ళాయి నాన్నా?" జిల్ ప్రశ్న.

"వాటి స్థావరానికి. ఇక నిద్రపోండి" పిల్లలకు బట్టలు మార్చడంలో భార్య నిమగ్నమై వుండగా నాట్ మళ్ళీ అన్ని మూలలూ తిరిగి పరిశీలించాడు. సముద్రంలో ఫిరంగులు, ఆకాశంలో విమానాల వంటి ధ్వనులేవీ వినిపించడం లేదు.

"ప్రాణాలకీ, శ్రామికంగానూ ఎంత నష్టం! ఆ విధంగా ఎక్కువ సంఖ్యలో వాటిని నిర్మూలించలేం. ఆర్థికంగా కూడా ఇది ఎక్కువ లాభదాయకం కాదు. బాష్పవాయు ప్రయోగం మరింత ప్రయోజనకరం. అలా చేసేట్లయితే ప్రజలకు ముందుగా హెచ్చరిక ఉంటుంది. ఏది ఏమైనా దేశంలోని మేధావులంతా ఈరాత్రి చర్చించి తగిన చర్యలు సూచిస్తారు"

ఈ విధమైన ఆశ అతనికి కొంత నిబ్బరం కలిగించింది. శాస్త్రవేత్తలు, జీవశాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణులు మొదలుగాగల వారి సమావేశం ఊహించుకున్నాడు. వారంతా సమస్య పరిష్కారం కోసం ప్రయత్నిస్తారు. ఇది ప్రభుత్వ యంత్రాంగం, సైనికాధికారుల వల్ల పరిష్కరింపబడేది కాదు. వారు కేవలం శాస్త్రజ్ఞుల ఆదేశానుసారం నడుచుకోవలసిందే. కొంత నిర్దయగా నిర్ణయాలు తీసుకోవాలి. భూసారం పోయినా, పశు ప్రాణనష్టం కలిగినా శక్తిమంతమైన బాష్పవాయు ప్రయోగం అనివార్యం. కానీ ప్రజలు ఆందోళనతో గతి తప్పకూడదు. బీబీసీ హెచ్చరిక అతి ముఖ్యమైనది.

పై అంతస్తులో అంతా నిశ్శబ్దం.

యుద్ధంలో విరామం. వ్యూహరచనలో మార్పులేమో! అప్పుడతనికి జ్ఞప్తికి వచ్చింది.. సముద్రపుపోటు ఎక్కువయ్యే వ రకు ఈ వ్యవధి ఉంటుంది. తన గడి యారం చూశాడు. ఎనిమిది కావస్తోంది. దేశాంతర్భాగంలో ఏమో కానీ, సముద్రతీ రంలో మాత్రం ఈ నియమం వర్తించుతు న్నట్లుంది. ఉన్న సమయాన్ని గణించాడు. దాదాపు ఆరుగంటలు ఉంది. తను రెండు పనులు చేయవచ్చు. మొదటిది భార్యాపిల్ల లలాగే తనూ నిద్రించడం, రెండోది బయ టికి వెళ్ళి గ్రామస్థుల స్థితిగతులు విచారిం చడం. మెల్లగా భార్యను పిలిచి విషయం చెప్పాడు నాట్.

"వీల్లేదు.. వెళ్లొద్దు. పిల్లలతో ఒంటరిగా నేనుండలేను" అన్నదామె.

"సరే, అలాగే. తెల్లవారేదాకా వెళ్లను. ఏడుగంటలకు రేడియో కూడా వినొచ్చు. అప్పుడు ఊళ్ళోకి వెళ్ళి వీలైతే బ్రెడ్, బంగా ళాదుంపలు, పాలు సంపాదిస్తాను"

ఊహించని ఈ పరిణామం అందరికీ అశనిపాతమే అయింది. తీవ్రంగా ఆలోచిం చసాగాడు. ఊళ్ళో ఆవుల పాలు ఎవరూ పిండివుండకపోవచ్చు. అందరూ పక్షులవల్ల ఇళ్ళలోనుండి బయటకు రాలేరు. అదైనా తగిన జాగ్రత్తలు తీసుకుని ఉంటేనే! కార్లోంచి తనను చూసి నవ్వుతున్న ట్రిగ్గ్‌ని గుర్తు తెచ్చుకున్నాడు. 'ఈ రాత్రి పిట్టలవేట జరిగి ఉండదు' అనుకున్నాడు. పిల్లలు నిద్ర పోయారు. పరుపుపైన కూర్చుని తనవంక ఆందోళనగా చూస్తున్నది భార్య.

"ఏం చేయదలిచావు? " అంది.

నిశ్శబ్దంగా ఉండమని సంజ్ఞచేసి మెల్లగా, వెనుకతలుపు తీసి బయటకు చూశాడు. అంతా చిమ్మ చీకటి. బలమైన గాలులు, ఎముకలు కొరికే చలితో వీస్తున్నాయి. బయట మెట్టుపై అడుగుపెట్టగానే అసం ఖ్యాకమైన పక్షుల మృత కళేబరాలు కాళ్లకు తగిలాయి.

కిటికీల కింద, గోడల పక్కన ఎక్కడ చూసినా కళేబరాలు. ఎక్కడా సజీవ పక్షుల ఉనికేలేదు. అన్నీ సముద్రాభిముఖంగా ఎగి రిపోయాయి. కొద్దిదూరంలో ఏదో రగులు తోంది. కూలిపోయిన విమా నం గడ్డివా ములను కూడా కాలుస్తోంది.

పక్షి కళేబరాలను చూడగానే వాటన్నిం టినీ కిటికీ తలుపులకు అడ్డంగా పేర్చితే కొంత రక్షణ లభిస్తుందని తోచింది. ఆ చీకటిలో పని ప్రారంభించాడు. వింతగా తోచింది. ఆ పక్షులను స్పృశించటమే అత నికి రోతగా అనిపించింది. ఇంకా రక్తసిక్త మైన వాటి శరీరాలలో కొంత వేడి నిక్షి ప్తమై ఉంది. ఆ పని కడుపులో తిప్పు తున్నా అలాగే కొనసాగించాడు. అన్ని కిటికీ అద్దాలు పగిలిపోయి ఉండటం గమ నించాడు. లోపలి చెక్కలే ఇంట్లోకి పక్షులు రాకుండా కాపాడాయి. పగిలిన అద్దాలకు రక్తం ఓడుతున్న ఈ పక్షి కళేబరాలను గుచ్చాడు. పని పూర్తవగానే తిరిగి ఇంట్లోకి వెళ్లాడు. తలుపు మూసి అడ్డుగా బల్లలు పెట్టాడు. చేతుల కట్లు విప్పి, కొత్తవి కట్టు కున్నాడు. అతని భార్య 'కోకో‌వా' కలిపి ఇచ్చింది. 'మరేం భయపడకు' అని ఆమెకు ధైర్యం చెప్పాడు. పరుపుమీద పడుకుని కళ్ళు మూసుకున్నాడు. వెంటనే నిద్ర పట్టింది. కానీ ఏదో చేయవలసిన పని మరచిపోయినట్లుగా కలవరంగా కలగ న్నాడు. తన భార్య భుజం తట్టి లేపడంతో మెలుకువ వచ్చింది.

"మళ్ళీ వచ్చాయి ఆ పక్షులు. ఆ శబ్దం విన లేకుండా ఉన్నాను. అంతేకాక ఏదో కాలిన దుర్వాసన కూడా వస్తోంది" అన్నది.

అప్పుడతనికి గుర్తొచ్చింది. వంటింట్లో చిమ్నీ కింద మంట రాజేయడం మరి చాడు. అది దాదాపుగా ఆరిపోయింది. వెంటనే లేచి దీపం వెలిగించాడు. కిటికీల

వద్ద చప్పుడు నిర్విరామంగా సాగుతున్నా దానికన్నా ముఖ్యంగా కాలిన ఈకల వాసన అతనికి ఆందోళన కలిగించింది. గది అంతా ఆ దుర్గంధం వ్యాపించింది. పక్షులు చిమ్నీ ద్వారా వస్తున్నవని గ్రహించాడు. పుల్లలు, కాగితాలు మంటలో వేసి పారఫిన్ డబ్బా అందుకున్నాడు. 'అంతా దూరంగా ఉండండి' అని మంటలోకి పారఫిన్ విసిరాడు. గొట్టం పైదాకా మంటలెగసి మసిబారి, మాడిపోయిన పక్షిశరీరాలు గుట్టలుగా కింద పడ్డాయి.

"ఏమైంది? " అంటూ పిల్లలు లేచారు.

జవాబిచ్చే సమయం లేని నాట్ ఆ శరీరాలు ఇవతలకి లాగుతున్నాడు. ఈ జ్వాలల వల్ల చిమ్నీ అంటుకునే ప్రమాదం లేకపోలేదు. కానీ అంతకుమించి మార్గం లేదు. పొగగొట్టం పైభాగంలోని పక్షులు ఈ కీలల ప్రభావంవల్ల పారిపోయినా, కిందిభాగం మాత్రం అందులో చిక్కుకున్న వాటితో నిండిపోయింది. కిటికీల వద్ద ఉన్నవాటి గురించి అతను పట్టించుకోలేదు. చిన్న కిటికీలు, పటిష్ఠమైన గోడలతో కట్టిన తన పాత ఇంట్లోకి అవి ప్రవేశించడం కష్టం. కాని పెద్ద పెద్ద కిటికీలతో కట్టిన కొత్త ఇళ్ళలో ఉన్నవారి పాట్లు ఆ పరమాత్ముడికే ఎరుక!

"ఏడవకండి. ఏం భయపడనవసరం లేదు" అని పిల్లలను సముదాయించాడు.

తనపనివల్ల వచ్చే ధ్వని, బయట పక్షుల శబ్దాలు, ఈ మధ్యలో గడియారం గంటల చప్పుడు వినిపించింది. మూడు గంటలు అయింది. ఇంకా నాలుగు గంటల వ్యవధి మిగిలివుంది తెల్లారడానికి.

"చిన్న స్టవ్ వెలిగించి మనకు టీ, పిల్లలకు కోకోవా కలుపు" భార్యను పురమాయించాడు.

కొంతసేపటికి పైనుండి పక్షుల శవాలు పడటం ఆగిపోయింది. నుదుటిపైన స్వేదం తుడుచుకుని ఇవతలికి వచ్చాడు.

"జిల్! ఇంకొన్ని చితుకులు తే. పెద్ద మంట వేద్దాం"

జిల్ పక్షి శరీరాలవంక భయంగా చూస్తోంది.

"మరేం ఫర్లేదు. మంట వేసిన వెంటనే వాటిని గది బయట పడేద్దాం" ఇక చిమ్నీ అంటుకునే ప్రమాదం గడిచిపోయింది. అహోరాత్రాలూ అగ్నిహోత్రం వెలుగుతూ ఉంటే ఇకపై ఎలాంటి ప్రమాదం లేదు. మరిన్ని కట్టెలు కావాలి. అనుకూల వాతావరణం ఏర్పడ్డాక ఊళ్ళోకి వెళ్ళి తెచ్చుకోవాలి. ఇక ఈ పరిస్థితికి అనుగుణంగా సర్దుకుపోవాల్సిందే.

టీ తాగి, బ్రెడ్ స్లైసెస్ తిన్నారు.

"ఆపండి! మాయదారి పక్షులూ! మీ చప్పుళ్లను" అన్నాడు జానీ.

"అదీ! అలా అను. మనల్ని బాగా సతాయిస్తున్నాయి కదూ!" నాట్ ఉత్సాహపరిచాడు. ఇదేవిధంగా ధైర్యంగా ఉదయం ఏడు గంటల వరకు గడిపితే వార్తాప్రసారం ప్రకారం చేయవచ్చు.

ఆ పక్షులు చేసే సవ్వడి నిరవధికంగా సాగుతూనే ఉంది. ఇంతలో మరింత శక్తిమంతమైన మోత, ఏదో పెద్దపక్షి ముక్కుతో పొడస్తున్న చప్పుడు వినిపించింది. అది ఏమై ఉండవచ్చు? వడ్రంగిపిట్ట ఇంతకంటే వేగంగానే కానీ తక్కువ శక్తితో పొడుస్తుంది. గద్దేమో? పెద్దవి, క్రూరమైనవి అయిన పక్షుల గురించి ఇంతవరకూ ఆలోచించలేదు. రాబందులు, గరుడపక్షులు తమ ముక్కులు, పంజాలు ఉపయోగిస్తే తలుపులు ఎంతకాలం నిలుస్తాయి? కిటికీకి అడ్డుగా బీరువా ఉన్నందున ఫరవాలేదు కానీ పెద్దతలుపు విషయంలో మరిన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. అందుకు కావలసిన సరంజామా తేవడానికి పైగదులకు వెళ్ళాడు. ఒక గదిలో అప్పుడే పక్షుల ధ్వని

వినపడుతోంది. మరొక గదిలోనికి వెళ్ళి పక్షులు ప్రవేశించిన ఆ గదికి అడ్డంగా బల్లల్ని పేర్చసాగాడు.

"నాట్! పైనేం చేస్తున్నావ్? కిందికి రా" భార్య పిలుపు.

"వస్తున్నా. కొంతసేపు ఆగు"

పొద్దున్న ఐదున్నరకు ఫలహారం చేశారు. గడియారం వంక చూశాడు. ముళ్ళు చాలా మెల్లగా తిరుగుతున్నట్లు తోచింది. నిద్ర ముంచుకొస్తుండగా భార్య పిలిచింది.

"ఏమైంది? రేడియో ప్రసారం రావట్లేదు, ఏడు కావస్తున్నా" స్టేషన్ మార్చినా ప్రయోజనం లేకపోయింది.

"మనం తప్పుగా విని ఉంటాం. ఎనిమిది గంటలకు అయివుండొచ్చు"

ఎనిమిది కావస్తుండగా వెలుపల పక్షుల అలికిడి తగ్గిపోయింది. పిల్లలు నిద్రపోయారు. నాట్ ఎనిమిదిన్నరకు వైర్‌లెస్ కట్టేశాడు.

"అదేమిటి? వార్తలు వినద్దూ?" అంది భార్య.

"ఇక వార్తాప్రసారం ఉండదు. మనకు మనమే ఆధారం"

మెల్లగా తలుపు వద్ద సామగ్రిని తొలగించి తలుపుతీసి బయటకు వచ్చాడు. ముఖ్యంగా ఆహారం, కొవ్వొత్తులు, వంటచెరకు సంపాదించడం తక్షణ కర్తవ్యం. సముద్రపు పక్షులు వెళ్లిపోయినా ఇతర పక్షులన్నీ చెట్లపైనే ఉన్నాయి.

"నేను ఊర్లోకి వెళ్తున్నా" భార్యతో చెప్పాడు.

"మమ్మల్ని కూడా తీసికెళ్ళు. ఒంటరిగా ఉండేకన్నా అదే మేలు" అంది.

"పదండి. బుట్టలు, తోపుడుబండిని తీసుకురండి. సామాన్లు అందులో వేయవచ్చు"

"అదిగో పక్షులు!" జిల్ భయంగా అంది.

"పగలు అవి మనల్నేం చేయవు"

# చతుర ప్రవేశిక

## సెప్టెంబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. ప్రిన్స్‌పాల్ వెంకటేశ్వరరావు కొడుకు?
జ.
2. రికార్డు అసిస్టెంట్ గోపాల్ భార్య?
జ.
3. కాలేజీ స్టాఫ్ క్లబ్ సెక్రటరీ?
జ.
4. లెక్చరర్స్ అసోసియేషన్ ప్రెసిడెంట్?
జ.
5. ఇన్‌చార్జ్ ప్రిన్స్‌పాల్ పేరు?
జ.
6. 'పక్షులు' ఎవరి రచన?
జ.
7. 'సిస్టర్ కారీ' రచయిత?
జ.
8. మనదేశ తొలి దక్షిణాది ప్రధాని?
జ.
9. 'సంస్కార', 'భవ' నవలల రచయిత?
జ.
10. అమెరికన్ ఇండిపెండెన్స్ వార్ కాలం?
జ.

పంపినవారి పేరు: ----------------

------------------వయసు (  )

చిరునామా: ------------------

--------------------------

--------------------------

పిన్‌కోడ్:  ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

# భలే సేవలు!




**కు**క్కలకి పాశ్చాత్యులు శిక్షణనిచ్చి ఎన్నో అవసరాలకి వాడుకుంటున్నారు. మొదటగా జర్మన్ పోలీసులు వాసనని బట్టి అనుమానితుడి జాడ తెలుసుకునే శిక్షణని 1907లో ఇచ్చారు. ఇప్పుడు ప్రపంచంలోని అన్ని పోలీసు శాఖల వద్ద శునక దళాలు ఉన్నాయి.

మాదక ద్రవ్యాలని వాసనతో పసికట్టే శిక్షణని తొలుత అమెరికా పోలీసులు కుక్కలకి ఇచ్చారు. నేడు అన్ని అంతర్జాతీయ ఎయిర్ పోర్టులలో కుక్కలు ప్రయాణికుల సామాన్లను వాసన చూసి మాదక ద్రవ్యాలుంటే పసిగడతాయి. అలాగే బాంబుల్లో ఉపయోగించే



వివిధ రసాయనిక, మందుగుండు సామగ్రిని కూడా కుక్కలకు వాసనబట్టి పసిగట్టే శిక్షణనిచ్చి వినియోగించుకుంటున్నారు.

ఇప్పుడు పాశ్చాత్య దేశాల్లో గుడ్డివాళ్ళకి దారిని చూపించేందుకూ కుక్కలకు శిక్షణనిస్తున్నారు. తన యజమానిని ఆ కుక్కలు జాగ్రత్తగా రోడ్డు దాటించగలవు.

వేటాడిన పక్షులని యజమానికి తెచ్చిచ్చే శిక్షణను బ్రిటిష్‌వారు తమ కుక్కలకు వందల ఏళ్ళుగా ఇస్తున్నారు. వాసనని పసిగట్టే సందర్భాల్లోని కుక్కలు ఆల్సేషియన్ (జర్మన్ షెపర్డ్) జాతికి చెందినవి. దుకాణాలు, బ్యాంకులు వంటిచోట్ల రాత్రిళ్ళు కాపలాగా బుల్ డాగ్‌లను ఉంచుతారు. దొంగలు వస్తే వారిమీదకి దూకి మెడని కొరికే శిక్షణని అవి పొందివుంటాయి. భవిష్యత్తులో ఇంకా ఎలాంటి అవసరాలను తీర్చే శిక్షణను కుక్కలకు ఇస్తారో వేచి చూడాల్సిందే!

వాళ్ళు నడక సాగించినా ఏ పక్షులూ కదల్లేదు. ఊరి చివరకు రాగానే భార్యా పిల్లలను అక్కడే వేచి ఉండమన్నాడు.

"కానీ నేను మిసెస్ ట్రిగ్గ్‌ని కలుసుకోవాలి" అంది భార్య.

"ఇక్కడే ఉండండి. క్షణంలో వస్తాను" అని వెళ్ళాడు ట్రిగ్. గృహావరణంలో ఆవులు, మేకలు అటూ ఇటూ అసహనంగా తిరుగుతున్నాయి. చిమ్నీల నుండి పొగ కూడా రావడం లేదు. నాట్‌కు ఏదో అనుమానం కలిగింది. వేగంగా నడిచివెళ్ళాడు. ఆవులు చేపిన పొదుగులతో అంబారావాలు చేస్తున్నాయి. ఇంటి కిటికీల అద్దాలన్నీ తునాతునకలై ఉన్నాయి. ముంగిట్లో కనిపించింది.. వికృతంగా, ఖండఖండాలుగా విడిపోయిన జిమ్ శవం. పక్కనే తుపాకీ. తలుపులు, తాళాలు వేసి ఉన్నా, అద్దాలు పగిలిపోయినందున కిటికీ తలుపులు తీసి లోపలికి వెళ్ళడం తేలికయింది. టెలిఫోన్ పక్కనే ట్రిగ్ శవం. రిసీవర్ బల్లకిందకు వేలాడుతోంది. ఇక మిసెస్ ట్రిగ్ పరిస్థితి ఏమైవుంటుందో ఊహించగలిగాడు.

చేయగలిగేదేమీ లేదు. సమయం చాలా తక్కువ. ఆపత్సమయంలో వారి వస్తు సామగ్రిని వాడుకున్నందుకు ట్రిగ్ కుటుంబం వారు తమను మన్నిస్తారని ఆశించాడు. బయటకు వచ్చి "కార్లో వస్తువులన్నీ పెడ్తాను. ముందుగా ఒక విడత ఇంటికి చేర్చాక, మరొక తడవ వద్దాం" అన్నాడు.

"కానీ ట్రిగ్స్‌ని అడగొద్దా?" అంది భార్య.

"అక్కర్లేదు. వాళ్ళు స్నేహితుల వద్దకు వెళ్ళి ఉంటారు" అన్నాడు నాట్.

"నేనూ వచ్చి సాయం చేయనా?"

"వద్దు" వారించాడు నాట్.

మెల్లగా కారు ఇవతలకు తీసి లోనుండి సామాను తేవటం ప్రారంభించాడు.

భార్య ఆసరికే పరిస్థితి ఆకళింపు చేసుకొంది కాబోలు. వచ్చి సహాయపడే ప్రయత్నమేమీ చేయలేదు.

అన్నీ తీసుకుపోవడానికి మూడుసార్లు తిరగవలసి వచ్చింది. కిటికీలకు కొత్త చెక్కలు, మైనం, మేకులు, ముడి ఆహారం.. అంతులేని జాబితా. ఆపైన మూడు ఆవుల పాలు పితికాడు. మిగిలిన వాటి ఘోష విన డానికి, ఆర్తి తీర్చడానికి సమయం లేదు.

తిరుగు ప్రయాణంలో మధ్యన ఆగి టెలి ఫోన్ ప్రయత్నించాడు. లాభం లేకపో యింది. అదీ మూగబోయింది. ఒక గుట్ట ఎక్కి పరిసరాలు పరిశీలించాడు. ఎక్కడా జనసంచారం లేదు, చెట్లపై పిట్టలు తప్ప. అవి ఈసరికి ఆహారం వెతుక్కుంటూ ఉండాలే! కానీ గురుకొచ్చింది. రాత్రే కడుపు ల నిండుగా భోంచేసి ఉంటాయి. అందుకే మెదలకుండా ఉన్నాయి.

మళ్లీ కారులో తిరిగి వచ్చారు. ఇక గంట మాత్రమే ఉంది. సామానంతా లోనికి చేర్చాలి. భార్యను వంటచేయమని పురమా యించి తన పనిలో నిమగ్నమయ్యాడు. అధికారుల నిర్లక్ష్యాన్ని మనసులో నిందించు కున్నాడు. పడకగది చిమ్నీపై తన పనిని కొంతసేపు ఆపి, సముద్రంవైపు దృష్టి సారించాడు. ఏదో బూడిద, తెలుపురంగు లలో తేలియాడుతూ అగుపించింది. 'హమ్మయ్య! నౌకాదళం వస్తోందన్నమాట' అనుకున్నాడు.

కానీ అతని ఆశ నిరాశే అయింది. అవన్నీ గల్స్. నాట్ నిచ్చెన దిగి ఇంట్లోకి వెళ్లాడు. రెండు గంటలు దాటింది. అందరూ భోంచేస్తున్నారు. తలుపు గడియ పెట్టి దీపం వెలిగించాడు.

"రాత్రయిపోయింది" అన్నాడు జానీ. రేడియో పెట్టినా ప్రయోజనం శూన్యం.

"అన్ని కేంద్రాలూ ప్రయత్నించాను. ఏదీ రాలేదు" అంది భార్య.

"బహుశా యూరప్ అంతా ఇదే సమస్య వచ్చి ఉండొచ్చు" అన్నాడతను.

ఒక పళ్లెం నిండుగా సూప్‌పోసి, బ్రెడ్ ముక్కలతో అతనికిచ్చింది భార్య. మౌనంగా భోంచేయసాగారు. జానీ మూతి నుండి సూప్‌కారి బల్లపైన పడింది.

"మేనర్స్ నేర్చుకో జానీ! మూతి తుడుచు కోవడం తెలీదా? " గద్దించింది జిల్.

మళ్ళా యథావిధిగా దుర్భరమైన పక్షుల శబ్దం మొదలయింది.

"అమెరికావారు సాయం చేయరా? మనకు చిరకాల స్నేహితులు కదా? " భార్య ప్రశ్న.

నాట్ సమాధానం ఇవ్వలేదు. తన కర్త వ్యాన్ని గురించే దీక్షగా ఆలోచిస్తున్నాడు.

అన్ని తలుపులూ సురక్షితంగా చెక్కలతో బంధించబడి ఉన్నాయి. ఇంట్లో సం బారాలు, ఇంధనం, మరికొన్ని రోజుల వ రకు సరిపడే సామగ్రి ఉన్నది. భోజనానం తరం అన్ని వస్తువులూ సర్దే కార్యక్రమం తలపెట్టాలి. భార్యాపిల్లలూ కూడా సాయప డతారు. ఈ నిరంతర రొదలో విశ్రాంతి గగన కుసుమమే. అందుకు వాతావర ణంలో మార్పు మాత్రమే అనుకూలం. కిటి కీల భద్రతకు ఒక నూతన పథకం ఆలో చించాడు. అన్నిటికీ ఇనుపతీగలు బిగిం చడం. కానీ ఇప్పుడాపని చీకట్లో చేయాల్సి ఉంటుంది. మునుపే ఈ ఆలోచన వస్తే బాగుండేది.

చిన్న చిన్న పక్షులు కిటికీలవద్ద చేరిన సవ్వడి వినిపిస్తోంది. కానీ గద్దలు కిటికీల వద్దకాక పెద్ద తలుపులపైనే దాడి సలుపుతున్నాయి.

విరుగుతున్న చెక్కముక్కల చప్పుడు వింటూ నాట్, ఈ పక్షుల మెదళ్ళలో ఎన్ని వేల సంవత్సరాల జ్ఞాపకాలు నిక్షిప్తమై ఉన్నాయో, ఈవిధంగా యంత్ర సదృశమైన పనితనంతో మానవాళి నిర్మూలనకు పూను కున్నాయని అనుకున్నాడు. ఇక భవిష్యత్తు అనూహ్యం! అగమ్యగోచరం! కణకణ మంటూ చిటపటలాడే అగ్నికీలల వంక తదేకంగా చూడసాగాడు. ©

# హా హా.. అమెరికా 6

## అగ్రరాజ్య యుద్ధాహంకారం!

**అమెరికా చరిత్రను పరిశీలిస్తే దాని పాలకులు ఎంతటి యుద్ధోన్మాదులో తెలుస్తుంది. అమెరికా సైన్యాలు తమ భూభాగం దాటి విదేశాల్లోకి చొరబడి అనేక యుద్ధాలు చేశాయి. రెండో ప్రపంచ యుద్ధం చివర్లో నాజీలు ఆక్రమించిన యూరోపియన్ దేశాలకు అమెరికా తన సైన్యం పంపి యుద్ధం చేసింది. ఇదే సమయంలో పెరల్‌హార్బర్‌లోని అమెరికా యుద్ధ నౌకలమీద జపాన్ దాడి చేసిందనే సాకుతో, ప్రతీకారంగా హిరోషిమా, నాగసాకిల మీద అణుబాంబులు ప్రయోగించింది. లక్షలాది మంది అమాయక ప్రజలను బలితీసుకుంది.**

1775-1783 మధ్య అమెరికా భూభాగం మీద అంతర్యుద్ధం జరిగింది. దీన్ని అమెరికన్ వార్ ఆఫ్ ఇండిపెండెన్స్ అంటారు. గ్రేట్ బ్రిటన్‌కు, ఉత్తర అమెరికాలోని పదమూడు బ్రిటిష్ కాలనీలకు జరిగిన ఈ యుద్ధం అమెరికా నేలమీద జరిగిన అతిపెద్ద యుద్ధం. ఫ్రాన్స్, స్పెయిన్, డచ్చి రిపబ్లిక్‌లు రహస్యంగా అమెరికన్ తిరుగుబాటు సైన్యానికి ఆయుధాలు సమకూర్చాయి. అందులో గెలవబట్టే అమెరికా స్వతంత్ర దేశంగా అవతరించింది. సెప్టెంబరు 11, 2001న న్యూయార్క్‌లోని ట్విన్ టవర్స్‌పైన ఉగ్రవాదదాడిని నాటి అమెరికా అధ్యక్షుడు జూనియర్ బుష్, తమ దేశంపై సైనికదాడిగా ప్రకటించి ఆఫ్ఘనిస్తాన్, ఇరాక్‌లపై యుద్ధానికి దిగాడు.

**కొరియన్ వార్:** ఉభయ కొరియాల మధ్య జరిగిన యుద్ధంలో దక్షిణ కొరియాకి సాయంగా అమెరికా సైన్యాన్ని పంపింది. అమెరికా బద్ధశత్రువు, ఆనాటి కమ్యూనిస్ట్ సోవియట్ యూనియన్ అండ ఉత్తర కొరియాకు లభించింది. తన ఆధిక్యతని నిరూపించుకునేందుకే అమెరికా దక్షిణ కొరియా పక్షం వహించింది. ఆనాటి అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ ఈ యుద్ధాన్ని 'పోలీస్ యాక్షన్'గా అభివర్ణించాడు. ఈ యుద్ధం 27 జూలై 1957 దాకా మూడేళ్లు సాగింది. యుద్ధరంగంలో 33,686 మంది, యుద్ధరంగం బయట 2,830 మంది అమెరికా సైనికులు మరణించారు. అంతేకాక 8,176 మంది మిస్సింగ్ జాబితాలో ఉన్నారు.

**వియత్నాం యుద్ధం:** దక్షిణ వియత్నాంపై ఉత్తర వియత్నాం దాడి చేసింది. దాంతో కమ్యూనిస్ట్ వ్యతిరేక దేశాలతో అమెరికా ఈ యుద్ధంలో ప్రవేశించింది. దక్షిణ వియత్నాంని గెలుచుకుని, దాన్ని కమ్యూనిస్ట్ దేశంగా మార్చకుండా చూడడానికే ఇందులోకి ప్రవేశించినట్టు చెప్పుకుంది. నవంబర్1, 1955 నుంచి ఏప్రిల్30, 1975 దాకా దాదాపు ఇరవై ఏళ్లు యుద్ధం కొనసాగింది. స్వదేశంలోనే అమెరికా ప్రజలు ఈ యుద్ధానికి వ్యతిరేకంగా నిరసనలు వ్యక్తం చేశారు. ఈ యుద్ధరంగంలో 47,424 మంది, యుద్ధానికి బయట 10,785 మంది అమెరికా సైనికులు మరణించారు. 1,53,303 మంది గాయపడ్డారు. 2,489 మంది గల్లంతయ్యారు.

అమెరికా విమానంలోంచి కురిపించిన బాంబులవల్ల రెండు లక్షల మంది వియత్నాం పౌరులు మరణించారు. పది లక్షల మంది నిర్వాసితులైనారు. అమెరికా ఉపయోగించిన రసాయనిక పదార్థాలవల్ల వియత్నాంలో అవకరమైన పిల్లలు జన్మిస్తున్నారు. పౌరులు తీవ్ర వ్యాధులకి గురయ్యారు. వియత్నాం యుద్ధంలో పాల్గొన్న అమెరికా సైనికుల్లో అధికులు సమాజానికి కీడు చేసే

మానసిక రోగులయ్యారు. స్వదేశం తిరిగివెళ్ళాక, అమాయకులని చంపే మానసిక ధోరణి వారిలో పెరిగింది. ఉత్తర వియత్నాంకు చెందిన పద కొండు లక్షల సైనికులు మరణించారు. దక్షిణ వియత్నాం సైనికుల మరణానికి లెక్కేలేదు. అ గ్రరాజ్యం ఈ యుద్ధంలోకి చొరబడి తప్పు చేసిం దని అమెరికా పౌరులు నేటికీ భావిస్తుంటారు.

**గల్ఫ్ వార్** : ఆగస్టు 2, 1990 నుంచి ఫిబ్ర వరి 28, 1991 దాకా జరిగిన పర్షియన్ గల్ఫ్‌వా ర్‌లో 34 దేశాలకు నేతృత్వం వహిస్తూ అమె రికా, ఇరాక్ మీదకి యుద్ధానికి దిగింది. కువైట్‌ను ఇరాక్ ఆక్రమించుకున్నదనే కారణం చూపింది. దీనికి ఫస్ట్ గల్ఫ్‌వార్ అని పి లుస్తారు. కువైట్ మీదకి సద్దాం హుస్సేన్ సైన్యం దాడి చేయడంతో ఆనాటి అమెరికన్ అధ్యక్షుడు సీనియర్ జార్జిబుష్ సైన్యాన్ని పంపాడు. మిగిలిన మిత్ర దేశాలైన ఈజిప్ట్, బ్రిటన్ ఎక్కువ సైన్యాల్ని పంపాయి. అమెరికాకి సహాయంగా నిలిచి, కువైట్‌కి స్వాతం త్ర్యాన్ని కలిగించాయి. అమెరి కన్ టీవీ సంస్థ సిఎన్ఎన్ ఈ యుద్ధాన్ని లైవ్ న్యూస్‌గా ప్రసారం చేయడంతో దీన్ని 'వీడియోగేమ్ వార్' అన్నారు. ఇరాకీ సైన్యాన్ని కువైట్ నుంచి పంపడానికి జనవరి 17, 1991న విమానంలోంచి బాంబింగ్ చేశారు. ఫిబ్రవరి 23న నేలమీద యుద్ధం చేసి 28నాటికి కువైట్‌ని విడిపించారు. నేలమీద వంద గంటల యుద్ధా నంతరం ఆ పోరు ముగిసింది. ఈ యుద్ధంలో ఇరాక్ తన శత్రువులకి సహాయం చేసిన సౌదీ అరేబియా మిలటరీ స్థావరాలమీద, ఇజ్రాయిల్ మీద స్కడ్‌మిస్సైల్స్‌ని ప్రయోగించింది. కువైట్ లోని చమురు బావులకోసమే అమెరికా యుద్ధా నికి దిగిందనే ఆరోపణ నేటికీ ఉంది. ఈ యుద్ధాన్ని అమెరికన్ ప్రజలు వ్యతిరేకించలేదు. ఇందులో యుద్ధరంగంలో 113 మంది అమెరికన్ సైనికులు, దానికి బయట 148 మంది మరణిం చారు. అంతేకాకుండా 849 మంది గాయపడ్డారు.



**అఫ్ఘన్ యుద్ధం** : సెప్టెంబర్ 11 దాడికి ప్రతీ కారంగా అక్టోబర్ 7, 2001న అమెరికా సైన్యం, ఆల్ ఖైదా స్థావరమైన ఆఫ్ఘనిస్థాన్‌పై దాడి చేసింది. తాలిబన్ సామ్రాజ్యాన్ని కూలదోయ డమే లక్ష్యంగా పేర్కొంది. ఆల్‌ఖైదాని సర్వనా శనం చేసి, దాని నిర్వాహకులను కోర్టులో విచార ణ చేయాలంది. ఓడిపోయిన తాలిబన్లు పాకిస్థా న్‌లో తలదాచుకున్నారు. ఇస్లామిక్ రిపబ్లిక్ ఆఫ్ ఆఫ్ఘనిస్తాన్‌ను స్థాపించిన ముప్పైవేల మంది అమెరికన్ సైన్యం నేటికీ ఆఫ్ఘనిస్తాన్‌లోనే వుంది. 2014నాటికి అమెరికన్ సైన్యాన్ని వెనక్కి పిలుస్తా మని ఒబామా డిసెంబరు 1, 2009న ప్రకటిం చాడు. యుద్ధంలో 1,081 మంది, యుద్ధరంగానికి బయట 332 మంది అమెరికా సైనికులు, మరణించారు. 9,971 మంది గాయపడ్డారు.

**ఇరాక్ యుద్ధం** : రెండో గల్ఫ్‌వార్, ఆపరే షన్ ఇరాకీ ఫ్రీడంగా పిలిచే ఈ యుద్ధం మార్చి 20, 2003న మొదలైంది. అమెరికా అధ్యక్షుడు జూనియర్ బుష్, బ్రిటిష్ ప్రధాని టోనీబ్లెయిర్ ఇరాక్ మీద దాడి చేసారు. ఇరాక్‌లో అణ్వాయు ధాలు ఉన్నాయనే నెపంతో ఇది ఆరంభమైంది. అయితే అలాంటి ఆయుధాలేవీ లేవని తేలింది. అమెరికన్లు ఈ యు ద్ధాన్ని నిరసించారు.

లక్షల ప్రాణాలను, డబ్బుల ను ఫణంగా పెట్టి ఇతర దేశా లపై దాడికి దిగడం అమెరికాకు పరిపాటి. అందువల్లనే భార తీయ మీడియా అమెరికాని 'పెద్దన్న' అంటుంది. ఇంకా 1958లో లెబనాన్ సంక్షోభంలో, 1965లో డొమెనికన్ రిపబ్లిక్‌లో, 1980లో ఇరాన్‌లో, 1980-92లో ఎల్‌సాల్విడార్ సివిల్ వార్‌లో, 1982-84లో బీరూట్‌లో, 1986లో లిబియాలో, 1989లో పనామాలో, 1992-93లో సొమాలియాలో, 1994-95లో హైతీలో, 1994 నుంచి నేటి వరకూ కొలంబియాలో, 1995-2005 దాకా బోస్నియాలో కూడా అమెరికా సైనిక చర్యలని చేపట్టింది.

అమెరికా యుద్ధోన్మాదం వల్ల వేలాది మంది మంది అమెరికన్ మహిళలు కొడుకులను, భర్త లని, తండ్రులని కోల్పోయారు. ప్రజలు చెల్లించిన కోట్లాది డాలర్లు బుగ్గిలో కలిసాయి. తమ వెబ్ సైట్లను హ్యాకింగ్ చేసేవారు ఉన్న దేశాలను తమమీద యుద్ధం ప్రకటిస్తున్న దేశాలుగా పరి గణిస్తామని ఇటీవల ఒబామ ప్రకటన చేసాడు.

– డి. పద్మజ

గతనెల పజిల్ పూరించి, అన్నీ సరైన సమాధానాలు రాసినవారిలో డ్రా ద్వారా ఎంపికైన విజేత

**దూసూళ నిర్మలాదేవి**

ఫ్లాట్ నెం. 301,
యస్. ఆర్. టవర్స్,
మీటర్ ఫ్యాక్టరీ రోడ్,
ఎర్రగడ్డ,
హైదరాబాద్- 500018

వీరికి రూ. 150/- త్వరలోనే అందుతాయి.

## చతురంగం -5 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 గు | లే | ఖ | 2 కా | 3 వ | ళి | 4 క | థ | | 5 నె |
| ర | | | 6 శీ | ల | | లి | | వే | 7 ల |
| 8 జా | వ | 9 ళి | | 10 పు | 11 డ | మి | | 12 మ | రా |
| డ | | 13 వ | 14 డ | | జ | | 15 మా | న | జు |
| | 16 క | ర | వా | 17 లం | | 18 రి | | | |
| 19 వే | శ | | | 20 క | లు | పు | మొ | 21 క్క | 22 లు |
| ట | | 23 నా | భి | లో | | | | 24 అ | టు |
| 25 గా | 26 రు | కం | | | 27 త | ల | 28 వం | | భ |
| 29 డు | మా | | 30 ప | త | నం | | 31 ద | శో | య |
| | 32 లు | ల | తి | | 33 వే | త | నం | | మ |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. యు. విజయశేఖర రెడ్డి, కూకట్ పల్లి, 2. యు. యు. యు., ఎమ్మిగనూరు 3. కె.వి. దుర్గామోహనరావు, వనస్థలిపురం, 4. కె. సత్యనారాయణ, ఆమందూరు, చిత్తూరు జిల్లా, 5. ఎం. ప్రేమ సుందరి, హైదరాబాద్, 6. కె. నాగ వెంకట ఆంజనేయులు, విశాఖపట్నం, 7. జి. సత్య, రామకృష్ణాపురం, 8. కె. సుధాకర్ రెడ్డి, కోట, నెల్లూరు జిల్లా, 9. పి. సీతా మహాలక్ష్మి, తిరుపతి, 10. బిక్కునూరి రాజేశ్వర్, ఈదిగాం, ఆదిలాబాద్ జిల్లా, 11. ఎస్. అబ్దుల్ అజీజ్, పెద్దమందడి, మహబూబ్‌నగర్ జిల్లా, 12. టివిడిఎస్. సీతారామారావు, విజయవాడ, 13. బి. కృష్ణవేణి, చెన్నై, 14. ఎం. వసంత, బోరబండ, 15. కె. మధుసూదనరావు, నిజామాబాద్, 16. వి. సీతా నరశింహారావు, విజయవాడ, 17. ఎ. దినేష్‌బాబు, తిరుపతి, 18. టి. ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి, 19. పింగళి భరణీరావ్, విశాఖ, 20. సి.జి. శంకరరావు, హైదరాబాద్, 21. జి. సూర్యమిత్ర, జమ్మలమడుగు, 22. కోట లలిత, సికింద్రాబాద్, 23. వాడపర్తి వెంకటరమణ, విశాఖ, 24. వాణి నేమాని, విశాఖ, 25. కె.ఎస్. ఆచార్యులు, విజయనగరం, 26. పి. సుబ్బారావు, సంగారెడ్డి, 27. పచ్చిగోళ్ల కుసుమ కుమారి, రాయకుదురు ప.గో. జిల్లా, 28. వేదుల నరసింహమూర్తి, హైదరాబాద్, 29. యు. చిట్టిబాబు, న్యూ పాల్వంచ, 30. జి. ముత్తుమారన్, విజయవాడ, 31. యం. సీత, భద్రాచలం, 32. గేదెల రామారావు, ఏలూరు, 33. జి. లలిత కుమారి, కడప, 34. ఎ. సామ్రాజ్య లక్ష్మి, హైదరాబాద్, 35. శ్రీపెరంబుదూరు నారాయణ రావు, హైదరాబాద్, 36. ఎస్.వి. రమణి, బంజారాహిల్స్, హైదరాబాద్.

# చతురంగం - 6 ఆధారాలు

**అడ్డం**

1. ముక్కంటి నివాసం (3)
3. వెంకీ, ఆశిన్‌ల సినిమా.. పోరు (3)
5. చోటు (2)
7. తన్ను (3)
9. ఇంగ్లీషులో బేస్..క్లూ..తెలుగులో గజిబిజి (4)
11. సంతోషమే..ఉషాకిరణ్‌వారి ఓసినిమా (3)
12. పొట్టిని ఇలాకూడా అంటారు (3)
13. బాటసారుల విశ్రాంతి గృహం (2)
14. క్యారెక్టర్ తెలుగులో (3)
16. యుద్ధము (3)
19. ఏకులా వచ్చి ఇదయ్యాడనేది సామెత. ఏమిటా 'ఇది?' (2)
20. నిలువు 17 వాద్యమే అటునుంచి (2)
21. విలువ.. పేరుబాగా ఉండడం. ఈపేరుతో సహకార సంఘాలుంటాయి (4)
24. తెలుగులో జనరేషన్ (3)
27. ప్రకాశం జిల్లాలో ఈ పట్టణం చీరలకు ప్రసిద్ధి (3)
28. నెల్లూరు జిల్లాలోని ఈ ఊరు తమిళనాడుకు మనకు సరిహద్దు (2)
30. పెత్తనం/ అధికారం చెలాయించడం (3)
32. ఇప్పుడు మీరు పూరిస్తున్నదే (4)
33. ఏనుగు అటునుంచి (2)
35. 'ర' గుణింతం మొదలు (3)
37. ఏదైనా పెద్దప్రమాదం గడిస్తే 'ఇది' గడిచిందంటారు. ఏమిటా 'ఇది'? (2)
38. తెలుగులో ఎక్స్‌పెర్మెంట్ అటునుంచి (3)
39. మహాభారతం రాసిన ముగ్గురు కవుల్ని కలిపి ఇలా అంటారు (4)

**నిలువు**

1. రామాయణంలో భరతుని తల్లి (2)
2. బిడ్డలు (3)
3. గొప్ప (2)
4. అవధానాల్లో జ్ఞాపక శక్తిని ప్రదర్శించేది తడబడింది (3)
5. నక్షత్రం/ నటి (2)
6. మోక్షాన్ని కోరుకునేవాడు తడబడ్డాడు (4)
8. శిక్ష చెల్లాచెదురు (3)
10. మాటల్లో చెప్పినదాన్ని చేతల్లో పెట్టడం (5)
11. తొందరపాటు (2)
12. కోపంతో ఉడికిపోవడాన్ని ఇలా అంటారు (4)
13. గరుకుగా ఉండే పెద్దకాయ కిందనుంచి (3)
15. తలకిందులైన సౌధము (2)
17. సరస్వతీదేవి చేతుల్లో ఉండే వాద్యం తలకిందులు (2)
18. ఉత్తరరామాయణం రాసిన 'కంకంటి' పూర్తిపేరు (4)
22. మహిళలు కట్టుకునే వస్త్రం తలకిందులు (2)
23. నువ్వులు (3)
25. రాంగోపాలవర్మ రెండు భాగాలుగా తీసిన రియల్‌స్టోరీ (5)
26. జానపద కథల్లో కనిపించే గద్దలాంటి పెద్ద పక్షి గందరగోళం (5)
28. అల లాంటిదే కాకుంటే కాస్త చిన్నది/ కూచిపూడి నృత్యంలో ఓ భాగం (3)
29. సర్పం (3)
31. చెయ్యి.. కిందనుంచి (3)
34. చిలకమర్తి రాసిన ప్రఖ్యాత పౌరాణిక నాటకం పేరులో మొదటి రెండక్షరాలు (2)
36. అశ్వత్థ వృక్షమే తెలుగులో (2)

**నిబంధనలు**

1. చతురంగాన్ని అదేపేజీలో పూర్తిచేసి పంపాలి. 2. తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. 3. గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలింపబడవు. 4. ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. 5. ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. 6. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు ★ చతురంగం, చతురప్రవేశిక, కాప్షన్ మీదే, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం

# చతురంగం - 6

రూ.150/- బహుమతి

గడువు తేది : సెప్టెంబరు 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | | 4 | | 5 | 6 |
| | | 7 | 8 | నం | | 9 | 10 | | |
| | 11 | | | | 12 | | | | క్షు |
| 13 | | | 14 | 15 | | | 16 | 17 | |
| | | 18 | | 19 | కు | | 20 | | |
| 21 | 22 | | 23 | | 24 | 25 | | | 26 భే |
| | 27 | | | | | | | 28 | |
| 29 | | 30 | | 31 | | 32 | | | |
| 33 | 34 | | | 35 | 36 | | | 37 | |
| 38 | | | | 39 | | | | | |

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (      ) చిరునామా : ----------------------------------

----------------------------------------------------------------

------------------ పిన్ : ------------ ఫోన్ : ----------------

ఆధారాలు, నిబంధనలు 129 పేజీలో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

# కాప్షన్ మీదే - 33

ఈనాడు కార్టూనిస్ట్,
ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్
వేసిన ఈ కార్టూన్‌కు
నవ్వొచ్చే కాప్షన్ రాయండి.
చక్కని బహుమతి
అందుకోండి!
బాగున్న మరో నాలుగు
ఎంపిక చేసి,
పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.



మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 17

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@eenadu.net

ఉత్తమ వ్యాఖ్య :

బతికున్న ఏనాడూ
మూర మల్లెపూలు తేలేదు గానీ,
ఇప్పుడు మాత్రం గులాబీలు

—జుజ్జూరి వేణు,
దేవులపల్లి, ప.గో.జిల్లా



## కాప్షన్ మీదే -32

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

నిన్ను వదిలి నేను పోలేనులే
ఇదీ నిజములే...

- బి. రాజేశ్వర్, ఈదిగాం, ఆదిలాబాద్ జిల్లా

చచ్చాక తప్పు తెలుసుకున్నా.. సారీ!
బతికున్నప్పుడు కాల్చుకుతిన్నా.. సో సారీ!!

- యు. చిట్టిబాబు, న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా

శ్రీమతీ! చచ్చి ఏలోకంలో ఉన్నావో
పెళ్ళికిస్తానన్న మంచం
రైల్ పార్సెల్‌లో ఇవాళ అందింది!

- జి. గోపాలకృష్ణ, అరసవిల్లి

మీ సమాధిమీద పూలు పెట్టే
అదృష్టం లేకుండా పోయింది

- వెన్నా సాయి శ్రీరామ్,
మల్లారెడ్డినగర్, సికింద్రాబాద్

